అపరాధ పరిశోధన అనుబంధం—6

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## పగవాడు?

రచన: మిస్. మధుబాల

## హంతకులొస్తారు జాగ్రత్త!

రచన: ఏ. వీ. మోహన్రావ్

## దుష్టులు - దురాగతాలు

రచన: కె. శివరామ్

## ప్రాక్టికల్ టెస్ట్!

రచన: రమణశ్రీ

"ఖైదీ" సీరియల్ ప్రారంభం!

అపరాధ పరిశోధన సప్లిమెంట్—6
జూన్, 1974
వెల: రు. 2-50
ఏడాది చందా 33 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
మల్లాది వెంకటకృష్ణమూర్తి
వాసవదత్త
కంచర్ల రమణ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
శ్యాంబాబు
మిస్. మధుబాల

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్—36959

ముద్రణ:
క్రాంతి ప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

# మీరే ఎన్నుకోండి?

ఈ "సప్లిమెంట్" లో మొత్తం నాలుగు క్రైమ్ నవలలు ప్రచురించబడ్డాయి. నాలుగు నవలలూ మీ అభిమాన రచయితలు రాసినవే. వీటిలో మీకు అత్యుత్తమంగా తోచిన నవల పేరు ఒకటవ నెంబరు ప్రక్కన వ్రాయండి. తర్వాత వరుసక్రమంలో మీకు నచ్చిన మిగతా మూడు నవలల పేర్లు పూరించండి. పాఠకుల ఎన్నిక ప్రకారం అత్యుత్తమ నవల నిర్ణయించబడుతుంది.

పాఠకులు ఉత్తమ నవలగా ఎన్నుకొన్న ఆ నవలా రచయితకు రు. 116/-లు బహుమతి, నాలుగు నవలల ఎన్నికను సరైన వరుసక్రమంలో చెప్పగలిగిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10/-లు చొప్పున బహుమతి ఇవ్వబడుతుంది.

కూపన్

జూన్ '74 నెల "సప్లిమెంట్"లో మేము మెచ్చిన నవలలు వరుసగా ఇవి:

1 ..............................

2 ..............................

3 ..............................

4 ..............................

పై కూపను కొట్టివేతలు లేకుండా పూర్తి చేసి, యీ పేజీ పూర్తిగా కత్తిరించి, యీ నెల 10 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి. మీ చిరునామా వెనుక ప్రక్కన వ్రాయటం మరచిపోవద్దు. ఫలితాలు వచ్చే నెల "అపరాధ పరిశోధన" మాసపత్రికలో ప్రచురించబడతాయి.

# పగవాడు?

మిస్. మధుబాల

ధర్మదాస్ మధ్యాహ్నం రెండుగంటల ప్రాంతంలో రైలు దిగాడు. ఎండ నిప్పులు చెరగుతూంది. టికెట్ కలెక్టర్ కి టికెట్ అందించి స్టేషన్ బయటకు వచ్చాడు. బయట ఏమంత రద్దీగా లేదు.

ఒకసారి తననితాను చూసుకుని, ఫర్వాలేదు అనుకున్నాడు.

కాషాయ వర్ణపు కమీజు. జబ్బలవరకున్న చేతులు. కమీజుకి గుండీలులేవు. నడుముచుట్టూ కాషాయవర్ణపు తాడుతో కమీజుని బిగించాడు. పైకిబిగించి కట్టిన ధోవతి. ధోవతి కుచ్చెళ్లు నేలపై పారాడకుండా పైకిలేపి కట్టాడు.

ఒక్కసారిగా అతన్ని చూస్తే సాత్వికుడు అనిపించే

సద్భావన కలుగుతుంది.

"మధురం మధురం అధరం మధురం
అధరం తాకిన వేణువు మధురం."

తనలో తానే మధురంగా పాడుకుంటూ ముందుకిసాగాడు. పది, పదిహేను నిముషాల్లోనే అతను నది ఒడ్డున ఇసుకపై తూర్పుదిక్కున నడవసాగాడు.

దీనానాథ్ అతనికదే చెప్పాడు.

అలా బాగా ముందుకి సాగిన తరువాత కొన్ని ఇళ్ళు కనిపిస్తాయి. ఆ తరువాత ఖాళీస్థలం. అది దాటగానే అలల తాకిడికి అక్కడక్కడ విసిరివేయబడిన గవ్వల్లా మళ్ళీ ఇళ్ళు. ఆ నదికి కొంచెం దూరంలోనే ఒక చిన్న కిరాణాకొట్టు. దాన్ని కూడా దాటుకుని దక్షిణపువైపుకి మళ్ళితే నాగజెముడు పొదలతో చుట్టుముట్టివున్న దీనానాథ్ ఇల్లు కనిపిస్తుంది. ఆ నాగజెముడు ఆవరణలో ఇంటిముందు రేగుపళ్ళ చెట్టుంది.

'ఇంత స్పష్టంగా చెప్పిన తరువాత దీనానాథ్ ఇల్లు కనుక్కోవడం ఏమంత కష్టంకాదు' అనుకున్నాడు ధర్మదాస్.

దీనానాథ్ ఇంటిలో మొత్తంవుండేది నాలుగు జీవాలే! దీనానాథ్, అతని భార్య, ఇద్దరు కొడుకులు. పెద్దవాడికి పది, పదకొండు ఏళ్ళుంటాయి. చిన్నవాడికి రెండున్నర మూడు సంవత్సరాలుంటాయి.

కలకలరావంతో నది ప్రవహిస్తోంది. స్ఫటికంలా స్వచ్ఛమయిన నీరు. అడుగునవున్న పచ్చనిగడ్డి, పాకుడు స్పష్టంగా కనిపిస్తుంది. నదీ ప్రవాహానికి అనుగుణంగా అడుగునవున్న గడ్డి రెపరెపలాడుతోంది.

నది ఒడ్డున అక్కడక్కడ సొరకాయల తీగలు, వంకాయ, టమాట చెట్లున్నాయి. నదికి రెండువైపులా ఎత్తయిన వృక్షరాజాలున్నాయి. చెట్లపైనుండి రకరకాల పక్షుల కలకల

నాదం హృద్యంగమముగా వినిపిస్తుంది.

ఆ పట్టపగటివేళ ఒక ముసలతను నదిఒడ్డున వృక్ష చ్ఛాయలో కూర్చుని చేపలు పడుతున్నాడు. పొడుగాటి వెదురుకర్రకి గాలం బిగించి గాలం నదిలోకి విసిరాడు.

ధర్మదాస్‌కి ఈ వాతావరణం బాగా నచ్చింది. అతను ఒకసారి తన గుండెలదగ్గ తడుముకుని కమీజు లోపలి జేబు లోంచి చెక్కతో చేయబడిన జగన్నాథుని విగ్రహాన్ని బయటకుతీసి చూశాడు.

నల్లని చెక్కతో చెక్కబడిన విగ్రహం. సుమారు ఎని మిది అంగుళాల పొడవున్న ఆ విగ్రహం క్రిందివైపుకి మొన తేలివుంది. ఎడమచేత్తో విగ్రహపు మొండాన్ని పట్టుకుని, కుడిచేత్తో తలను పట్టుకుని బలంగా లాగాడు.

ఆరంగుళాల పొడవుండి రెండువైపులా పదునుగల కత్తి మిలమిలలాడింది.

క్షణకాలంపాటు ధర్మదాస్ కళ్ళు ఎర్రబడ్డాయి. పళ్ళు పటపటలాడాయి. మనిషంతా కంపించాడు. అంతలోనే సర్దుకున్నాడు.

జగన్నాథుని తలపిడిగాగల ఆ కత్తిని తిరిగి విగ్రహంలో పెట్టాడు. కళ్ళలో, మొఖంపై మళ్ళీ నిర్మలమైన సాత్వికభావం తెచ్చుకుని ముందుకి సాగాడు.

చిన్న కిరాణా కొట్టుని చూస్తూనే గుర్తించాడు ధర్మదాస్. కొట్టులో ఒక ముసలతను నికిల్‌ఫ్రేమ్ కళ్ళద్దాలు పెట్టుకుని కూర్చునివున్నాడు. కొట్టు బయటవున్న బెంచిపై మరో వృద్ధుడు కూర్చునివున్నాడు. ఆ ఇద్దరు ఏదో చర్చించు కుంటున్నారు.

ధర్మదాస్ జాగ్రత్తపడ్డాడు. అపరిచితుడిలా కొట్టుని చూస్తూ కొట్టువైపు సాగాడు. తన మాటల్లో ఏమాత్రం పొరపాటు వుండకూడదు.

నాలుగు రోజుల క్రితం ఇక్కడో భయంకరమైన సంఘటన జరిగింది.

ఆ ఇద్దరు వృద్ధులు ధర్మదాస్ తమవైపు రావటంచూసి, అతనివైపు కుతూహలంగా చూశారు. "ఎక్కడికి వెళతారు బాబూ! ఎవరిని కలవాలి?"

"నేను... నేను దీనానాథ్‌ని కలవడానికి వచ్చాను. అతని ఇల్లు వెదకుతున్నాను" ధర్మదాస్ ప్రశాంతంగా జవాబిచ్చాడు.

"ఎవరూ? దీనానాథ్‌ని కలవాలని వచ్చారా?"

ఆ ఇద్దరి ముఖాలపై కంగారు పొడసూపింది.

"మీరు ఎక్కడినుండి వస్తున్నారు?" కొట్టతను అడిగాడు.

ధర్మదాస్ చెప్పాడు. చెబుతూనే అడిగాడు.

"విషయమేమిటి? అతని మాటవిని మీ ముఖాలెందుకలా పాలిపోయాయి?"

"దీనానాథ్‌కి, మీకూ వున్న సంబంధమేమిటి?" ధర్మదాస్ మాట పూర్తికాకముందే అతను అడిగాడు.

"దీనానాథ్, నేనూ దూరపు బంధువులము. అతను నాకు అన్నవరుస అవుతాడు. ఇంతకి అసలు సంగతేమిటి?" వ్యాకులపాటుతో అడిగాడు.

"నాలుగురోజుల క్రితం పోలీసులు అతని ఇంటిపై దాడి జరిపి కాల్పులు జరిపారు. ఆ కాల్పులలో అతను మరణించాడు. ఆ విషయం మీకు తెలియదా?"

ఎందుకు తెలియదు. ధర్మదాస్‌కి అంతా తెలుసు. తెలిసే వచ్చాడు.

"అరే! ఏమిటి మీరంటున్నది?" ధర్మదాస్ తన ముఖంపై కంగారు, ఆశ్చర్య విస్మయాలు తెచ్చుకుంటూ అడిగాడు.

"ఎందుకు? దీనానాథ్ రాజకీయాల్లోకి దిగేవాడు కాదే?"

"రాజకీయం కాదుబాబూ! దోపిడీ. ఏదో విలువయిన వజ్రం దొంగతనం చేశాడుట. పట్నంనుండి పారిపోయి వచ్చి ఇంట్లో దాక్కున్నాడు."

ముసలాడు మెల్లగా ఇతరులు వినకూడదన్నంత మెల్లగా చెప్పాడు.

"ఏమిటీ దోపిడీయా! అదీ ధీనానాథ్ చేయడమా! అతను అలాంటి వాడుకాడు. ఇది అసంభవం" ధర్మదాస్ బిగ్గరగా అరిచాడు.

ఆ ఇద్దరు ముసలాళ్లు ధర్మదాస్‌కేసి ఆశ్చర్యంగా చూడసాగారు.

"బాబూ, మీరు దీనానాథ్‌ని చూసి ఎన్నాళ్ళవుతుంది?"

"ఆరేళ్ళక్రితం అనుకుంటాను. అవును అతణ్ణిచూసి ఆరేళ్లు అయింది."

"ఆరేళ్ళలో బాబుగారూ, నదికూడా తన ప్రవాహపు దిక్కుని మార్చుకుంటుంది. మీరు దీనానాథ్‌ని ఆరేళ్ళక్రితం చూశారు. అప్పటి దీనానాథ్‌కి, ఇప్పటి దీనానాథ్‌కి చాలా తేడావుంది."

ధర్మదాస్ విస్మితుడయ్యాడు. అతని వదనం ఉదాసీనమయింది. "కాని...కాని పోలీసులు తుపాకులతో ఎందుకు కాల్చారు. అరెస్ట్‌చేసి వుండవచ్చుకదా!"

"అరెస్ట్ ఎట్టా చేస్తారు బాబూ! వెనుక తలుపులగుండా పారిపోవడానికి ప్రయత్నం చేశాడు. అప్పుడే పోలీసులు తుపాకి పేల్చారు. ఒకగుండు సూటిగా వెళ్ళి..."

దీనానాథ్ తలను ఛేదించింది. ఆ విషయం ధర్మదాస్‌కి తెలుసు. అన్ని విషయాలు సేకరించిన తరువాతే అతనిక్కడికి వచ్చాడు. గుండు తలవెనుకనుండి మెదడులోకి చొచ్చుకుపోవటంతో దీనానాథ్ అక్కడికక్కడే మరణించాడు.

ఆ వృద్ధుడు రక్తసిక్తమయిన దీనానాథ్ శరీరాన్ని వర్ణించసాగాడు.

ధర్మదాస్ అంతకంటె దుఃఖకరమయిన వార్త తన కింకోటి లేదన్నట్లుగా నిర్వీర్యంగా నిలబడిపోయి ఎటో శూన్యంలోకి చూడసాగాడు. ముఖం మ్లానమయింది. కళ్ళ లోంచి అశ్రువులు కారసాగాయి.

కిరాణాకొట్టతను సానుభూతితో ధర్మదాస్‌ని చూస్తూ "కొంచెంసేపు అలా కూర్చోండిబాబూ! ఏడ్చినంత మాత్రాన పోయినవాళ్లు తిరిగి వస్తారా! అంతా ప్రారబ్ధం" అంటూ ధర్మదాస్ వద్దకు వచ్చాడు. మృదువుగా భుజం తడుతూ మళ్ళీ అన్నాడు.

"జరిగినదానికి మీరేం చేయగలరు. మనిషి జీవితానికి నమ్మకమేముంది. ఎలాగూ వచ్చారు కాబట్టి దీనానాథ్ ఇల్లాలిని చూసి పొండి."

"ఊహుఁ!" అన్నట్లుగా ధర్మదాస్ తల అడ్డంగా ఊపుతూ ధోవతి అంచుతో కళ్ళు తుడుచుకున్నాడు.

"లేదు, నేను దీనానాథ్ అన్నయ్య ఇంటికి వెళ్ళలేను. వెళ్ళి వదినకి ముఖం చూపించలేను. ఆమెకూడా ఇంతకు ముందు నన్ను చూడలేదు. నేనామెను చూళ్ళేదు. ఇదే మొదటిసారి చూడటం అవుతుంది. హృదయంలో ఎన్ని ఆశలు పెట్టుకుని వచ్చాను. సుమంగళిగా చూడాల్సిన ఆమెను విధవగా చూడాలా? లేదు లేదు. నేను చూళ్లేను."

ధర్మదాస్ మాటలువిని ఆ ఇరువురు వృద్ధులు బాగా ప్రభావితులయ్యారు. ఇరువురు అతనికి చెరోప్రక్కా కూర్చున్నారు.

"మీ మనస్సులోని బాధను మేము అర్థంచేసుకోగలం బాబూ! కాని; దీనానాథ్ గురించి ఎవరోవచ్చి ఇంతటి విషాదవార్త వినికూడా సానుభూతి చూపించడానికి రాలే

దని బాధపడుతుంది ఆ ఇల్లాలు. మిమ్మల్ని ఇటునుండి ఇటే పంపించామంటే ఆమెకు మాపైవున్న గౌరవంకూడా తగ్గిపోతుంది" కొట్టతను మెల్లగా అన్నాడు.

"అవును బాబూ!" అన్నాడు రెండవ ముసలాడు.

ఎట్టి పరిస్థితులలోనయినా దీనానాధ్ ఇంట్లో చేరబడాలనేదే ధర్మదాస్ నిర్ణయం. ఆ ఇంట్లోకి ప్రవేశించి తనపని నెరవేరేవరకు తానక్కడినుండి కదలబోయేదిలేదు.

అయినా పైకి అన్నాడు. "ఏ పరిచయం వల్ల నేనామెను కలవాలి. దీనానాధ్ అన్నయ్యలేడు. ఆమె యిక నన్ను ఏమని గౌరవిస్తుంది?" విషాదం, విరక్తి అతని వదనంలో స్పష్టంగా కనిపిస్తోంది.

"నిజం చెప్పాలంటే ఇప్పట్లో మీలాంటి బంధువు లెవరయినా ఆమెవద్ద వుండడం చాలామంచిది. ఆమెకు కొంచెమయినా ధైర్యం కలుగుతుంది," కొట్టతను అని, ఏమంటావు అన్నట్లుగా రెండవ ముసలాణ్ణి చూశాడు.

"నిజమే!" రెండవ అతను అన్నాడు. "నాకో విషయం ఆశ్చర్యంగావుంది. ఇంతటి మంచివాళ్ళు అతని బంధువు అయివుంటే దీనానాధుడికి ఆ పాడు అలవాట్లు ఎలా అలవడ్డాయి. మీరు తప్పకుండా ఆమెను కలుసుకోండి బాబుగారూ! ఆమె పుట్టింటి తరఫు వాళ్ళంతా ఈ మధ్యవచ్చిన వరదలకి మరణించారు. ఇక దీనానాధ్ మాటంటారా! అతనికి బంధుమిత్రులున్నారనికూడా తెలియదు. ఇన్నాళ్ళకి అతని తమ్ముడినంటూ మీరు వచ్చారు."

"నేనెంతటి దురదృష్టవంతుణ్ని" కళ్ళలోంచికారుతున్న కన్నీటిని కొనగోట తుడుచుకుంటూ అన్నాడు "ఎన్నాళ్ళనుండో రావాలనుకుంటున్నాను. కాని ఇన్నాళ్ళకి కుదిరింది. అదీ ఇటువంటి పరిస్థితులలో."

"ఇటువంటి పరిస్థితులలో మిమ్మల్ని భగవంతుడే పంపా

డనుకోండి. ఇంతకుముందు రాకపోవడమే మంచిదయింది. ఆ భార్య భర్త లెప్పుడూ సఖ్యంగా వుండలేదు. రోజుకో కొట్లాట. దీనానాథ్ ఆ ఇంటిని నరకంచేశాడు. పాపం, ఆ ఇల్లాలు కాబట్టి భరించింది. ఆమె నేమాత్రం సుఖపెట్టలేదు. పెద్దవాడికి పదేళ్లు వచ్చాయి. వాణ్నింతవరకు స్కూలుకి పంపలేదు. చిన్నవాడయితే- వాడికి రెండున్నర ఏళ్ళుం టాయి. పాపం వాళ్ళెలా బ్రతుకుతారో!"

"ఏం అతను దొంగతనం చేసిన..." ఆగిపోయాడు ధర్మ దాస్.

"మేం కొంతమందిమి అదే ఆలోచించాము బాబూ!" కొట్టతను అన్నాడు. "ఇంతకుముందు డబ్బంతా ఏం చేశాడో తెలియదు. మొన్నమాత్రం ఒక విలువయిన వజ్రాన్ని దొంగిలించుకువచ్చాడని, దాని విలువ అరవయి, డెబ్బయి వేలకి వుంటుందని పోలీసులు చెప్పారు. దీనానాథ్ చనిపోయిన తరువాత పోలీసులు ఆ ఇల్లంతా గాలించారు కాని వారికి ఏమీ లభించలేదు. దానిని ఎంతదొంగతనంగా అమ్మినా పదివేల వరకు రావచ్చని దానితో ఆ తల్లిబిడ్డల బ్రతుకులు గట్టెక్కుతాయని అనుకున్నాం. కాని ఊహుఁ!"

కరెక్ట్; ఆ విషయమే వినాలనుకుంటున్నాడు ధర్మదాస్. పోలీసులు ఇల్లంతా ఒక కొలిక్కి తెచ్చారని అతనికి తెలుసు. ఆ వజ్రంకోసమే తాను అపాయాన్ని లెక్కచేయకుండా ఇక్కడికి వచ్చాడు.

ఆ రాత్రి దీనానాథ్ ఆ వజ్రంతోపాటు ఇంటికి వచ్చాడు. అతని వెనుకే పోలీసులుకూడా చేరుకున్నారు. దీనానాథ్ అతికష్టంగా అరగంట ఇంట్లో గడిపివుంటాడు. ఆలోగా పోలీసులు అతని ఇంటిని చుట్టుముట్టారు. దీనానాథ్ ఇంట్లోనే వున్నాడు. అత నెక్కడికి వెళ్ళలేదుకూడా! అయినా పోలీసులకి ఆ ఇంట్లో ఆ వజ్రం లభించలేదు.

"మీరంటున్నది ఏమిటి? ఆ వజ్రం లభించలేదా?" ధర్మ దాస్ అడిగాడు.

"లేదు బాబూ! పోలీసులు ఇల్లు, పెరడు అంతా వెది కారు. చివరకు నాగజెముడు పొదలు, రేగుచెట్లు ఎక్కి కూడా చూశారు. అతని భార్యా బిడ్డలను వలువలు ఒలిపించి సోదాచేశారు. భర్త ఎప్పుడు ఇంటికి వచ్చాడో తెలియదు అంటుంది. పోలీసులు తలుపు తట్టింతరువాతే ఆమె కళ్ళు తెరిచిందట."

"నిజానికి అతనా వజ్రాన్ని ఇంటికే తేలేదు. దీనానాథ్ వెంట మరొకతను వున్నట్లు పోలీసులకి తెలిసింది. ఆ వజ్రాన్ని తీసుకొని అతను రహస్య స్థావరంనుండి పారిపోయాడట. పోలీసులు ఇప్పుడు అతని గురించి వెతుకుతున్నారు. పోలీ సులు అతని పేరేదో చెప్పారు. ఏమిటది సింగన్నా!" కొట్టతను, మరొకతణ్ని అడిగాడు.

"కృష్ణ.... కృష్ణప్రసాద్ అని చెప్పినట్లు గుర్తు" సింగన్న అన్నాడు.

అవును. కృష్ణప్రసాద్. అతనిప్పుడు ఇక్కడే కూర్చు న్నాడని ఆ ఇరువురికీ తెలియదు పాపం! అవకాశంకోసం ఎదురుచూస్తున్న విషసర్పంలా చుట్టచుట్టుకుని కూర్చుని వున్నాడు. ధర్మదాస్ కాదు; ధర్మదాస్ వేషంలో కృష్ణ ప్రసాద్ కూర్చుని వున్నాడు.

"ఆ పాపపు సొమ్ము ఇంట్లో లేకపోవడంకూడా ఒకందుకి మంచిదే అయింది" ధర్మదాస్ మెల్లిగా అన్నాడు.

"అనుభవించే యోగం లేదు."

"దాన్ని అనుభవించి సుఖపడేది మాత్రం ఏముంది. ఇదంతా వినడానికి, చూడడానికి నేను ఇంతదూరం వచ్చానా? భగవాన్ ఏమిటీ పరీక్ష." ధర్మదాస్ విరక్తిగా అన్నాడు. అతని కళ్లు సజలములయ్యాయి.

"జరిగిపోయిన దాన్నిగురించీ తలంచీ బాధ పడకండి బాబూ! రండి నేను మిమ్మలను దీనానాథ్ ఇంటివద్ద వదిలి వస్తాను," కొట్టతను మృదువుగా అన్నాడు.

కొట్టతని వెంట దీనానాథ్ ఇంటివైపు సాగాడు ధర్మ దాస్.

## 2

దీనానాథ్ మరణానికి వారంరోజులకి ముందు ధర్మదాస్, దీనానాథ్‌లు కలిసి రాజా రాజేంద్రప్రసాద్ ఇంటిని లూటీ చేశారు. చేతికందినంత డబ్బు, నగలు తీసుకుని ఇరువురూ మాయమయ్యారు.

ఆ నగల్లోనే ఈ విలువయిన వజ్రంకూడా వుంది.

ధర్మదాస్, రాజేంద్రప్రసాద్ ఇంటిని దోయాలని ఎప్పటి నుండో అనుకుంటున్నాడు. కాని అతనికి తగిన సహచరుడు లభించలేదు. చివరకు అతనికి దీనానాథ్ కలిశాడు.

తనకు కావలసిన లక్షణాలన్ని దీనానాథ్‌లో వుండడం గమనించిన ధర్మదాస్ అతనికి తన ప్లాన్ చెప్పాడు. ప్లాను ప్రకారం ఇరువురూ కలిసి రాజా భవనాన్ని దోచారుకూడా!

కాని దీనానాథ్ చాలా తెలివైనవాడు. పోలీసులు తమని వదలరని అతనికి తెలుసు. ఎలాగైనా దొంగిలింపబడ్డ సొమ్ము దక్కేటట్టేతప్ప, తనకు ముక్తి లేదని అత ననుకున్నాడు. అనుకున్నదే తడవుగా అతను ధర్మదాస్, అలియాస్ కృష్ణ ప్రసాద్‌ని గురించి పోలీసులకి తెలుపుతూ ఫోన్ చేశాడు. ఫోన్ చేయడానికి ముందే అతనా వజ్రాన్ని తన పరం చేసుకున్నాడు.

ధర్మదాస్, దీనానాథ్‌లు ఆ రహస్య స్థావరంలో వుండ గానే పోలీసులు అక్కడికి చేరుకున్నారు. కంగారుగా ఇరువురూ పరుగెత్తారు.

ధర్మదాస్‌ని పట్టించాలనుకున్న దీనానాథ్ పోలీసుల కళ్ళలో పడ్డాడు.

ధర్మదాస్ చాలా చురుకైనవాడు. అతను పోలీసుల కళ్ళు బడకుండా పరుగెత్తాడు.

'చెరపకురా చెడేవు' సామెత తనకు సరిగ్గా వర్తించినందుకు, అలాంటి బుద్ధి తనకి కలిగినందుకి తనను తానే తిట్టుకుంటూ పరుగెత్తాడు దీనానాథ్. కాని పోలీసుల కళ్ళలో అతను కారం చల్లలేకపోయాడు.

దీనానాథ్ ఎక్కడికి వెళతాడో ఊహించాడు ధర్మదాస్. అక్కడికి పోలీసులుకూడా వెళతారని ఊహించాడు. అందుకని ఆగి నాలుగురోజుల తరువాత బయలుదేరాడు.

కాని, ఆలోగా జరగాల్సింది జరిగిపోయింది.

# 3

"రండి బాబూ! మిమ్మలని దీనానాథ్ ఇంటివద్ద వదలి వస్తాను. సింగన్నా, కొంచెం కొట్టుని చూస్తూండు" కిరాణా కొట్టతను, ఒకసారి ధర్మదాస్‌తోనూ, సింగన్నతోనూ అన్నాడు.

"నేను వుంటాను, నీవు వెళ్లు" సింగన్న జవాబిచ్చాడు.

ధర్మదాస్ ముందుకి అడుగు వేయడానికి ముందు ఒకసారి గుండెలపై చేయివేసుకుని, తన 'జగన్నాధుని' తలుచుకున్నాడు.

ఆ ఇరువురూ ముందుకి సాగారు. సన్నని కాలిబాటగుండా వెళుతున్నారు ఇద్దరూ. అక్కడక్కడ చిన్న పొదలు, మొక్కలు వున్నాయి. కొద్దిదూరంలోనే వుంది దీనానాథ్ ఇల్లు.

కొట్టుదగ్గరనుండి చూస్తేనే కనిపిస్తుంది దీనానాథ్ ఇల్లు. నాగజెముడు ఆవరణలో చిన్న ఇల్లు. ఒకే ఒక్క వున్న

తలుపు. తలుపుకి కొద్దిదూరంలో రేగిపళ్ళ చెట్టు. అంతా నిశ్శబ్దంగా వుంది.

ముసలతను చేరవేసివున్న తలుపులని తోసుకుని లోపలకి వెళ్ళాడు.

లోపలి ప్రాంగణంకూడా నిశ్శబ్దంగా వుంది. గాలికి విసిరివేయబడ్డ రేగి ఆకులు ప్రాంగణమంతా పరుచుకుని వున్నాయి. ప్రాంగణానికి చెరోవైపు చెరోగది వున్నట్లు గమనించాడు ధర్మదాస్. మధ్యన మట్టితో కట్టబడిన అరుగు వుంది.

ఈ రెండు గదులు కాక కొంచెం ప్రక్కగా మరో చిన్నగది వుంది. ఆ గదికప్పు తాటాకులతో కప్పబడి వుంది.

అన్ని గదుల తలుపులూ చేరవేసి వున్నాయి.

"ఆనందీ! ఎక్కడున్నావు? ఎవరూ లోపల?" ముసలతను అరిచాడు.

"ఎవరూ?" లోపలినుండి ఎవరిదో పనివాని స్వరం వినిపించింది.

"నేనూ ధర్మయ్య తాతనిరా. హరీ, మీ అమ్మ ఏదిరా?" బయటినుండే ప్రశ్నించాడు ధర్మయ్య.

కొద్దిసేపటి నిశ్శబ్దం తరువాత తలుపు తెరుచుకుంది. సుమారు ముప్ఫయి ఏళ్ళ వయస్సులోవున్న స్త్రీ ద్వారబంధాని కానుకుని నిలబడివుంది.

తెల్లని చీరెలో వుందామె. వెంట్రుకలు విరబోసి వున్నాయి.

ధర్మయ్య తాతవెంట మరో కొత్తవ్యక్తిని చూచి ఆమె వెంటనే భుజంచుట్టూ చీరెచెంగు లాక్కుంది.

ఆరోగ్యవంతమయిన శరీరం. ఆ వయస్సులోకూడా చాలా అందంగావుంది. నుదుట సింధూరం లేకపోవటంవలన ముఖం బోసిగా, ఆ సౌందర్యానికి లోపం తెస్తోంది. ఆ వైధవ్యం

భర్త పోయాడన్న విచారం ఆమె వదనంలో అగుపిస్తోంది.

ఆమె వెనుకనుండి పదేళ్ళ పిల్లవాడు తొంగిచూస్తున్నాడు.

వాడు బహుశా దీనానాథ్ పెద్దకొడుకు హరి అయి వుంటాడు అనుకున్నాడు ధర్మదాస్.

వాడు అచ్చం తల్లిలాగే వున్నాడు. విశాలమయిన కళ్లు, నల్లని కనుపాపలు, వాడి గుండ్రని ముఖానికి వింత అందాన్ని తెస్తున్నాయి. పొడుగ్గా పెరిగిన జుత్తు చిందర వందరగా వాడి ముఖంపై పడుతోంది.

"రండిబాబూ! లోపలకు రండి" ధర్మయ్యతాత, ధర్మదాస్‌తో అని ఆమెవైపు తిరిగి అన్నాడు.

"ఆనందీ! ఈయన పట్నంనుండి వచ్చాడు. మీరుబంధువు లవుతారు. వరుసకి దీనానాథ్‌కి తమ్ముడవుతాడు. ఆరేళ్ళ క్రితం చివరిసారిగా దీనానాథ్‌ని చూశారట. ఇల్లు ఎక్కడుంది అని నన్నడిగారు. విషయం విని ఏడవసాగారు. అటు నుండి అటే వెళ్ళిపోతా మన్నారు. నేనే పిలుచుకు వచ్చాను."

ధర్మదాస్ మెల్లగా తన తలని పైకెత్తాడు. అతని ముఖంలో శోకచ్ఛాయలు అలుముకుని కళ్ళలో అశ్రువులు నిలిచివున్నాయి. "ఇంతకుముం దెప్పుడూ ఇక్కడికి రాలేదు" గద్గదకంఠంతో అన్నాడు. "మీరు నన్ను గుర్తుపట్టరు. ఈ దుర్వార్తవిన్న తరువాత నాలో మిమ్ములని కలిసే ధైర్యం కూడా లేకపోయింది."

కన్నీళ్ళు అతని చెక్కిళ్ళపైకి జారాయి. అతను మళ్ళీ కళ్లు దించుకున్నాడు.

ఆనాటి సంఘటన జ్ఞాపకం రావడంతోనే ఆనంది హృదయం భారమయింది. ధర్మదాస్ మాటలు విని, అతని

కళ్ళలో కన్నీళ్ళు చూసి ఆనందికూడా అశ్రువులు కార్చింది. చీర చెంగుతో కన్నీళ్ళు అద్దుకుని లోపలకు వెళ్ళి చాపతీసుకు వచ్చి పరిచింది. "ఆయన్ను కూర్చోమను తాతా!" అంది.

ఆ ఇద్దరు చాపపై కూర్చున్నారు. హరి అప్పటికి తల్లి చాటునుండి బయటకు వచ్చాడు. పెద్దపెద్ద కళ్ళతో వాడు కుతూహలంగా ధర్మదాస్ కేసి చూడసాగాడు.

ధర్మదాస్ కళ్ళలో కన్నీరు, అతని మృదువైన కంఠం విని, ఆ పసివాడికి ధర్మదాస్ చాలా నచ్చాడు.

అతను తన కళ్ళు తుడుచుకుంటూ హరిని పిలిచాడు. "రా బాబూ! నీ పేరేమిటి? హరి కదూ? రా, నేను నీ చిన్నాన్నని."

హరిని చేయిపట్టుకుని దగ్గరకు లాక్కుని ఒళ్లో కూర్చుండ బెట్టుకుని, వాడి పసిచెక్కిళ్ళని ముద్దుపెట్టుకున్నాడు.

"వీడింత పెద్దవాడయ్యాడని నాకు తెలియదు. ఆరేళ్ళ క్రితం కలిసినప్పుడు ఒక కొడుకున్నాడని చెప్పాడు, అంతే!"

"వీడి తరువాత ఇంకొకడున్నాడు. నిద్ర పోతున్నట్లున్నాడు" ధర్మయ్య అన్నాడు.

"అవును" ఆనంది మెల్లగా అంది.

"ఇంత చిన్నవయస్సులోనే వీడు తండ్రిలేని వాడయ్యాడు. ఆ దేవుడెంత క్రూరుడు."

"స్వయంకృతాపరాధానికి దేవుణ్ని అని లాభం ఏముంది బాబూ!" ధర్మయ్యతాత అన్నాడు. "దీనానాథ్ ఏనాడు ఇంటిసంగతి ఆలోచించలేదు. పిల్లల విషయం ఆలోచించలేదు. ఇప్పుడీ ముగ్గురు ఎలా బ్రతుకుతారా అన్నదే సమస్య. ఆస్తిపాస్తులు లేవు. దాచుకున్న డబ్బులేదు. ఎలా బ్రతుకుతారో ఏమో! ఏమయినా మీలాంటి బంధువు ఒకరుండటం మంచిదయింది."

ధర్మయ్య ఆనంది వైపు చూశాడు. ఆనంది ఎక్కడో

శూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తోంది.

ఎవరీ ధర్మదాస్. ఇతని గురించి ఏనాడూ తన భర్త చెప్ప లేదు. తన భర్త బంధువు అందరూ ఎక్కడో వుత్తరాన వున్నారు. తన భర్తమాత్రం ఏనాడూ వాళ్ళదగ్గరకు వెళ్ళ లేదు. దొంగతనం మొదలు స్మగ్లింగ్, బ్లాక్ మార్కెటింగ్ బిజినెస్ వరకు చేశాడు. కాని ఎందులోనూ అతని అదృష్టం కలిసిరాలేదు. తను ఆ వ్యాపారాలు వద్దని ఎంతో చెప్పింది. కాని అతను వింటేనా! కాని అతనెన్నడూ ఇతని గురించి చెప్పలేదు. మనిషి చూడడానికి మంచివాడులాగే వున్నాడు. సానుభూతి, దయార్ద్రహృదయం వున్నవాడిలా వున్నాడు. కాని ఆ తరువాత ఆనంది ఆలోచించలేకపోయింది. ఇంటికి వచ్చిన అతిధిని గురించి చెడుగా ఆలోచించటం ఆమెకు ఇష్టంలేదు.

ఆనంది మనస్సులోని భావనని ధర్మదాస్ చదవగలిగాడు. "దీనానాథ్, మీకెప్పుడు నా గురించి చెప్పలేదా?" అడి గాడు.

"నాకు సరిగ్గా జ్ఞాపకం రావటంలేదు," మెల్లిగా అంది ఆనంది.

"అతని ఆలోచనలు ఎప్పుడయినా ఒకచోట వుంటే కదా ఏమయినా చెప్పడానికి. ఎంతసేపు తన ఆలోచన లేమిటో తనేమిటో" ధర్మయ్యతాత అన్నాడు.

"పట్నంలో మీరేం చేస్తుంటారు బాబూ?" ధర్మయ్య అడిగాడు. ఆనందికూడా కుతూహలంగా అతనివైపు చూసింది.

"నా ఒక్కడి గురించి అంతగా బెంగలేదు. ఏదో పెద్దలు సంపాదించింది వుంది. దాంతో గడిచిపోతుంది. కాని అప్పు డప్పుడు రేడియో స్టేషన్ కి వెళ్ళి భగవంతునిపై పాటలు పాడుతుంటాను."

"మిమ్మల్ని చూస్తూనే అనుకున్నాను మీరు చాలా ధార్మికులని. భగవంతునిపై పాటలు పాడడం, భజనలు చేయడం అందరి వశం కాదు. మీ బంధువు లెవరయినా వున్నారా?"

ధర్మదాస్ ఇదంతా ముందే ఆలోచించి పెట్టుకున్నాడు. అందుకని తడుముకోకుండా సమాధాన మిచ్చాడు.

"ఒక అక్క వుంది. బావ గవర్నమెంట్ ఆఫీస్‌లో పని చేస్తున్నాడు. మొదట నే నామెతోనే వుండేవాణ్ని."

"మంచిది బాబూ! నే నిక వెళతాను. కొట్టు తెరిచే వుంచాను," అంటూ ధర్మయ్య లేచాడు.

"నేనూ వెళ్తాను. నాకు తిరుగు ప్రయాణానికి రైలు ఎప్పుడుంది?"

"అప్పుడే వెళ్ళిపోవాలా?" ఆనంది అడిగింది.

"ఒకటి రెండు రోజులుండి వెళ్ళండిబాబూ!" ధర్మయ్య తాత కూడా సమర్థించాడు.

'ఎలాగూ వుండాల్సిందే! ఉండకుంటే నా పని ఎలా అవుతుంది' ధర్మదాస్ మనస్సులో అనుకున్నాడు.

"నేను వెళ్తాను" ధర్మయ్య అన్నాడు.

"మంచిది," ఆనంద అంది. "హరిని పంపిస్తున్నాను. ఒక టీ పొట్లం పంపించు."

ధర్మయ్య వెంట హరికూడా వెళ్ళిపోయాడు.

ఇల్లంతా నిశ్శబ్దంగావుంది. దూరంగా ఎక్కడో కోయిల కూస్తోంది. పైన రేగుచెట్టుపై రెండు గువ్వలు కువకువలాడుతున్నాయి.

ధర్మదాస్ తలవంచుకుని కూర్చున్నాడు. ఆనంది, తలుపు వద్ద నిలబడి తననే చూస్తుందని తెలుసు. "ఉన్నట్లుండి బయలుదేరి రావాలని నా మనస్సు ఎందుకింత ఆరాటపడిందో నాకే తెలియదు. ఇక్కడికివచ్చి ఇదంతా చూడవలసివస్తుం

దని అనుకోలేదు,'' మెల్లగా రుద్ధకంఠంతో అన్నాడు.

''ఎవరుమాత్రం అనుకుంటారు'' ఆనంది బరువుగా అంది.

''కన్నుమూసి తెరిచేలోగా అంతా సర్వనాశన మయింది.''

''ఊఫ్...! అంతా మీరు కళ్ళతో చూశారనుకుంటాను.''

''ఒక్క క్షణంపాటు ఏంజరిగిందో కూడా అర్థంకాలేదు'' ఆనాటి సంఘటనను తలుచుకుంటూ అంది.

''నేను మంచి నిద్రలో వున్నాను. ఆయన ఎప్పుడు, ఎలా తలుపు తీసుకుని లోపలికి వచ్చారో కూడా తెలియదు. పోలీసులు దబదబ తలుపులు విరగ్గొట్టి లోపలికి ప్రవేశించారు. అదిచూసి మీ అన్నయ్య వెనుక తలుపులగుండా బయటకు పరుగెత్తిపోయారు. అప్పుడే తుపాకి పేలినశబ్దం వినిపించింది. చప్పుడికి చిన్నవాడు లేచి బిగ్గరగా ఏడ్వసాగాడు. హరిలేచి లాంతరు వెలిగించాడు. వెనుక తలుపులవద్ద ఆయన నిశ్చేష్టంగా పడివున్నారు. రక్తం ప్రవాహంలా కారుతూంది.''

''హుం!'' దీర్ఘంగా నిట్టూరుస్తూ అన్నాడు ధర్మదాస్. ''అనవసరంగా అతని ప్రాణాలు పోయాయి. అతని స్నేహితులు, సహచరులు ఇంకా ఎవరెవరో వుండాలికదా! వాళ్లు పట్టుబడలేదా?''

''ఊహుం! అలాంటిది నేనేమీ వినలేదు.''

''పోలీసుల దృష్టి ఇతనిపైనే పడ్డట్లుంది. వాళ్లు ఇతరులని గురించి పట్టించుకోలేదు.''

''కృష్ణప్రసాద్ అనే మిత్రుడుండాలని, అతని గురించి గాలిస్తున్నామనీ పోలీసులు అంటున్నారు. పేపరు చూళ్లేదా?'' ఆనంది అడిగింది.

''లేదు;'' అంటూ తలెత్తి ఆమెవైపు చూశాడు. ఇద్దరి కళ్లు కలుసుకున్నాయి. అతనలా వున్నట్లుండి తలఎత్తిచూస్తాడని వూహించలేదు ఆనంది. అతనినే పరీక్షగా చూస్తున్న ఆమె అతను చూడడంతో తలదించుకుని పయ్యెద సర్దుకుంది.

ముప్ఫయి ఏళ్ళుకూడా వుండవేమో! ఇరవయ్యేరు, లేక ఇరవయి ఏదేళ్లుం టుండవచ్చు. అందమైనదే అను కున్నాడు ధర్మదాస్.

అతనుకూడా వెంటనే తలదించుకుని ఆలోచించసాగాడు.

ఎక్కడ? ఎక్కడుందా వజ్రం? ఈ ఇల్లువదిలి దీనానాథ్ ఇంకెక్కడికి వెళ్ళలేదు. పోలీసులు ఇల్లంతా గాలించి ఒక కొలిక్కి తెచ్చారు. ఇంటికప్పులో, గూరులో, ఎక్క డెక్కడ వజ్రాన్ని దాయడానికి అవకాశముంటుందో అక్క డంతా వెదికారు. ప్రాంగణంలో, ఇంటిముందు అవరణలో, నాగజెముడు పొదలో, రేగుచెట్టు పొదల్లో అంతా గాలిం చారు. అయినా వారికా వజ్రం లభించలేదు.

అయితే మరెక్కడికి పోయింది. ఒకేఒక అవకాశం కని పిస్తుంది. ఆ రాత్రి ఇంటికివస్తూ స్టేషన్‌కి, ఇంటికి మధ్య దారిలో, నది ఒడ్డున ఎక్కడో దాచివుంచాలి. ఆమధ్య దారిలో, ఏ చెట్టుపైనో, ఏ పొదలోనో పెట్టివుంచాలి. తెల్ల వారగానే తీసుకునిపోవచ్చు అనుకుని వుండాలి.

కాని, ఆ మరునాటి వుదయానికి అతను లేడు. అయితే ఆ మరునాడు ఆ వజ్రం ఏ ఇతరుల చేతుల్లో అయినా పడిందా లేక ఇంకా అతను దాచినచోటే వుందా? ఆ చుట్టుప్రక్క లంతా వెదకాలి. ఆలోచనలతో ధర్మదాస్ మెదడు వేడె క్కింది.

అప్పుడే హరిచేతిలో టీ పొట్లంతో వచ్చాడు. ఆనంది అందుకుని లోపలకు వెళ్ళింది.

ధర్మదాస్ హరిని పిలిచాడు. హరిని ప్రక్కన కూర్చోండ బెట్టుకుని అడిగాడు. "స్కూలికి పోతున్నావా? ఎన్నవ తర గతి చదువుతున్నావు??"

"నేను స్కూలుకి పోవడంలేదు" హరి మెల్లిగా జవా బిచ్చాడు.

"ఎందుకు?"

హరి మరీ పసివాడేమీకాదు, ఏదో అమాయకంగా జవాబివ్వడానికి. ధర్మదాస్ ప్రశ్న వాడికి బాధని, సిగ్గుని కలిగించింది.

"నాన్న నన్నెప్పుడూ స్కూలుకి పంపించలేదు. స్కూలు ఫీస్ ఇచ్చేవాడుకాదు" హరి తలవంచుకుని చెప్పాడు. "అదీ కాకుండా నాన్న కారణంగా నన్ను స్కూల్లో ఎవరూ సరిగా చూడరు. స్కూల్లో వాళ్ళందరూ, నాన్నను గురించి చెడ్డగా మాట్లాడుతుంటారు" చెబుతూనే వాడు ఏడ్చేసాడు.

ధర్మదాస్ వాణ్ని దగ్గరకు లాక్కుని గుండెల కదుముకున్నాడు. ప్రేమగా వాడిజుత్తు నిమురసాగాడు. 'ఎవరు చేసిన పాపానికి శిక్ష ఎవరు అనుభవిస్తున్నారు' అనుకుని "అసలు ఇంతవరకు స్కూలుకే వెళ్ళలేదా?" వాణ్ని అడిగాడు.

"వెళ్ళాను; రెండవ తరగతివరకు చదివి ఆగిపోయాను."

"నీవు మళ్ళీ స్కూలుకి వెళ్ళాలి హరీ! ఎలాగయినా సరే, కష్టపడి చదువుకోవాలి. అమ్మని, తమ్ముణ్ణి నువ్వే చూసుకోవాలి."

అతని మాటలు హరిలో సంచలనాన్ని కలిగించాయి. వాడు అమాయకంగా, సజలనయనాలతో ధర్మదాస్ వైపు చూశాడు. తరువాత తలవంచుకుని అడిగాడు.

"కాని నేను స్కూలుకి ఎలా వెళ్ళగలను. నాన్న లేడు. నా చదువు ఎలా సాగుతుంది. ఫీస్ ఎవరు కడతారు?"

హరి అమాయకుడు, పసివాడేగాని, వాడి మాటలు చిన్నపిల్లల మాటలుకావు. తండ్రి నిర్లక్ష్యంవల్ల తల్లి ఇంటిని ఎలా కొనసాగిస్తుందో వాడికి తెలుసు. కష్టసుఖాల అనుభవం వాడికుంది.

"దీని కేదయినా మార్గం ఆలోచించాలి" ధర్మదాస్ అన్నాడు. "నీ చదువు ఇలా ఆగిపోవడం నాకు బాగుండ లేదు. ఇలా అయితే నీ జీవితం నాశనమవుతుంది. కనీసం మిడిల్ పాస్ అయినా అయితే, ఏ ఫ్యాక్టరీలోనో, ఆఫీస్ లోనో పనయినా దొరుకుతుంది. కాని, ఈ చిన్నవయస్సు నుండే నువ్వు కష్టపడటం నాకేం బాగుండటంలేదు."

ఆ పసివాడి కళ్ళల్లో కృతజ్ఞతతో కూడిన మెరపు కనిపించింది. ఇంత మంచిమనిషిని వాడింతకు ముందెప్పుడూ చూడలేదు. ఇంతకు ముందెవరూ వాడితో ఇంత స్నేహంగా, కరుణాపూరితంగా మాట్లాడలేదు. తనను తా నెప్పుడూ అభాగ్యుడనే అనుకుంటూ వుండేవాడు.

"హరీ! ఇలారా!" లోపలినుండి ఆనంది పిలిచింది.

ఒకటి రెండుక్షణాల తరువాత హరి ఒక ఇత్తడిగ్లాసులో టీ తీసుకువచ్చి ధర్మదాస్ ముందుంచాడు.

"అరే! ఇదేమిటి? ఇప్పుడు టీని నాకోరకు తయారు చేశారా? ఎందుకంత శ్రమ తీసుకున్నారు?" ధర్మదాస్ ఆనందిని చూస్తూ అన్నాడు.

ఆనంది పెదిమలపై పేలవమయిన మందహాసం వెలసి మాయమయింది.

"హరి చదువుకి కావలసిన సదుపాయాలు నేను చేస్తాను," ధర్మదాస్ గ్లాసుని నోటివద్ద పెట్టుకుంటూ అన్నాడు.

"మంచిదే!" అదే పేలవమయిన మందహాసంతో అంది. "కాని; అదెలా జరుగుతుంది. ఇల్లు గడపడమెలా...! వాణ్ని ఏదో ఒకచోట్లో పనికి పెట్టించి, నేనూ రెండుమూడు ఇళ్ళలోనో పనిచూసుకుని గడపాలనుకుంటున్నాను."

ఆనంది మాటలతో ధర్మదాస్ వ్యాకులపడ్డాడు.

"అదేమిటి మీరంటున్నది. వద్దు. వద్దు. మీరలా అనవద్దు. నేను ఎంత స్వంత తమ్ముణ్ని కాకున్నా తమ్ముణ్నే! ఇదంతా

వింటూంటే బాధగా వుంటుంది."

ఆనంది ఆ ప్రసంగాన్ని పక్కకు నెడుతూ అంది. "వారికి మీ రెలా తమ్ముడవుతారు?"

"దూరపు చుట్టరికం. మా తాతగారూ, ఆయన తాత గారూ, ఒకే తండ్రికి ఇద్దరు భార్యలవల్ల జన్మించారు."

ఆనంది ఏమీ మాట్లాడలేదు.

"మీకు వివాహమయిందా. పిల్లలెంతమంది?" స్త్రీ సహజమయిన కుతూహలంవల్ల అడిగింది, ఓ ప్రక్కగా కూర్చుంటూ.

ధర్మదాస్ నవ్వాడు. "లేదు. నేనింకా ఆ జంఝాటంలో ఇరుక్కోలేదు. అక్కయ్య పెళ్ళి చేసుకోమని ఎన్నోసార్లు పోరింది. అయినా నాకెందుకో ఆ యోగం కలుగలేదు."

ఆమె పెదవులపై మందహాసం వెలసి మాయమయింది. విషాదపూరితమయిన ఆ వాతావరణం లేకుంటే పకపక నవ్వే దేమో! "ఏం; ఎందుకని ఇష్టంలేదు. మీలాంటివాళ్ళు తప్ప కుండా వివాహం చేసుకోవాలి. బాధ్యతలు స్వీకరించే మీ లాంటివాళ్ళు అలా అంటే ఎలా?" అడిగింది.

"వద్దు. వద్దు; ఈ బ్రతికిలా హాయిగావుంది. చాలు" ధర్మదాస్ గ్లాసులోని టీని పూర్తిచేసి అన్నాడు.

అప్పుడే నిదురలోంచి లేచి తడబడుతున్న అడుగులతో ఆనంది చిన్నకొడుకు మురళి గదిలోంచి బయటకు వచ్చాడు. వాడు ఏడ్వబోయి అరుగుపై కూర్చునివున్న అపరిచితమయిన ముఖాన్ని చూసి ఆగిపోయాడు.

"ఏరా! చిన్నా! లేచావా. రా!"ఆనంది వాణ్ని పిలిచింది.

మురళిని ఒళ్లో కూర్చుండ బెట్టుకుని, "చిన్నా, నీకో కొత్త చిన్నాన్న వచ్చాడురా! చూడు. చిన్నాన్నకి నమ స్కారం చేయి," అంది.

ధర్మదాస్ వాణ్నందుకోవడానికి చేతులు చాపడంతో

వాడు తల్లి గుండెల్లో ముఖం దాచుకున్నాడు.

"రా, బాబూ!" ధర్మదాస్ మళ్ళీ పిలిచాడు. కాని వాడు అతనివద్దకు వెళ్ళలేదు.

"వీడు అచ్చం దీనానాథ్ అన్నయ్యలా వున్నాడు" ధర్మదాస్ నవ్వుతూ అన్నాడు.

ఆనంది స్నేహపూర్వకంగా నవ్వింది. కాని ఆ నవ్వులో శోకచ్ఛాయలున్నాయి. "అవును; అందరూ అలాగే అంటుంటారు," అంది. తర్వాత లేచి లోపలకు వెళ్ళింది వంట చేయడానికి.

ధర్మదాస్ లోపలి ప్రాంగణంలోకి దిగి నలువైపులా కలయ చూడసాగాడు.

హరి అతణ్ణంటి పెట్టుకుని వెంటవెంట తిరుగుతున్నాడు.

ఎక్కడ వుండివుంటుందా వజ్రం? ఆలోచించసాగాడు ధర్మదాస్. నిజంగానే ఆనందికి ఏమీ తెలియదా. లేక తెలిసే అలా నటిస్తూందా? అతని ఆలోచనలు ఎటూ తెగడంలేదు.

## 4

"హరీ! నీకు మీ నాన్న అంటే ఇష్టమా?" ధర్మదాస్ హరిని పక్కన కూర్చుండబెట్టుకుని ఏదో మాటలమధ్య అడిగాడు.

"చాలా ఇష్టం. కాని;" వాడు ఆగిపోయాడు.

"ఊఁ! కాని" ధర్మదాస్ మాటని రెట్టించాడు.

"కోపంలో వున్నపుడు ఇష్టం వుండేదికాదు. ఊరికేనే కొట్టేవాడు."

"ఎవరిని, నిన్నా?"

"అవును. నన్ను, అమ్మనికూడా!"

"ఆ రాత్రి పోలీసులు వచ్చినప్పుడు నీవేం చేస్తున్నావు?"

"ఊఁ!" హరి వులికిపడ్డాడు. ఏదో ఆడుగుతూ ఈ ప్రశ్న

చిన్నాన్న ఎందుకడిగాడో అతని కర్థంకాలేదు. ధర్మదాస్‌ని 'చిన్నాన్న!' అనే పిలకవాలని ఆనంది, పిల్లలకి చెప్పింది.

ధర్మదాస్, హరివైపు చూడలేదు. చూసివుంటే వాడు వులికిపడటం చూసి, తనూ వులికిపడి వుండేవాడు. ఎటో చూస్తూ తిరిగి అదే ప్రశ్న అడిగాడు.

"నేను.... నేను. అప్పుడు పడుకుని నిద్రపోతున్నాను."

"మరి. మరి. అప్పుడు గదితలుపులు తెరిచే వున్నాయా?" తను అడిగే ప్రశ్నల్లో పొరపాట్లేమీ దొర్లకుండా జాగ్రత్త పడుతూ అడిగాడు.

"లోపలినుండే మూసివున్నాయి. కాని, బయటనుండే తలుపులు తెరుచుకుని లోపలకు వచ్చేవాడు."

"నిజమా!" ధర్మదాస్ ఆశ్చర్యంగా అన్నాడు. "మరి, మీ కెవరికి అప్పుడు మెలకువరాలేదా?"

హరి ఒకసారి పరీక్షగా ధర్మదాస్ ముఖంలోకి చూసి, జవాబిచ్చాడు. "లేదు. అప్పుడు మేమందరమూ నిద్రలోనే వున్నాం. పోలీసులు తలుపులు తట్టినప్పుడే మెలకువవచ్చింది."

"ఆ తరువాత మీకు అన్యాయం జరిగిపోయింది" రుద్ధ కంఠంతో అన్నాడు. అతని వదనంలో దీనానాథ్ పైగల భక్తి, గౌరవాలు ప్రతిబింబిస్తున్నాయి.

ధర్మదాస్ హరితో మాట్లాడుతుండగానే ఆనంది, చిన్న కొడుకుని వెంట బెట్టుకుని బయటకు వెళ్ళింది. ఎక్కడకు వెళ్ళింది? ఎందుకు వెళ్ళింది? ఒకవేళ తనపై ఆమెకేమయినా అనుమానం రాలేదుకదా. ఆలోచనల్లో పడ్డాడు.

పది నిముషాల తరువాత ఆనంది తిరిగివచ్చింది. వెంట కిరాణాకొట్టు ధర్మయ్యకూడా వున్నాడు.

"బాబుగారు లేరా?" లోపలకు వస్తూనే అడిగాడు ధర్మయ్య.

"ఇక్కడే వున్నాను తాతా!" ధర్మదాస్ బయటకువస్తూ

అన్నాడు. "హరిని వెంటబెట్టుకుని ఇంటిని గమనిస్తున్నాను."

తనని తాత అనిపిలవడంతో ధర్మయ్య పొంగిపోయాడు. "చూశావా ఆనందీ, నేను తాతను అయాను. కలకాలం సుఖంగా బతుకు బాబూ! బాబూ నీవు పాడేపాటలు మాకు కూడా వినిపించకూడదా?" ఏకవచనంతో సంబోధిస్తూ అన్నాడు.

"ఎందుకు వినిపించను తాతా! తప్పకుండా వినిపిస్తాను. భగవంతుని కీర్తనలు వినిపించడంకంటే నాకింకేమి కావాలి" భక్తి పారవశ్యంతో అన్నాడు.

"చూడు బాబూ! నన్ను నువ్వెలాగూ తాతా అని పిలిచావు. కాబట్టి నా మాటని నీవు నిలబెట్టాలి. అది నామాటే కాదు. ఆనందికోరిక కూడా! కొన్నిరోజులు ఈ తండ్రిలేని పిల్లలవెంట వుండు. ఏమంటావు?"

ధర్మదాస్ ఒకసారి ఆనందివైపు చూశాడు. విశాలమయిన నయనాలతో అభ్యర్థిస్తున్నట్లుగా ధర్మదాస్ వైపు చూస్తోందామె. ఒకసారి తన జగన్నాధుని తలుచుకుని అన్నాడు.

"నాకక్కడ ఏమంత కొంపలు మునిగిపోయే పనులులేవు తాతా! కాకుంటే అనుకోకుండా రావడం. ఇదంతా చూడగానే విరక్తిని కలిగించింది. అందుకని రాత్రికి వెళ్ళిపోదామనుకుంటున్నాను. కాకుంటే దీనానాథ్ అన్నయ్య వుండివుంటే ఒకవారం రోజులు వుండాలని వచ్చినవాణ్నే. కాని...." అని ఆగిపోయాడు.

"ఏమిటి?" ఆనంది అడిగింది.

"మీకు కష్టంకలిగించినవాణ్నవుతానేమో?" అన్నాడు.

"నాకు కష్టమేముంది" ఆనంది మెల్లిగా అంది. "మీరిక్కడ వుంటే మేము మరీ అనాధులముకామని, మమ్ముల్ని అనుకునే వాళ్ళుకూడా వున్నారని ఊరివాళ్ళకి అర్థమవుతుంది. మిమ్ములని ఎక్కువ రోజులుండమనికూడా నేనను. కాని, మీ అన్నయ్య కర్మకాండ పూర్తయేవరకయినా వుండండి."

"నేనుకూడా అదే అనుకుంటున్నాను. ఎంత ఇరుగుపొరుగు వాళ్ళయినా స్వంతవాళ్ళం కాలేముకదా!" ధర్మయ్య నచ్చచెప్పసాగాడు.

ఆ ఇద్దరు కుతూహలంగా తనకేసి చూడటం గమనించాడు. ఒకసారి కళ్ళుమూసుకున్నాడు. "ఊఁ! కానివ్వండి. భగవంతుడికేది ఇష్టమో అదే జరుగుతుంది. మీరింతగా చెబుతూంటే నాకూ వుండాలనిపిస్తోంది. కాని, ఒక్క షరతు. అన్నయ్య కర్మకాండకి కావలసిన ఖర్చంతా నేను భరిస్తాను."

"అదెప్పుడూ వుండేదే! అయినవాళ్ళు అనుకున్న తరువాత ఆ మాత్రం చేయకుండా పోతారా! అనందీ, నువ్వు అతని మాటకు ఎదురు చెప్పకు" ధర్మయ్య ఆనందిని చూస్తూ అన్నాడు.

ధర్మదాస్, మురళిని చూస్తూ రమ్మన్నట్లుగా చేతులు చాచాడు. ఇంత సేపు కొత్తముఖాన్ని పరీక్షగా చూసిన తరువాత, వాడికి పోవచ్చని అనిపించిందేమో! ధర్మదాస్ చేతులు చాచగానే ఆ చేతుల్లోకి వెళ్ళాడు.

"షభాష్! నీవు రాజాబాబువి" అంటూ వాడిలేత బుగ్గపై ముద్దుపెట్టుకున్నాడు.

"నా గుల్లం నా గుల్లం ఎక్కలుంది?" అడిగాడు.

ధర్మదాస్ అర్థంకానట్లుగా ముఖం పెట్టాడు.

"వాడి గుర్రం, వాడి ఆటబొమ్మ. దాన్నడుగుతున్నట్లున్నాడు. ఒరేయ్! హరీ, తమ్ముడి గుర్రం ఎక్కడుందో తెచ్చిపెట్టు," పెద్దకొడుకుతో అంది.

హరికి ఎందుకో ఈ మాట నచ్చలేదు. "ఇక్కడే ఎక్కడో వుంటుంది. లేకుంటే గదిలో వుందేమో! ఇప్పుడు గుర్రంతో ఆడుకోవాలని ఏమీ లేదు" విసుగ్గా అన్నాడు.

"ఏం? ఎందుకని??" ఆనంది కోపంగా అంది. "ఎందుకని

ఆడుకోకూడదు. తరువాత వాడేడిస్తే నువ్వూరుకో బెడ తావా? వెళ్ళు, వెళ్ళి వాడిగుర్రం తెచ్చివ్వు.''

హరి అన్యమనస్కంగా గుర్రం తేవడానికి వెళ్ళాడు. వాడు అన్యమనస్కంగా వుండటం గమనించాడు ధర్మదాస్. ఎందుకు వాడు అన్యమనస్కంగా వున్నాడు. వాడికి తను నచ్చలేదా!

హరి గుర్రాన్ని తీసుకునివచ్చాడు. ఎర్రని దళసరి గుడ్డతో కుట్టబడివుంది. లోపల కొబ్బరిపీచు వుండివుండాలి. చాలా చోట్ల మొన తేలిన పీచు మొనలు, గుడ్డలోంచి కొద్దిగా తలలు పైకెత్తి చూస్తున్నాయి. మెడకి, చిటికినవేలి మందంలో రెండడుగుల పొడవున పాతనువ్వుల తాడువుంది. ఆ తాడు పట్టుకుని, గుర్రాన్ని గిరగిరా తిప్పుతూ వచ్చాడు హరి.

తన చేతిలోని తాడుని తమ్ముడి చేతి కందించాడు. ''పదరా! నిన్నలా నదిఒడ్డుకి తీసుకుపోతాను,'' తమ్ముడ్ని చూసి అన్నాడు.

మురళి, ధర్మదాస్ చేతుల్లోంచి క్రిందకి జారాడు. హరి వాణ్ని వెంట బెట్టుకుని బయటకు వెళ్ళాడు.

''మంచిది బాబూ! మళ్ళీ కలుస్తాను'' అంటూ ధర్మయ్యా కూడా వెళ్ళాడు.

# 5

కొన్నిరోజులు గడిచిపోయాయి. ధర్మదాస్ తన వ్యవహారంతోనూ, గానమాధుర్యంతోనూ ఆనందిని, ధర్మయ్యా తాతానే కాక ఇరుగుపొరుగు వాళ్ళనికూడా ఆకర్షించు కున్నాడు.

హరికూడా ఇప్పుడు సర్వసాధారణంగానే ప్రవర్తిస్తున్నాడు. ఇక మురళిని గురించి చెప్పనే అక్కరలేదు. 'చిన్నాన్న చిన్నాన్న' అంటూ వాడు ఎప్పుడూ ధర్మదాస్

వద్దకు పరుగెడుతుంటాడు.

ఈ మధ్య కాలంలో ఆనంది, ధర్మదాస్‌లు కూడా చాలా దగ్గరయ్యారు. మీరు అన్న సంబోధననుండి నీవులోకి దిగారు.

తనవద్దనున్న కొన్ని వందల రూపాయలను అతను ఆనందికిచ్చాడు. "ఇది నేను సంపాదించిన సొమ్ము. దీన్ని నీవద్ద వుంచు. ఎప్పుడు, ఎలా కావాలనుకుంటే అలా ఖర్చుపెట్టు. దీనానాథ్ అన్నయ్య కర్మకాండకి ఎంత కావాలనుకుంటే అంత ఖర్చుచేయి," అన్నాడు.

"ఇందులో అంత ఖర్చు పెట్టడానికి ఏముంది?" అంది ఆనంది.

అయినా ధర్మదాస్ ఒప్పుకోలేదు. ఆ డబ్బుని ఆనందికి తనవద్ద వుంచుకోక తప్పలేదు.

కాని ఇంతచేసినా, ఏ కారణాలవల్ల తానిక్కడికి వచ్చాడో అది నెరవేరనేలేదు. మొత్తం ఇల్లు, ఇంటి చుట్టు ప్రక్కల పరిసరాలు, ముందు వెనుకలు, నదిఒడ్డున, చెట్లపైన, పొదల్లో, గుంటల్లో అంతటా తనకొక్కవలసిన దానికోసం వెదికాడు. ఆ వెదకడానికి, చేపలు పట్టడం అనే నెపంతో బయలుదేరేవాడు.

కాని అతనికి ఫలితం మాత్రం లభించలేదు.

ఒకనాడు...

ఆనంది వంటింట్లో వంటపనిలో నిమగ్నమయివుంది. హరి మురళిని తీసుకుని బయటకు ఆడుకోవడానికి వెళ్ళాడు.

ఇటువంటి అవకాశాన్ని ధర్మదాస్ వదలదలచుకోలేదు. పిల్లిలా అడుగులువేస్తూ దక్షిణపువైపు గదిలోకి ప్రవేశించి అక్కడి సామాన్లన్నీ తిరగేస్తూ గాలించసాగాడు.

సరిగ్గా అప్పుడే హరి లోపలికి వచ్చాడు.

తన పనికి విఘ్నం కలిగించాడన్న కోపంతో ధర్మదాస్ కళ్ళు విస్ఫులింగాలు వర్షించాయి. కాని, మరుక్షణమే సర్దు

కున్నాడు. కళ్ళలోని తీక్షణత తగ్గిపోయింది.

“ఏమిటి వెదుకుతున్నావు చిన్నాన్నా?” హరి అడిగాడు.

“నా జగన్నాధుని ఎక్కడో పెట్టి మర్చిపోయాను. దొరకటంలేదు.”

హరి విచిత్రంగా చూశాడు ధర్మదాస్ వైపు. “అదెప్పుడూ తూర్పువైపు గదిలో వుంచుతావుకదా చిన్నాన్నా!” ఆశ్చర్యంగా అన్నాడు.

పాతాళంలో కృంగిపోతున్నట్లు ఫీలయ్యాడు అతను. “ఎక్కడా? తూర్పువైపు గదిలోనా! చూద్దాంపద,” తడబడ్డాడు.

అది అక్కడే వుంటుంది. దాన్ని చూడనక్కరలేదు.

ఆ తరువాత చాలా జాగరూకుడయి తన ప్రయత్నం సాగించసాగాడు కాని, ఫలితం ఏమాత్రం లభించటంలేదు.

కర్మకాండ బ్రహ్మాండంగా పూర్తయింది. తన స్వంత అన్నకి చేసినట్లుగానే కర్మక్రియలు చేశాడు ధర్మదాస్. ఆనాడు, ఏదో ఒకనాడు అందరూ మట్టిలో కలిసిపోవలసిన వాళ్ళే, అనే విషయంపై ఒక వేదాంత గీతం పాడాడు.

ఆ పాటవిన్న అందరూ జీవితం ఇంతేనేమో అనుకున్నారు.

## 6

మురళిని ఎత్తుకుని హరి ఇంటిలోంచి బయటకు నడిచాడు.

ఆ ఇద్దరికి శిరోముండనం జరిగింది. ఎండకి వారి బోడిగుళ్లు మెరస్తున్నాయి. మురళి చేతిలో ఎప్పుడూ వుండే ఎర్ర గుర్రం వుంది.

ఇంటినుండి బయటకు వచ్చిన హరి మాటిమాటికి వెనక్కి తిరిగి చూస్తున్నాడు.

వాడి కళ్లలో సందేహమేకాక ద్వేషం, జుగుప్సకూడా

తొంగిచూస్తున్నాయి. వాడి మనఃఫలకంలో ఎంత వద్దను కున్నా రాత్రి దృశ్యం కదలాడుతోంది. తన అమ్మని ధర్మ దాస్ కౌగలించుకుని ముద్దుపెట్టుకోవడం చూశాడు. తరు వాత అమ్మను నడిపించుకుంటూ తన గదిలోకి తీసికెళ్ళాడు.

హరి గాఢనిద్రలో వున్నాడని అనుకుంది ఆనంది. నిజా నికి హరి మంచి నిద్రలోనే వున్నాడు. కాని ఆ చీకట్లో ఎవరో గుసగుసలాడటంతో వాడి నిద్ర ఎగిరిపోయింది.

"నేను రేపుదయం వెళ్ళిపోతాను," ఆ కంఠం చిన్నా న్నదిగా గుర్తించాడు హరి.

"వద్దు, వద్దు" తల్లికంఠం వినిపించింది. "నీవు వెళ్ళిపోతే నేను బ్రతుకలేను. నాకు తెలుసు నేను పాపాత్మురాలని. కాని, కాని ఏంచేయను. నిన్ను చూసిన తరువాత నీ గాన మాధుర్యాన్ని చవిచూచిన తరువాత, నన్ను నేను ఆపుకోలేక పోతున్నాను."

"నేనూ వుండలేకపోతున్నాను. వెళ్ళిపోతా నంటు న్నానేకాని, వెళ్ళి ఎలా బ్రతుకుతానో తెలియదు. నా బ్రతుక్కి అర్థం తెలిపింది నువ్వు, నీ ప్రేమ మాత్రమే!"

కొద్దిసేపు మౌనం. ఆ తరువాత...

"నీవు వెళ్ళిపోనని మాటివ్వు."

"వద్దు; నిన్ను పాడుచేయలేను. నాకు పాపం చుట్టు కుంటుంది."

"ఇంకా నేను పాడవటం ఏముంది? ఏనాడు నామనస్సు నిన్ను కోరిందో నాడే నేను చెడిపోయాను."

"నేనంటే నిజంగా నీకంత ప్రేమ వుందా?"

మళ్ళీ కొంచెంసేపు నిశ్శబ్దం.

"నా జీవితంలో నాకేం లభించింది చెప్పు" ఆనంది అడిగింది.

"నాకూ జీవితంలో ఏమీ లభించలేదు ఆనందీ!" ధర్మదాస్ అన్నాడు. "నా జీవితంలో నేను సంపాదించింది ఈ గానమొక్కటే!"

"అదృష్టవంతుడవు. నీకా గానమయినావుంది. ఆవేదనాభరితమయిన హృదయాన్ని పాటలుపాడి తేలిక పర్చుకో గలవు. నావద్ద అదికూడా లేదు."

"నీవు వుండిపొమ్మంటే వుండిపోతాను ఆనందీ!"

"నిజం! నిజంగా అంటున్నావుకదూ!" హర్షోల్లాసంతో అంది.

"అవును."

ఆ తరువాత ధర్మదాస్ ఆకారం లేచి నిలబడింది. తరువాత అతని మాట వినిపించింది. "నా గదిలోకి పోదాం, పద..."

"వద్దు; ఇవాళ వద్దు! మరెప్పుడయినా."

"పద; మంచిదానివికదూ! నా రాణివి."

ధర్మదాస్ ముందుకివంగి, ఆనందిని పైకిలేపి గుండెల కదుముకుని ముద్దుపెట్టుకున్నాడు. ఆ తరువాత ఇరువురూ ఆ గదిలోంచి బయటకు వెళ్ళిపోయారు.

ఆ తరువాత ఎంతసేపటి వరకు మేలుకుని వున్నాడో హరికి తెలియదు. తానేదో తుఫానులో చిక్కిన సముద్రంలో ఇరుక్కున్నట్లుగా అనుభూతి పొందాడు హరి. అతని పసి హృదయం విలవిల్లాడింది.

అమ్మ వున్నట్లుండి ఎందుకలా ప్రవర్తించింది? ధర్మదాస్ అమ్మతో ఎందుకలా ప్రవర్తించాడు. హరికి ఏమీ అర్థం కావటంలేదు.

ఆ పసివాడి హృదయం కోపంతో కుతకుతలాడుతోంది. కోపాన్ని మించి వాడి మనస్సులో తనూ, తమ్ముడూ మరింత అనాథలం అవుతున్నామేమో అనే భయం గూడుకట్టుకుంది.

'నిజంగా అమ్మ మమ్మల్ని వదిలిపోతుందా?' అనుకున్నప్పుడు వాడి శరీరం జలదరించింది. తన చేతుల్లో వున్న తమ్ముణ్ణి గట్టిగా కౌగలించుకున్నాడు.

ఏం చేయాలి? ఈ విషయం ఎవరితోనయినా చెప్పాలా? చెబితే అమ్మగతి ఏమవుతుంది. ఇరుగు పొరుగు వాళ్ళంతా అమ్మని అసహ్యించుకుంటారు. తిడతారు. అవమానిస్తారు. ఊహుఁ! ఎవరికీ చెప్పను—అనుకున్నాడు.

ధర్మదాస్ ప్రవర్తన హరికి నచ్చటంలేదు. రోజురోజుకి అతనిపై అనుమానం పెరుగుతోంది. ఒకటి రెండుసార్లు ఈ విషయం తల్లితో చెప్పాడు.

"అమ్మా! నాకెందుకో చిన్నాన్న మంచివాడనిపించటం లేదు. ఆయన్ని వెళ్ళిపొమ్మను."

"హరీ! ఏమిట్రా అది. పెద్దలగురించి అలాగేనా మాట్లాడ్డటం" గద్దురుముతూ బెదిరించింది.

"జాగ్రత్త! ఇంకోసారి ఇతరులముందు అలా మాట్లాడవద్దు. మా చిన్నాన్న ఎంత మంచివాడో నాకు తెలుసు."

కాని; తన మనస్సుని ఎంత అదుపులో వుంచుకున్నా వాడిమనస్సు ధర్మదాస్ మంచివాడంటే ఒప్పుకోవటంలేదు.

ఇదంతా ఒకఎత్తు అనుకుంటే తన మనస్సులోని ఒక విషయాన్ని వాడి తల్లిముందు కూడా వెలువరించలేక పోతున్నాడు. ఆ రహస్యం వాడి మనస్సుని మధనపరుస్తోంది. వాడి తండ్రి దీనానాథ్ ఈ విషయాన్ని తల్లికికూడా చెప్పవద్దని వాణ్ణి హెచ్చరించాడు.

ఆ రాత్రి "నువ్వు చూసేశావా! హరీ! చూస్తే చూశావు గాని, ఈ విషయం ఎవరికి చెప్పకు. మీ అమ్మకుకూడా! తెలిసిందా?" కొడుకుతో అన్నాడు దీనానాథ్.

కాని, ఇప్పుడు తండ్రి మరణించిన తరువాత ఎందుకింకా ఆ రహస్యాన్ని దాయాలి. అమ్మకు చెప్పా లనుకుంటాడు.

కాని...కాని ధర్మదాస్ కారణంగా తల్లికికూడా తన మనస్సు లోని మాటని చెప్పలేక మథనపడుతున్నాడు.

# 7

మురళిని వెంటబెట్టుకుని హరి నదిఒడ్డుకి నడిచాడు. నది ఒడ్డున తడి ఇసుకపై తనపాదముద్రలు ముద్రిస్తూ జరిగిన, జరుగుతున్న సంఘటనలు నెమరువేసుకుంటూ ఏకాంతమూ, నిర్మానుష్యమూ, అయిన ప్రదేశానికి చేరుకున్నాడు హరి.

దట్టంగావున్న చెట్లపైనుండి పక్షుల కిచకిచలు, నదిలో నుండి కప్పలుచేస్తున్న బెకబెకలు తప్ప, మరో విధమయిన శబ్దము లేదు.

"అన్నయ్యా రేగిపండు" దూరంగావున్న రేగిపళ్ళ చెట్టు చూపిస్తూ అడిగాడు మురళి.

"రేగిపళ్లు కావాలా?"

మురళి 'అవును' అన్నట్లుగా తలూపాడు.

హరివెళ్ళి రేగిపళ్ళు తెంపుకొచ్చి తమ్ముడికిచ్చాడు. మురళి వాటిని తినడంలో నిమగ్నమయ్యాడు.

"గింజలు మింగవద్దు" తమ్ముణ్ని హెచ్చరించాడు.

తరువాత తమ్ముడి చేతిలోని ఎర్రగుర్రం తను తీసుకుని తమ్ముణ్ని అక్కడే కూర్చోమని చెబుతూ ముందుకి సాగి పోయాడు.

కొంచెం దూరంలోవున్న ఒక రాగిచెట్టు వెనక్కి వెళ్ళి గుర్రం కడుపు నొక్కిచూశాడు. తరువాత అతను జేబు లోంచి ఒకసూది తీశాడు. సూదికి ఎర్రనిదారం ఎక్కించి వుంది. సూది మొనతో గుర్రంకడుపుదగ్గ కుట్లని విప్పాడు.

నెమ్మదిగా రెండువేళ్ళని లోపలకు పోనిచ్చి కడుపుని కెలికి ఒకవస్తువుని బయటకుతీశాడు.

అది పెద్ద నిమ్మకాయ సైజులో పలకలు పలకలుగా

వుండి చెట్లకొమ్మల్లోంచి ప్రసరిస్తున్న సూర్యకాంతికి కళ్ళు మిరుమిట్లు గొలిపేలా మెరుస్తూంది.

ఆ మెరపుకి హరికళ్ళు మిరుమిట్లు గొలిపాయి. అదేమిటో హరికి తెలియదు. కాని, పోలీసులు వెదికిన వజ్రం అదేనని, చాలా విలువయిందనిమాత్రం అర్థంచేసుకొన్నాడు. అంతే కాదు, దాని కారణంగానే తన తండ్రి ప్రాణాలు పోయాయనికూడా తెలుసు.

ఆ వస్తువు జాగ్రత్తగా గుర్రంకడుపులోనే వుందని సంతృప్తిపడి, దాన్ని తిరిగి లోపలకు తోసాడు. నారపీచు మధ్య దాన్ని జాగ్రత్తగా దాచి గుర్రపు కడుపుని తను వెంటతెచ్చిన సూదితో కుట్టేశాడు.

తనని ఎవరయినా చూడలేదుకదా అన్న అనుమానంతో ఒకసారి నలువైపులా చూశాడు. ఎక్కడా, ఎవరూ కనిపించలేదు. అంతా నిర్మానుష్యంగావుంది.

జాగ్రత్తగా కుట్టిన తరువాత చెట్టుచాటునుండి బయటకు వచ్చి, తమ్ముడివైపు సాగాడు. గుర్రాన్ని మురళి వడిలో విసిరాడు.

ఎంత వద్దనుకున్నా హరికళ్ళలో ఆ రాత్రి జరిగిన సంఘటన కదలాడింది.

## 8

గాఢనిద్రలోవున్న హరికి తలుపువద్ద చిన్న అలికిడి వినిపించి కళ్లు తెరిచి చూశాడు.

చీకట్లో అతనికేమీ కనిపించలేదు. అలాగే తలుపువేపు చూస్తున్నాడు.

తలుపులు లోపలినుండి గడియపెట్టి వున్నాయి. అయినా తలుపులు లోపలికి తెరుచుకున్నాయి. ఒగరుస్తూ ఒక వ్యక్తి లోపలికి వచ్చాడు. ఆ వచ్చిన వ్యక్తిని ఆకారాన్ని బట్టి

తన తండ్రిగా గుర్తించాడు హారి.

తన తండ్రి జేబులోంచి ఒక కాగితపు పొట్లంతీసి నేలపై పెట్టాడు. తరువాత గుర్రం కడుపువద్ద పట్లని నోటితో తెంపాడు. పొట్లం విప్పగానే ఏదో వస్తువు మెరవడం చూశాడు. మెరుస్తున్న ఆ వస్తువుని తండ్రి గుర్రంకడుపులోకి తోసాడు. అదేదో చాలా విలువయినదే అనిపించింది హారికి.

ఆ గుర్రాన్ని చేతపట్టుకుని తండ్రి గదిలో అటు, ఇటూ దేనికోసమో వెదుకుతున్నాడు. కాని కావలసింది దొరకడం లేదు. విసుక్కుంటున్నాడు. భయపడుతున్నట్లు హారి కనుగొన్నాడు. అతనికళ్ళు చీకటికి అలవాటు పడటంవల్లతండ్రి ముఖంలోని కంగారు గమనించాడు.

హారి ఇక వుండబట్టలేకపోయాడు. "ఏమిటి వెదుకుతున్నావు నాన్నా?" అడిగేశాడు మెల్లిగా, రహస్యంగా.

తండ్రి వులికిపడ్డాడు. "అరే! హారీ! నీవు మేలుకొన్నే వున్నావా? సూది, దారం ఎక్కడుందో తెలుసా! ఎర్రదారమయితే మంచిది. కాని దీపం వెలిగించవద్దు."

ఆ సాయంత్రమే తన ఎర్రచొక్కా భుజంపై చెరిగిపోతే అమ్మ దాన్ని కుట్టి గూట్లో పెట్టడం హారికి గుర్తుంది. మెల్లగా లేచి సూది దారం తెచ్చిచ్చాడు.

"ఇది ఎర్రదారమేనా?" అడిగాడు తండ్రి.

"అవును."

"ఎలా తెలుసు?"

"సాయంత్రం నా ఎర్రచొక్కా భుజంపై చిరిగిపోతే అమ్మకుట్టింది నాన్నా!"

తండ్రి గబగబ గుర్రంకడుపుకుట్టి, ఆ గుర్రాన్ని మూలపక్కన పెట్టాడు.

ఆ తరువాత అతను పడుకోబోతుండగానే బయట బూట్ల

చప్పుడు వినిపించింది. తండ్రి మళ్ళీ వులికిపడిలేచి కూర్చున్నాడు.

"హరీ! పడుకో!" తండ్రి కంగారుగా అన్నాడు. "నువ్వు చూసిందంతా మర్చిపో, ఎవరితోనూ చెప్పొద్దు, మీ అమ్మతో కూడా. సరేనా. నేను వస్తాను."

అంటూ వెనుక తలుపువైపు పరుగెత్తసాగాడు.

ఆలోగా పోలీసులు ముందుతలుపులు బద్దలు కొట్టారు. తండ్రిని ఆగమని పోలీసులు హెచ్చరించారు. కాని అతను ఆగలేదు.

అప్పుడే పోలీసుల వైపునుండి ఒక నిప్పురవ్వ తండ్రివైపు దూసుకుపోయింది. చెవులు చిల్లులుపడేలా, గుండెలు గుబగుబలాడేలా భయంకరమయిన చప్పుడు ఆ గదిలో ధ్వనించింది. తన తండ్రి కంఠంలోంచి అరుపుకూడా బయటకు రాలేదు. ఆలోగా అమ్మ లేచికూర్చుంది.

పోలీసుల చేతుల్లో టార్చిలు వెలుగుతున్నాయి. అమ్మ లేచి లాంతరు వెలిగించింది. నాన్న తలుపులవద్ద కదలిక లేకుండా నెత్తుట్లో పడివున్నాడు. పోలీసులు నాన్న జేబులు శరీరంపైనా వెదికారు. ఏమీ దొరక్కపోయేసరికి ఆ గదినంతా గాలించి వదిలారు.

ఒక అధికారి అడ్డంగా వచ్చిన గుర్రాన్ని విసురుగా దూరంగా తన్నాడు. అమ్మ ఒడిలో కూర్చున్న మురళి ఏడ్వసాగాడు. "నా గుల్లం అమ్మా నా గుల్లం."

కాని ఎవరూ ఆ గుర్రాన్ని మురళికి అందివ్వలేదు. ఆ గుర్రాన్ని తెచ్చి తమ్ముడి కిద్దామని హరికి అనిపించింది. కాని ధైర్యం చాల్లేదు. ఉదయంవరకు అంతా వెదికి, "అది కృష్ణప్రసాద్ వద్దే వుండివుంటుంది" అని ఒకరినొకరు అనుకుని వెళ్ళిపోయారు.

ప్రతిరాత్రి ఆనంది తమ గదిని వదిలి ధర్మదాస్ గదిలోకి

వెళ్తుంది. వెళ్ళేప్పుడు ఈ గదికి బయటినుండి గొళ్ళెంబిగించి మరీ వెళ్తుంది.

ఆ గదివద్దకు వెళ్ళాలని, వాళ్ళేం మాట్లాడుకుంటారో వినాలని హరి విఫలప్రయత్నం చేయసాగాడు.

ఆ రాత్రి ఆనంది, ధర్మదాస్ గదిలోంచి చాలా త్వరగా తిరిగివచ్చింది. వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"భగవాన్! ఏమిటి? నేనేం చూస్తున్నాను. ఇక నా జీవితంలో ప్రశాంతత లేదా! ఈ మనిషిని గురించి నేనేమను కున్నాను. ఏంచూస్తున్నాను. ఇదా ఇతని అసలురూపం?" గొణుక్కుంటూ కుళ్ళికుళ్ళి ఏడుస్తోంది.

హరి అంతా గమనించాడు. కాని వాడికేమీ అర్థం కాలేదు. అమ్మ, ధర్మదాస్‌ని గురించి ఏదో గొణుగుతోందని అనుకున్నాడు.

"హరీ! నీకేమయినా తెలుసా! నిజంగానే ఆ రాత్రి మీ నాన్న ఏమీ తేలేదా?" రెండవరోజు వుదయం హరిని అడిగింది ఆనంది.

హరి గుండెలు ఒక క్షణంపాటు కత్తుకదాకా వచ్చితిరిగి యథాస్థానం చేరుకున్నాయి. తననితాను అదుపులో పెట్టు కుంటూ "లేదు;ఏమీ తేలేదే. దేన్ని గురించి అడుగుతున్నావు" అడిగాడు.

"వజ్రంలాంటి దేదయినా మిలమిల మెరుస్తుంటుంది. పోలీసులుకూడా దానిగురించే వెదికారు."

"లేదు; అలాంటిదేమీ లేదు" హరి ఆశ్చర్యంగా అన్నాడు. "అయినా వజ్రం నాన్న తెచ్చాడని నీ కెవరు చెప్పారు?"

"ఎవరూ చెప్పలేదు; నేనే అడిగాను. రెండుమూడు రోజుల తరువాత చిన్నాన్న వెళ్ళిపోతానంటున్నాడు. ఆ తరువాత ఎలా బ్రతకడం. అటువంటి దేదయినా వుంటే

చిన్నాన్న దాన్నమ్మి డబ్బు తీసుకువస్తాడు కదా!"

హరి, తల్లి ముఖంలోకి చూడసాగాడు. ఒక్క మాటకూడా మాట్లాడలేదు. తల్లి మనస్సులోని భావన ఏమిటో తెలుసుకోవడానికి ప్రయత్నం చేశాడు.

ధర్మదాస్ సర్వదా మంచిగా వుండటం, ధార్మికునిలా, వేదాంతిలా మాట్లాడటం, అవసరం దొరగ్గానే దేనిగురించో వెదకడం అంతా హరి కళ్ళముందు కదలాడింది.

తల్లి మౌనం వహించగానే, తనుకూడా మౌనంగా బయటకు వచ్చాడు హరి.

# 9

రాత్రి పన్నెండు గంటల సమయం.

చిక్కటి చీకటి కాటుకలా అలుముకుని వుంది. నలువైపులా భయంకరమయిన నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ చీకటి పురుగుల ధ్వనులు వినిపిస్తున్నాయి' గోడకున్న మేకుకి వెలిగించివున్న లాంతరువుంది. లాంతరుకున్న గాజు బుడ్డి మసకబారి వుండటంవల్ల వెలుతురు మందంగావుంది.

ఆనంది పడకపై వెల్లికిలా పడుకుంది. విరబోసినట్లున్న ఆమె వెంట్రుకలు దిండుపై దట్టంగా పరుచుకున్నాయి. గుండెలపైనుండి పైట తొలగిపోయింది. ఆమె ఉచ్ఛ్వాస, నిశ్వాసాలకు, ఆమె పాలిండ్లు మందంగా స్పందిస్తున్నాయి.

ఆమె ప్రక్కనే ఇటుతిరిగి పడుకునివున్న ధర్మదాస్ బోర్లాతిరిగి, మోచేతులపై లేచాడు. అతను ఏకదేకంగా ఆనంది ముఖంలోకి చూస్తున్నాడు.

అతని వెంట్రుకలు చిందర వందరగా, చెదరిపోయి వున్నాయి. అతని శరీరంపై కమీజాలేదు. మెడలోవున్న నల్లదారానికి, జగన్నాధుని విగ్రహం వేళ్ళాడుతోంది.

ఆనంది కళ్ళలో ఆలోచన చోటుచేసుకుని వుంది. ధర్మ

దాస్ కుతూహలంగా ఆమెనే చూస్తున్నాడు.

"నువ్వు నా మాటని ఎందుకు అర్థం చేసుకోవటం లేదో నాకు తెలియటంలేదు. ఆ రాత్రి ఆయన ఇంటికి ఏమీ తేలేదు. వారికి ఏమీ తెలియదు. 'తెలుసు' అనేది నీ భ్రమ. ఆయన ఏమయినా తెచ్చివుంటే నాకు తప్పకుండా తెలిసివుండేది. ఆ వజ్రం దొరికితే మనకే మంచిదికదా!" ఆనంది ఆలోచిస్తూ అంది.

"ఎవరికి మంచిది. నీకా నాకా?"

ఆ మాటతో ఆనంది నుదురు ముడిపడింది. ముఖం గంభీర మయింది, "ఏం మనమంతా ఒకటి కాదా?"

"ఏమో ఎవరికి తెలుసు. నీవు నన్ను కలుపుకుని ఆలోచిస్తున్నావని నమ్మకమేముంది?" కుటిలంగా అన్నాడు.

ఆనంది ముఖం పాలిపోయింది. "కొన్ని రోజులుగా గమనిస్తున్నాను. నీ మాటలో చాలా మార్పువచ్చింది. ఎందుకు?" అంటూ లేచి కూర్చుంది.

జారిపోయిన కొంగుని సరిచేసుకుంది. కోపంవల్ల, అవమానంవల్ల ఆమెముఖం ఎర్రబడింది. "ఎందుకు నువ్వా వజ్రం గురించి వెదకుతున్నావు? నువ్వు ఎవరివి?" మొదటిసారిగా అడిగింది.

ధర్మదాస్ పెదవులపై కుటిల మందహాసం వెలసింది. మెడలోని జగన్నాధుని తడుముకుంటూ "నేను కృష్ణ ప్రసాద్‌ను. నాకా వజ్రంకావాలి" అన్నాడు.

"అంటే... అంటే... నీవా వజ్రం గురించే వచ్చావన్న మాట" ఆనంది విస్ఫారిత నేత్రాలతో అంది. ఆమె కంఠం కంపించింది. గబుక్కున లేవబోయింది.

"ఎక్కడికి?" ఆనంది చేయిపట్టుకుని లాగుతూ అడిగాడు.

"ఏట్లోకి; నీ కెందుకు. నీగురించి ఇప్పుడే ధర్మయ్య తాతకి, మిగిలిన వాళ్ళకి పిలిచి చెబుతాను,"

"ఏట్లోకి వెళతానన్నావు కదూ! అలాగే నేను పంపి స్తాను" ధర్మదాస్ అన్నాడు.

జగన్నాథుని ఒరలోంచి కత్తి బయటకు వచ్చింది. ధర్మ దాస్ ముఖం వికృతమయింది.

తళతళలాడుతున్న కత్తిని చూసి ఆనంది కెవ్వున అరిచింది.

ధర్మదాస్ ఎడమచేయి దృఢంగా ఆనంది నోరుమూసింది. ఆ పట్టునుండి విడిపించుకోవడానికి మెలికలు తిరిగింది ఆనంది. ముఖం వికృతమయింది. కాని విడిపించుకోలేక పోయింది.

కత్తి జగన్నాథుని తలవరకు ఆనంది గుండెల్లోకి దిగ బడింది.

ఆనంది శరీరం నిశ్చేష్టమయింది. నోరు తెరుచుకునేవుంది. భయంవల్ల, బాధవల్ల నేత్రాలు వెళ్ళుకువచ్చాయి. ఒకక్షణం పాటు అలాగే నిశ్చేష్టంగా నిలిబడిపోయాడు.

తరువాత అతను, ఆనంది చీరచెంగుని లుంగచుట్టి కత్తి చుట్టు అదిమి కత్తిని బయటకు లాగాడు. రక్తం బయటకు చిమ్మకముందే లుంగని అక్కడ అదిమాడు. చీరెను అప్పు డప్పుడు మారుస్తూ రక్తాన్నంతా చీరెలోకే ఇంకించాడు.

రక్తస్రావం ఆగేవరకు ఆగాడు. రక్తస్రావం ఆగిన తరు వాత అతను నెమ్మదిగా ఆనందిని పైకెత్తాడు. క్రిందగాని, నేలపై, పక్కపై ఎక్కడా రక్తపు చుక్కకూడా చిమ్మ లేదు.

ఆనంది శవాన్ని దుప్పట్లో జాగ్రత్తగా చుట్టాడు. బయ టకు వచ్చి, హరి, మురళి పడుకున్న గదిబయటనుండి గొళ్ళెం తగిలించి వుండటం గమనించాడు.

నెమ్మదిగా బయటి తలుపు తెరిచాడు. బయట ఎవరూలేరు.

తిరిగి గదిలోకివచ్చి శవాన్ని జాగ్రత్తగా భుజంపైకి ఎత్తు కున్నాడు. నిశ్శబ్దంగా బయటకువచ్చి, నది ఒడ్డుకి సాగి ఉత్తరంవైపుకి నడువసాగాడు. నల్లభై గజాల అవతల ఒక

పెద్ద బండరాయి వుండటం ఇంతకుముందు గమనించాడు.

అక్కడికి చేరుకుని శవాన్నిదించి శవానికున్న చీరతోనూ, దుప్పటితోనూ, ఆ రాయిని బిగించికట్టి, అతికష్టంగా శవాన్ని, రాతిని దొర్లిస్తూ నదిలోకి తోసాడు. బాగా లోతుకితోసి సంతృప్తిగా నిట్టూర్చి వెనుదిరిగాడు.

# 10

తలుపులు తెరుచుకుని ధర్మదాస్ లోపలికి వెళ్ళాడు. ఆ అలికిడికి హరి కళ్ళు తెరిచి చూశాడు.

ధర్మదాస్, మురళిని ఎత్తుకుని తనగదిలోకి వెళ్తున్నాడు. మురళి చేతుల్లో ఎర్రగుర్రముంది. హరి గుండెలు గుబగుబలాడాయి. ధర్మదాస్ వెనుకే పరుగెత్తాడు.

హరి వెనుకే వస్తున్నాడని ధర్మదాస్‌కి తెలుసు. కాని, చూడనట్లే నటించాడు. మురళిని కూర్చుండబెట్టి, ఒక్క ఉదుటన 'జగన్నాధు'ని కత్తిని బయటకు లాగాడు. కత్తి మొనను మురళి కంఠంవద్ద వుంచి నొక్కబోయాడు.

"ఏమిటది? తమ్ముణ్ణేం చేస్తున్నావు?" హరి అరిచాడు.

"చంపేస్తాను. మీ అమ్మనుకూడా చంపి నదిలో పారేశాను," కర్కశంగా అన్నాడు. హరి హడలిపోయాడు.

"వద్దు; వద్దు. తమ్ముణ్ణేం చేయవద్దు, నీకు దండం పెడతాను."

"అయితే చెప్పు! ఎక్కడుందా వజ్రం?" అడిగాడు.

కన్నీళ్ళమధ్య హరి అన్నాడు "చెప్తాను నాతోరా, చిన్నాన్నా!"

"ఎక్కడికి?" హరి రెక్కపట్టుకుని అడిగాడు.

"రా!" అంటూ హరి ధర్మదాస్‌ని చావడిలో ఒక మూల వున్న చిన్నగది వద్దకు తీసుకుపోయాడు. ఆ చిన్నగది గొళ్ళెం తీసి "ఇందులో వుంది" అన్నాడు.

ధర్మదాస్ హారి మెడపై చేయివేసి లోపలకు తోసాడు. అతని వెనుకే తనూ లోపలకు వస్తూ "ఇక్కడ ఎక్కడుంది? ఇక్కడంతా పనికిరాని పాతసామాన్లు, కట్టెలు, బొగ్గులూ వున్నాయి."

"ఇక్కడే ఎక్కడో వుండాలి. ఆ రాత్రి నాన్న పోలీసులు రాగానే దాన్ని ఇందులోకి విసిరాడు" ఏమాత్రం తొణకకుండా అబద్ధం చెప్పాడు.

హారి మాటలకు ధర్మదాస్ కళ్ళలో మెరపు కనిపించింది. అతను పిచ్చివాడిలా లోపలకు చొరబడి చేతికందినసామాను ప్రక్కలకు విసురుతూ, అక్కడలేని వజ్రం గురించి వెదకుతున్నాడు.

అవకాశం దొరగ్గానే హారి బయటకు పరుగెత్తాడు. తమ్ముణ్ని గుర్రాన్ని అందుకుని బయటకు పరుగుతీసాడు. బయటినుండి వీధితలుపు గొళ్ళెంపెట్టి, ముక్కుకి సూటిగా పరుగెత్తాడు.

జరిగిన మోసం గమనించి ధర్మదాస్ బయటకు వచ్చాడు. కాని అప్పటికే హారి బయటినుండి వీధితలుపు గొళ్ళెం బిగించాడు. ఎంత ప్రయత్నించినా తలుపు రాలేదు. వాడువెళ్ళి పురందరికి చెప్తాడేమోనని కంగారుపడ్డాడు.

ముక్కుకి సూటిగా పరుగెత్తిన హారి సేరుగా నదిఒడ్డుకి పరుగెత్తాడు.

ఒకచోట వాడికి చిన్నగోనె కనిపించింది. ఆ దోనె ధర్మయ్యతాత కొడుకుది. అతను అందులో కూర్చుని చేపలు పట్టడానికి వెళ్ళడం హారి చాలాసార్లు చూసాడు.

మురళిని అందులో కూర్చుండబెట్టి దోనెని నదిలోకి తోసాడు. చిన్నగావున్న ఆ దోనెని నదిలోకి తోయడం ఏమంత కష్టంకాలేదు. కొంచెం లోతుకి వెళ్ళగానే ఎగిరి పడవలో కూర్చున్నాడు.

మంద్రంగా ప్రవహిస్తున్న నది, తను వెళ్తున్న వైపుకే హరి, మురళివున్న దోనెనుకూడా తీసుకపోయింది. అక్కడే తనతల్లి నిర్జీవంగా బండరాతికి కట్టబడివుందని, తమదోనె ఆమెను దాటుకని ముందుముందుకి సాగిపోయిందని ఆ ఇద్దరు పసివాళ్ళకి తెలియదు.

నదీప్రవాహంతోపాటు ఆ దోనెలో వారిద్దరూ, గమ్యం లేకుండా పోతూనే వున్నారు. ప్రాణభయంతో ఇద్దరూ బిక్కుబిక్కుమంటూ దానిలో కూర్చున్నారు.

ఆ నదీమతల్లి వారిని ఎక్కడ వదలుతుందో వారికే తెలియదు.

* * *

అతిప్రయాసతో ధర్మదాస్ తలుపులు తెరచుకని బయటకు వచ్చాడు. చుట్టుప్రక్కలంతా చూశాడు. కాని ఎక్కడా అతనికి హరిగాని, మురళిగాని కనిపించలేదు.

పిచ్చివాడిలా మళ్ళీ ఇంట్లోకి పరుగెత్తి గదులన్నీ కలయ చూశాడు. ఎక్కడా వాళ్ళిద్దరూ కనిపించలేదు. తిరిగి బయటకువచ్చి నదిఒడ్డుకి పరుగెత్తాడు.

కొద్దిదూరంలో ఎవరో అరుస్తున్నారు. "నా దోనెని ఎవరో తీసుకపోయారు."

"ఏమయింది?"అంటూ ధర్మదాస్ అతనివద్దకు వెళ్ళాడు.

"నా చేపలుపట్టే దోనెని ఎవరో తీసుకపోయారు. ఇది వరకెప్పుడూ జరగలేదు."

"పడవను దొంగతనం చేయటమా?" ధర్మదాస్ ఆశ్చర్యంగా అని పరికించాడు.

వెన్నెల వెలుగులో అతనికి తడి ఇసుకలో చిన్నపాదాల గుర్తులు కనిపించాయి. ఆ గుర్తులు నదివైపుకి సాగాయి. కాని తిరిగి వచ్చినట్లు గుర్తులులేవు.

అయితే హరి తీసుకపోయి వుంటాడా ఆ దోనెని?

ఆలోచించినకొద్దీ అదే నిజమనిపించసాగింది ధర్మదాస్‌కి. ఒకసారి నదిని పరికించాడు. నది దక్షిణపువైపుకి ప్రవహిస్తోంది. హరి లేతచేతుల్లో ప్రవాహానికి ఎదురుగా తెడ్డు వేసే బలంలేదు. అందుకని, ప్రవాహంతోపాటే ప్రయాణం చేసివుంటారన్న నిశ్చయానికి వచ్చాడు.

నదిఒడ్డునే, ఆ వెన్నెల వెలుగులో మిట్టపల్లాలుగావున్న దారిబాటగుండా దక్షిణపువైపు నడక సాగించాడు.

ఎక్కడో, ఒకచోట వాళ్ళు కనిపిస్తారు. ఆ నమ్మకంతో ముందుకి సాగిపోతూనే వున్నాడు. నడుస్తూనే వున్నాడు.

తూర్పున ఉదయరేఖలు ఉదయించాయి. దృఢమయిన పట్టుదలతో పోతూనే వున్నాడు ధర్మదాస్.

ఉన్నట్లుండి ధర్మదాస్ ఆగిపోయాడు. అక్కడ ఒకచోట ఇసుకలో ఒక దోనె కనిపించింది. ఆ దోనెని గుర్తించాడు. నదిఒడ్డున ఇసుకలో తిరగబడి కూరుకుపోయి వుందది. అయితే వాళ్ళిద్దరూ...

అనుమానంగా చుట్టూ చూశాడు. కొద్ది దూరంలో హరి, మురళీల శవాలు పడివుండటం కనిపించింది. దగ్గరగా వెళ్ళి చూశాడు. హరి బిగ్గరగా తమ్ముడిని కాగిలించుకుని వున్నాడు. మురళి చేతిలో ఎర్రగుర్రం అలాగే వుంది.

హృదయవిదారకమైన ఆ పసివాళ్ళ శవాలను చూచిన, ధర్మదాస్‌కు, ఉరఫ్ కృష్ణప్రసాద్‌కు కూడా హృదయం చలించింది. వారితోపాటు ఎర్రగుర్రాన్ని కూడా ఒకచోట మట్టిలో పూడ్చి భారంగా తన గమ్యస్థానంవైపు సాగాడు.

ఎర్రగుర్రంలోని వజ్రం అలాగే కాలగర్భంలో కలిసిపోయింది.

—: ఐపోయింది :—

# హంతకులొస్తారు జాగ్రత్త!

ఏ. వీ. మోహన్రావ్

రజనీకాంత్ తలుపు నెట్టుకొని లోనికెళ్ళాడు. ఎదురుగా తనవు ఒక పరిచితమైన పెద్ద గదిద్వారం. తలుపులు మూసు కొని వున్నాయి. పైభాగాన ఎర్రటిలైటు వెలుగుతూంది.

"మార్నింగ్ మిస్టర్ కాంత్" టైపు చెయ్యడం ఆపి విష్ చేసింది మేరీ.

"మార్నింగ్ మిస్ మేరీ!" అన్నాడు వచ్చి ఆమె కెదు రుగా వున్న కుర్చీలో కూర్చుంటూ కాంత్.

"హౌ యీజ్ లైఫ్!"

"వెరీవెరీ డల్!"

"రియల్లీ! నువ్వెప్పుడూ అందమైన అమ్మాయిల మధ్య మునిగి తేలుతుంటావని చాలామంది అంటూంటారు. మరీ

డల్‌నెస్ ఎందుకుంటుంది."

"నువ్వందంగా లేవా?"

"ఏమో! నాకేం తెలుసు."

"బాత్‌రూంలో నీకేసి నువ్వెప్పుడూ చూసుకోలేదా?"

"యూ సిల్లీ!" అంది నవ్వుతూ తలొంచుకుని మేరీ.

"నువ్వెప్పుడైనా నాతో వచ్చావా?"

"నన్నెప్పుడైనా రమ్మన్నావా?"

"అయితే ఇవాళ రా."

"ఇవాళా! వండర్‌ఫుల్! నిన్ను అర్జంటు పనిమీద పిలిపించాడు బాస్. బహుశా ఇంకో గంటలో నువ్వీ దేశం దాటి పోవల్సి వుంటుందని నా అనుమానం. ప్రాణాలతో తిరిగొస్తే ఇన్వయిట్ చెయ్యి మళ్ళీ వస్తాను."

ఎర్రలైటారి పోయింది.

మేరీ ఇంటర్‌కమ్ రింగ్ చేసింది.

అవతల వేపునుండి "యస్!" అంటూ మ్రోగింది బాస్ కంచుకంఠం.

"మిస్టర్ కాంత్ ఈజ్ వెయిటింగ్!" అంది మేరీ.

"సెండ్ హిమ్ ఇన్!" అని ఫోను పెట్టేశాడు.

"మీరు వెళ్ళొచ్చు" అంది కాంత్‌ను, తను కూడా రిసీవర్ను క్రేడిల్ పైన పడేస్తూ.

కాంత్ తలుపు త్రోసుకుని లోనికెళ్ళాడు. విశాలమైన రోజ్‌వుడ్ టేబుల్. దానివెనుక ఎత్తయిన కుర్చీ. అందులో నేవీబ్లూ సూట్‌లో కూర్చుని వున్నాడు. ఆయన వెనుక వేపు నున్న గోడకు పెద్ద ప్రపంచ పటం వ్రేలాడుతోంది. అక్కడక్కడా పటంలో ఎర్రటి ఇండికేటర్లున్నాయి.

"ప్రొఫెసర్ ప్రేమనాథ్ డోగ్రే పేరెప్పుడైనా విన్నావా కాంత్?" అడిగాడు బాస్.

"లేదనుకుంటాను!" అంటూ కూర్చున్నాడు కాంత్.

"అతనో పెద్ద సైంటిస్టు. ఇరవయ్యవ శతాబ్దంలో మన దేశంలో పుట్టిన మహామహుల్లో ఒకడు. పాతిక సంవత్సరాలు కృషిచేసి అతను ఉప్పునీటినుండి పెట్రోలు, డీజిల్, ఫర్నెస్ ఆయిల్ లాంటి ఇంధనాల్ని తయారుచేసే ఫార్ములాను కనిపెట్టాడు" ఆగాడు బాస్.

మినీ కరోనాల పాకెట్ తెరచి అందులోంచి ఒక సిగార్ వెలుపలకు లాగాడు. అగ్గిపుల్లతో చిన్న రంధ్రంచేసి, ఆ వైపు నోట్లో పెట్టుకొని వెలిగించాడు.

కాంత్ కు చుట్టవాసన గిట్టదు. దగ్గొచ్చింది. బాస్ ముందు దగ్గడం బాగుండదని తమాయించుకున్నాడు.

"అతన్ని ఎవరో అంతర్ధానం చేశారు."

"మైగాడ్!"

"అతని ఫార్ములా మన ప్రభుత్వానికి ఇవ్వకముందే ఇది జరిగింది. పోలీసులు మూడు మాసాలపాటు అతని కేసు దర్యాప్తు చేసి లాభంలేక విరమించుకున్నారు. ఆ తర్వాత సి. బి. ఐ. నెలరోజులపాటు ప్రయత్నంచేసి, ఇది మామూలుగా జరిగే నేరాల్లాంటిది కాదనీ, ఏదో విదేశీ గూఢచారి ముఠాపనయి వుండాలని అభిప్రాయపడింది. వెంటనే కేసును మనకు రెఫర్ చేశారు."

"అంటే అతను అంతర్ధానమై ఆరునెలలయిందా?"

"దాదాపుగా అయింది. దేశదేశాల్లోవున్న గూఢచారుల్ని వెంటనే హెచ్చరించాం. మన శత్రుకూటమి ఏజంట్లలో ఏదో కొత్త ఉత్సాహం కనపడుతూందని పరిస్తాన్ లోవున్న ఏజంటు రిపోర్టు పంపాడు. ఆ తర్వాత ఇరవై నాలుగు గంటలలో అతను కారాక్సిడెంటులో చనిపోయాడు. మనకున్న కొత్త ఏజంటక్కడ. వెంటనే మరో ఏజంటును పంపాను. వారం దినాలు పూర్తికాకముందే అతన్నిగూడా మట్టు

బెట్టారు'' అన్నాడు బాస్.

''ఆ మొదటి ఛాన్సు నా కివ్వవలసింది బాస్!'' అన్నాడు కాంత్.

''నేను ఇది సులభంగా పరిష్కారమవుతుందనుకున్నాను'' అన్నాడు బాస్.

''మేరీ నీకు అన్నీ వివరంగా చెబుతుంది. అక్కడ మనకు నమ్మకమైనవాళ్ళ అడ్రసులు ఇస్తుంది. నువ్వు వెంటనే పరిస్తాను వెళ్ళు. అవసరమైతే జార్జినికూడా తోడు తీసుకెళ్ళు.''

''ఆల్ రైట్! వస్తాను బాస్!'' అన్నాడు లేస్తూ.

''అవతలి వాళ్ళు అసాధ్యులు. నువ్వు ప్రాణాలతో తిరిగి రావాలి! జాగ్రత్త!'' అన్నాడు బాస్.

''నేను ప్రాణాలతో రాకున్నా, షోగేని ప్రాణాలతో పంపుతాను. విష్ మీ ఆల్ ది లక్!'' అన్నాడు కాంత్.

''విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్! మైసన్!'' అంటుంటే ఆయన కళ్ళు ఆర్ద్రమైనాయి.

## 2

విమానం ఏర్ పోర్ట్‌లో ఆగింది.

కాంత్ దిగాడు. వెనకాలే జార్జి కూడా దిగాడు.

ఇద్దరివద్దా ఆయుధాలేవీలేవు. వాళ్ళ దగ్గరున్న బ్రాండ్ కేసుల్లో వాళ్ళకు సంబంధించిన వీసాలు, కాగితాలు వున్నాయి. విజటర్సు లాంజ్‌లో కడుగు బెట్టారు.

పరిస్తాన్ ముస్లిం దేశం కావటంతో అక్కడున్న ఆడ వాళ్ళంతా పరదాల్లో వున్నారు. తెల్లటి పాదాలు చేతులు తప్ప మరేమీ కన్పించటంలేదు.

తమనెవరైనా పరిశీలిస్తున్నారేమో తెలుసుకుందామని ప్రయత్నించారు. ఎవరిగోడకల్లో వాళ్లున్నట్లనిపించింది. కాని

పరదాల వెనుకనున్న స్త్రీ లెవ్వరయినా తమను చూస్తున్నా గుర్తించే అవకాశంలేదు.

కాంత్ వెలుపల కొచ్చాడు. టాక్సీని పిలిచి ఎక్కాడు. జార్జి గూడా లోనికి దూకాడు.

"హోటల్ ఆల్మండ్!" అన్నాడు.

టాక్సీ రివ్వున దూసుకుపోయింది. ఇరవై నిముషాల్లో టాక్సీ హోటల్ చేరుకుంది. ఫేర్ చెల్లించి ఇద్దరూ దిగి రిసెప్షన్ కౌంటర్ ముందుకు వెళ్ళారు. కాంత్ పేరు చెప్పగానే "రూం నెంబరు మూడ్నొందలా మూడు మీకు రిజర్వు చేసి వుంచాం!" అన్నాడు.

హోటల్ భాయ్ కేస్ తీసుకుని ముందునడిచాడు. ఇద్దరూ అతన్ని అనుసరించారు.

ఎలివేటర్ ఆర్గో అంతస్తులో ఆగింది. ముగ్గురూ దిగారు. దిగి, కుడివేపునున్న మూడో రూం తలుపులు తెరిచాడు భాయ్. కాంత్, జార్జ్ లోనికి దూరారు. విశాలంగా వుంది గది. అన్ని సౌకర్యాలు వున్నాయి.

"మీకేమైనా కావాలా సార్!" అడిగాడు భాయ్.

"అవసరంలేదు!" అన్నాడు కాంత్.

భాయ్ వెళ్ళిపోయాడు. కాంత్ తలుపులుమూసి లోపలి నుండి లాక్ చేశాడు. హిప్ పాకెట్ లోంచి స్క్రూ డ్రైవరు తీసి ఎయిర్ కండిషన్ ప్లాంటు విప్పాడు. తమ సంభాషణ వినేందుకు ఏదైనా మైక్ అందులో బిగించారేమోనని అతని అనుమానం. అలాంటిదేమీ అతనికి కనిపించలేదు.

అనుమానమున్న ప్రతివస్తువూ పరిశీలించాడు! ఆ తర్వాత అన్నీ యధాతధంగా సర్ది ఏ. సీ. ప్లాంటు ఆన్ చేశాడు.

"మన కార్యక్రమ మేమిటి?" అడిగాడు జార్జి.

"నువ్వు కడుపునిండా తిని పడి దొర్లుతూండు. నాకు

రెండు చిన్నపనులున్నాయి. చూసుకొని వస్తాను" అన్నాడు కాంత్.

"నాతో అవసరంలేదా?"

"ప్రస్తుతంలేదు. అవసరముంటే ఫోన్ చేస్తాను. రా!"

మాట్లాడుతూనే డ్రస్ చేసుకున్నాడు కాంత్. ఈలవేసుకుంటూ రూంలోంచి బెలుపలికొచ్చాడు. మెట్లుదిగి హోటల్ బైటపడ్డాడు. టాక్సీ ఆపి ఎక్కాడు.

"కిదర్ జానా!" అడిగాడు డ్రైవరు.

"మక్కా మసీద్!" చెప్పాడు.

టాక్సీ దూసుకుపోతూంటే, కిటికీలోంచి కదిలిపోయే జనాన్ని, అంగళ్ళను చూస్తూ కూర్చున్నాడు.

ఇరవై నిముషాల ప్రయాణం తర్వాత, టాక్సీ పెద్ద చలువ రాతి భవనం ముందాగింది.

టాక్సీ డ్రైవరుకు డబ్బిచ్చి దిగాడు. కారువదిలి వెళ్ళిందాకా అక్కడే నిలబడ్డాడు. ఆ తర్వాత తన్నెవరైనా గమనిస్తున్నారేమోనని చుట్టూచూశాడు. ఎవ్వరూ తనను పట్టించుకోవడం లేదని నిర్ధారణ చేసుకున్నాక మాస్క్ లోకి దూరాడు.

బూట్లువిప్పి ఒక వారగా పడేశాడు. లోపలకు వెడుతుంటే ఒక సాయిబు ఎదురైనాడు. కాంత్ కేసి వింతగా చూశాడు.

"మౌల్వీ మస్తాన్ సాబ్ హోనా!" అన్నాడు వచ్చీరాని హిందీలో.

"అందర్ హై! సీదా జాయి యే!" అన్నా డతను.

కాంత్ తిన్నగా లోనికి వెళ్ళాడు. పాడవుపాటి తెల్లటి గడ్డంతో ఖొరాన్ చదువుకొంటూ కూర్చున్న వ్యక్తినిచూసి అతనే తనకు కావలసిన వ్యక్తయి వుంటా డనుకున్నాడు. దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు.

"ఆదాబర్!" అన్నాడు కాంత్.

మాల్వీ తలెత్తి చూశాడు.

"నాపేరు కాంత్. నా నెంబరు మూడువందల మూడు" అన్నాడు.

మాట్లాడ వద్దన్నట్లు సంజ్ఞ చేశాడు మాల్వీ. వెంటనే అక్కడ్నుంచి లేచి, కాంత్ ను తనవెంట రమ్మన్నట్లు సంజ్ఞ చేశాడు.

ఇద్దరూ మేడ మెట్లెక్కి పైనున్న గదిలోకి వెళ్ళారు. మాల్వీసాబ్ గదితలుపులు మూశాడు.

"మీ బాస్ నిన్ను పంపుతున్నట్లు మెసేజ్ ఇచ్చాడు. మీరన్నా, మీదేశమన్నా నాకు అంతులేని గౌరవం. నేను అక్కడేపుట్టి పెరిగాను. పరిస్థితుల ప్రభావంవల్ల ఇక్కడికి వచ్చేశాను" అన్నాడు మాల్వీ.

"మా సైంటిస్టును కొంతమంది దుండగులు బంధించి తెచ్చిన వైనం తెలుసనుకుంటాను. మా ఏజంట్లు ఇద్దరు వాళ్ళచేతుల్లో హతమైన విషయంగూడా మీకు తెలుసనుకుంటాను" అన్నాడు కాంత్.

"తెలుసు. మీ రెండో ఏజంటు దారుణంగా హత్యగావించబడ్డాడు. అతనుగూడా నావద్దకువచ్చి వెళ్తూండేవాడు. పనికన్నా ఎక్కువ ఆడపిల్లల్ని వేటాడడంలో నిమగ్నమైనాడు. చివరకు ఆ గొడవల్లోనే హత్యకాబడ్డాడని అనుకునేలా తెలివిగా హత్యచేశారు వాళ్ళు."

"నాకా హత్య వివరాలు కావాలి!" అన్నాడు.

"ఇస్తాను. ఇంకేమన్నా కావాలా?"

"నాకో మంచి రివాల్వరు కావాలి. మీరు ఏర్పాటు చెయ్యగలరా?"

"చేస్తాను" అంటూ మూలనున్న అల్మైరా తెరచి, అందులోంచి ఒక పెద్ద కవరు, ఒక వెప్సన్ ఆటోమేటిక్ రివాల్వరు అందించాడు.

"ఆ కవర్లో, నేను ఇంతదాకా సంపాదించిన వివరాలున్నాయి. జాగ్రత్తగా చదువుకో! ఉపయోగపడతాయి" అన్నాడు మాల్వీ.

"థాంక్స్!" అంటూ లేచాడు కాంత్.

"మిస్టర్ కాంత్! మీ ప్రత్యర్థులు అఖండులు. నెత్తురు తాగేపిశాచాలు. వాళ్ళతో జాగ్రత్తగానేగాదు, దయా విహీనంగా ప్రవర్తించాలి.అప్పుడే నువ్వు విజయం సాధిస్తావు. ఇక్కడి ప్రభుత్వం, వాళ్ళకు మద్దతు ఇస్తుందని నేననుకోను. అలాగే నిన్నూ సమర్థించదు. నీకు ప్రభుత్వ సహాయమేమీ లభించదు. అవకాశం చిక్కితే నిన్ను వాళ్ళు అరెస్టు చేసేందుకూ కూడా వెనుకాడరు. కాబట్టి జాగ్రత్త!" హెచ్చరించాడు మాల్వీ.

"ఫరవాలేదు! అవసరమైతే మళ్ళీ వస్తాను" అన్నాడు కాంత్.

# 3

గ్లాసునిండా విస్కీ పోసుకున్నాడు వాల్టర్. ఆనందంలో అతనికళ్ళు మెరుస్తున్నాయి.

తను ప్రేమనాథ్ డోగ్రేను ఎంతో తెలివిగా మాయం చేసుకొచ్చాడు. అతనికోసం ఇండియన్ గవర్నమెంటు చేస్తున్న ప్రయత్నాలన్నింటినీ, మొగ్గలోనే తుంచివేయగలిగాడు.

అయినా అవతలవాళ్ళు అంతటితో ఆగరని తెలుసు. ఈ మారు ఇంకా తెలివైన గూఢచారిని పంపుతారు. అతన్నికూడా తను మట్టుబెట్టకలగాలి. డోగ్రేనుండి నిజం కక్కించేయాలి.

విస్కీ గొంతులో పోసుకున్నాడు.

తనక్రింద పనిచేస్తున్న ముగ్గురు వ్యక్తులు గుర్తుకొచ్చారు.

ఇద్దరూ పచ్చినెత్తురు త్రాగే పిశాచంల్లాంటివారు. చంపడం వాళ్ళకు హాబీ. చంపాక సీసాలకు సీసాలు ఖాళీచేసి పడి దొర్లడం అలవాటు. వాళ్ళిద్దర్నీ అదుపులో పెట్టుకొని ప్రత్యర్థుల పన్నాగాలు పసిగడుతూ, ఎదురు ఎత్తులువేసే వహీద్ తనకు కుడిభుజం. వహీద్‌కు పరిస్తాన్ ప్రభుత్వపు పెద్ద అధికారుల్లో విపరీతమైన పలుకుబడివుంది. అందువల్లే తమ ఆటలు సాగుతున్నాయి.

మరోగ్లాసు విస్కీ పుచ్చుకొన్నాడు. లేచి వెళ్ళి మూల నున్న టెలిఫోన్ రిసీవరు పైకెత్తి నెంబరు డయల్ చేశాడు.

"వహీద్ స్పీకింగ్!" అవతలవేపునుండి వినొచ్చింది.

"కపూర్ హియర్! ఏదైనా క్రొత్త బలగం దిగిందా?" అడిగాడు.

"తెలీలేదు బాస్! ఇండియానుండి వచ్చే విమానాల్లో దిగిన పాసింజర్ల లిస్టులు తెప్పించాను. అందులో ఇద్దరిపేర్లు మాత్రం అనుమానాస్పదంగా కనుపిస్తున్నాయి. వాళ్ళు హోటల్ అల్మండ్‌లో దిగారు."

"రూం నెంబరెంత?"

"మూడొందలా మూడు బాస్!"

"వాళ్ళ సంగతి నా కొదిలెయ్యి."

"అలాగే బాస్! బేగం జరీనా సంగతి ఏంచేద్దాం. ఆమెను సఫాచేయించటం మంచిదనిపిస్తుంది" అన్నాడు వహీద్.

"వద్దు! ఆమెద్వారా మనం క్రొత్త ఏజంట్లు రంగంలో దిగితే పట్టుకోవచ్చు. ఆమెజోలికి పోవద్దు!" అన్నాడు.

జరీనా బేగం, అంతకుముందు హత్యకాబడ్డ ఇండియన్ ఏజంట్ సునీల్‌ని ప్రేమించింది. సునీల్ కూడా ఆమెను ప్రేమించాడు. ఆమె పేరుపయోగించే అతన్ని ఊరవతలికి రప్పించి, అక్కడ హత్యచేశాడు వహీద్.

"అయితే నన్నేం చెయ్యమంటారు?"

"నేను మళ్ళీ ఫోన్ చేసిందాకా ఇంట్లోనే వుండు. రెండు మూడు పనులున్నాయి చక్క పెట్టుకొని వస్తాను" అంటూ ఫోన్ కట్ చేశాడు.

సీసాలోవున్న మిగిలిన విస్కీ తీసుకొని, ఒక్కసారిగా గొంతులో పోసుకున్నాడు. బాటిల్ విసిరి డస్ట్‌బిన్‌లో కొట్టి, మేడ దిగి క్రిందికొచ్చాడు. క్రింద పార్కింగ్‌లో వున్న పాంటియాక్ కారెక్కి, స్టార్ట్ చేశాడు.

కారు నగరంలోని రోడ్లను దూసుకుంటూ వెళ్ళసాగింది. అరగంట తర్వాత ఊరుదాటింది. నాలుగుమైళ్ళు పోయాక పడిపు త్రిప్పాడు. కొంతదూరం గతుకుల్లోపడి పోయింది. తర్వాత ఒక పాడుబడ్డ బంగళాముందు ఆగింది.

కారును చూస్తూనే, వాచ్‌మెన్ తలుపులు తెరచి విష్ చేశాడు.

వాల్టర్ కారును లోనికి పోనిచ్చాడు. పోర్టికోలో కారా పాడు. దిగి లోనికెళ్ళాడు. అక్కడో నలుగురు సాయుధులైన వ్యక్తులున్నారు.

"సబ్ ఠీక్ హై!" అడిగాడు వాల్టర్.

"ఠీక్ హై సాబ్!" చెప్పారు వాళ్ళు.

మెట్లుదిగి భూగర్భంలోవున్న గదిలోకి వెళ్ళాడు.

పక్క మంచంపైన కూర్చునివున్న డోగ్రే, వాల్టర్‌ను చూడగానే తల త్రిప్పుకున్నాడు.

"మార్నింగ్ ప్రొఫెసర్!" అన్నాడు వాల్టర్.

డోగ్రే మౌనంగా వుండిపోయాడు.

"నిన్ను రక్షించాలని వచ్చిన ఇద్దరు ఏజంట్లు నా చేతుల్లో హతమైపోయారు. నిన్ను రక్షించడం ఎవ్వరి తరంగాదు. నువ్వు సాధించిన ఫార్ములా మాకు చెప్పు. కోటి రూపాయలు ఖరీదుచేసే బంగారమిస్తాను. నిన్ను వెంటనే మీదేశం పంపు

తాను" అన్నాడు వాల్టర్.

"ఈ బొందెలో ప్రాణంవుండగా అది జరగదు. చచ్చేందుకైనా సిద్ధమే!" అన్నాడు.

"నిన్ను మామూలుగా చావనివ్వను. చిత్రహింస పెడతాను. చర్మం చెక్కిస్తాను. ఒక్కొక్క కండ వొలిపిస్తాను. ఒక్కొక్క ఎముక ఊడగొడతాను. ఆ బాధను తట్టుకోలేక నువ్వే నిజం చెబుతావు" అన్నాడు వాల్టర్.

డోగ్రే ఏమీ మాట్లాడలేదు.

"నిన్ను రెండు దినాల్లో ఇక్కడినుండి మరో దేశానికి తరలించే ఏర్పాట్లు చేస్తాను. అక్కడే మావాళ్ళు నీ అంతు కనుక్కుంటారు. ప్రయాణానికి సిద్ధంగావుండు. ఆ విషయం చెప్పేందుకే వచ్చాను" అన్నాడు వాల్టర్.

డోగ్రే మాట్లాడకుండా మంచంపైన కూలబడ్డాడు.

వాల్టర్ వెనక్కి తిరిగి వచ్చేసి, తను చేసిన సెక్యూరిటీ ఏర్పాట్లన్నింటినీ అక్కడున్న కాపలావాళ్ళతో కొంతసేపు తర్కించాడు.

అంతా సవ్యంగా వుందని నిర్ధారణ చేసుకొన్నాక, బయలుదేరాడు కారులో వెనక్కి.

## 4

వాల్టర్ కార్ను సుల్తాన్ రోడ్ లోకి తిప్పాడు. ఆరో నెంబరు ఇంటిముందు కారాపాడు. లోపల కూర్చునే రెండు వేపులా చూశాడు.

ఆరో నెంబరు ఇల్లు చిన్నదే. జరీనా అందులోనే వుంటుంది. ఆ యింటికెదురుగా రోడ్ కు అవతల చిన్నహోటలుంది.

జరీనా ఇంటికేసి ఎవ్వరూ చూడడంలేదన్న నమ్మకం కుదిరాక కారులోంచి దిగాడు,

తిన్నగా వెళ్ళి తలుపుతట్టాడు.

"ఎవరది?" లోపలనుండి ఆడగొంతు వినిపించింది.

"నేను. నీకు హితుణ్ణి. మేలుగోరేవాణ్ణి. తలుపుతీ" అన్నాడు వాల్టర్.

"తియ్యను. నువ్వెళ్ళిపో!" అంది జరీనా.

"అలాకాదు! నువ్వు పెద్ద ఆపదలో వున్నావు. నీ ప్రాణాలు తీసేందుకు కొందరు దుర్మార్గులు సిద్ధంగావున్నారు. వాళ్ళనుండి కాపాడకంకోసం వచ్చాను. తలుపు తీ!"

"నువ్వు పోలీసువా?"

"ఆఁ!"

"నాకు నమ్మకమేమిటి?"

"నీదగ్గరేదైనా రివాల్వరుగానీ, కత్తిగానీ వుందా?"

"కత్తివుంది."

"దాన్ని చేత్తో పట్టుకుని తలుపుతీ. నేను రెండుచేతులు పైకెత్తి పట్టుకుంటాను. నీకు అనుమానం రాగానే కత్తితో నన్ను పొడవచ్చు."

"నేను ఆడదాన్ని. నిన్ను పొడిచేలోపల నువ్వే నన్ను పొడుస్తావ్."

"అలాంటిదేమీ జరుగదు. నన్ను నమ్ము. తలుపు తీ. ఇలా వీధిలో నిలబెట్టి ఒక పోలీసాఫీసరుతో మాట్లాడడం మర్యాదగాదు" అన్నాడు వాల్టర్.

జరీనా తలుపులు తెరచింది.

వాల్టర్ లోనికొచ్చాడు. దూరంగావున్న సోఫాలో వెళ్ళి కూర్చుంది. గుమ్మంప్రక్కనేవున్న సోఫా చూపించింది వాల్టర్‌ను కూర్చోమని.

ఆమె అందంచూచి ఆతనికి మతిపోయింది.

గుండ్రటి మొఖం, విశాలమైన కళ్ళు, పొడవైనముక్కు, చిన్ననోరు, ఎర్రని పెదాలు, గుండ్రటి మెడ, నల్లటి చీర

వెనుకనుంచి తెల్లటి ఆమె శరీరం మిలమిల మెరసిపోతోంది. ఆమె సన్నటి శరీరానికి వుండవలసిన ప్రమాణంకన్నా కాస్త పెద్దవిగానే వున్న రొమ్ములు.

ఆమెని చూడగానే వాల్టర్‌కు, వొళ్ళు వేడెక్కింది. అయినా తమాయించుకున్నాడు.

"సునీల్ కుమార్‌ను నువ్వు ప్రేమించావా?"

"ఆఁ!"

"అతను చనిపోయాడుగదూ!"

"లేదు! ఎవరో హత్య చేశారు."

"ఎవరో నీకు తెలుసా?"

"తెలీదు!"

"తెలుసుకోలేవు. నేను చెపుతాను విను. అతను గూఢచారి. ఇండియన్ గవర్నమెంటు తరఫున పనిచేస్తున్నాడు. అతని ప్రత్యర్థులు మరోదేశపు గూఢచారులు అతన్ని మట్టుపెట్టారు. వాళ్ళు శత్రుశేషం వుంచుకోవడం ఇష్టంలేదన్నట్లు సునీల్ కుమార్‌తో స్నేహంగావుండిన మరో ఇద్దర్ని గూడా చంపారు. ఇది మా నోటీసుకొచ్చింది. అప్పుడే నీ విషయం తెలిసింది. ఆ హంతకులు నిన్ను చంపేందుకు కూడావస్తారు. జాగ్రత్తగా వుండమని హెచ్చరించిపోదామని వచ్చాను" అన్నాడు వాల్టర్.

"అలాగా! సారీ! మిమ్మల్ని, నన్ను చంపేందుకు వచ్చిన విరోధికూటమి వాళ్ళేమోనని భయపడిపోయాను" అంది.

"ఆ పరిస్థితుల్లో ఎవరైనా అలాగే అనుకుంటారు. డోంట్ వర్రీ."

"అయితే నన్నేం చెయ్యమంటారు."

"నీకోసం, బహుశా' ఇవాళో, రేపో ఆ హంతకులు రావచ్చు. నీతో మాట్లాడాలంటారు. నువ్వు వాళ్ళకు అవకాశం యివ్వవద్దు. అర్జంటుపనిమీద వున్నానని, ఆ తర్వాత

ఫోన్ చేసి అపాయింట్ మెంట్ ఫిక్స్ చేస్తానని చెప్పా. ఈలోగా నేను రెండుగంటలకొకసారి ఫోన్ చేస్తాను. మనిద్దరం మాట్లాడుకొన్నాక అపాయింట్ మెంట్ ఇవ్వు. వాళ్లు వచ్చేందుకు ముందుగానే ఇద్దరు పోలీసుల్ని ఇక్కడకు పంపుతాను. ఆ దుర్మార్గుల్ని రాగానే అరెస్టుచేసి తీసుకుపోతారు. ఓ. కే!" అడిగాడు వాల్టర్, తన తెలివితేటలకు తనే మురిసిపోతూ.

"అలాగే చేస్తాను. నాకోసం మీరింత శ్రమపడుతున్నందుకు చాలా థాంక్స్!" అంది జరీనా.

"వస్తాను" అంటూ లేచాడు వాల్టర్.

జరీనా కూడా లేచివెళ్ళి మెట్లదాకా సాగనంపింది. వీధిలోవున్న కారుకేసి చూసింది. అది పోలీసుకారులా లేదు. మామూలుగా అందరూ వాడుకునే కారులా తోచింది. ఒకవేళ మారువేషంలో తిరుగుతున్నాదేమోలేనని సర్దిచెప్పుకుంది జరీనా.

లోనికివెళ్ళి తలుపులు మూసుకుంది.

## 5

కాంత్ టాక్సీ దిగాడు.

అంతకుముందే కదలిపోయిన వాల్టర్ కారును అతను గమనించలేదు. మాల్వి ఇచ్చిన కాగితాల్ని చదువుకుంటూ కూర్చోవడంతో అతనికి ఎక్కడికి వచ్చిందికూడా అర్థంగాలేదు.

"ఆగయా సాబ్!" అన్నాడు డ్రైవరు వెనక్కితిరిగి.

కాంత్ కాగితాల్ని మడిచి లోపల పెట్టుకొని కారు దిగాడు. తిన్నగా ఆరో నెంబరు ఇంట్లోకి అడుగుపెట్టి బజర్ నొక్కాడు.

"ఎవరది? అంది జరీనా లోపల్నుండి.

''నేనే!'' అన్నాడు కాంత్ రక్కన.

''ఇప్పుడేగా వెళ్ళారు! అప్పుడే వచ్చారేం? ఏదైనా మరచిపోయారా?'' అడిగింది జరీనా.

''ఆఁ!'' అన్నాడు ఎలాగైనా ఆమెచేత తలుపు తీయించాలన్న వుద్దేశంతో.

జరీనా తలుపు తెరచింది. ఎదురుగుండా కనుపించిన క్రొత్తవ్యక్తిని చూచి బిక్కచచ్చిపోయింది. రక్కన తలుపు మూయ్యబోయింది.

ఆమె అలా చేస్తుందని ముందే ఊహించిన కాంత్ కుడి కాలు గుమ్మం అవతల పెట్టాడు. దాంతో తలుపు సగంలోనే ఆగిపోయింది. జరీనా శక్తంతా ఉపయోగించింది తలుపు మూసేందుకు. కానీ కాంత్ కాలు అదిమిపెట్టి, రెండో కాలు గూడా లోనికి తీసుకున్నాడు. ఆమెను దూరంగా నెట్టాడు.

జరీనా వెళ్ళి సోఫాలో పడింది.

కాంత్ తలుపులు మూశాడు.

''నన్ను చంపొద్దు! నాకేమీ తెలీదు'' అంది జరీనా భయపడిపోతూ.

''కూర్చో! నిన్ను చంపేందుకు రాలేదు నేను. ఎవ్వరూ చంపకుండా కాపాడేందుకు వచ్చాను'' అన్నాడు కాంత్ కుర్చీలో కూర్చుంటూ.

''అబద్ధం! ఇంతకుముందే పోలీసుఆఫీసరు వచ్చిపోయాడు. అతను చెప్పినట్లే నువ్వు వచ్చావ్. వెళ్ళు! ప్లీజ్!'' అంది జరీనా.

''నేను నీకు హితుణ్ణి. నన్ను నమ్ము. నువ్వు ప్రేమించిన సునీల్ కుమార్‌తోపాటు పనిచేసే ఇండియన్ ఏంజటుని. అతన్ని చంపినవాళ్ళను చంపేందుకు వచ్చాను. నాకు నీ సాయం కావాలి'' అన్నాడు కాంత్.

''ఇప్పుడు నేనేమీ మాట్లాడలేను. నాకు త్వరగా వెలు

పలికి పోవాల్సిన పనివుంది. మీ ఫోన్ నెంబర్ యివ్వండి. నా వీలు చూచుకుని మీకు ఫోన్ చేస్తాను. అప్పుడురండి" అంది జరీనా.

"ఐదు నిముషాలు మాట్లాడు చాలు. నా ప్రశ్నలకు సమాధానం చెప్పు."

"లాభంలేదు. నేను వెళ్ళాలి!"

"నిన్ను వెళ్ళనివ్వను. నా ప్రశ్నలకు జవాబులు చెప్పి తీరాలి."

"వీల్లేదు. నే వెళ్ళాలి!" అంది జరీనా మొండిగా.

కాంత్ రివాల్వరు తీసి భయపెడదామని జేబులో చెయ్యి పెట్టాడు. జరీనా మనిషి మొత్తం వణికిపోవడం గమనించాడు. తన ప్రయత్నం మానుకున్నాడు.

ఆమెకు తను ఆమె హితుడన్న నమ్మకం కలిగించడం అవసరమన్న ఆవశ్యకత అర్థమైంది.

"ఆల్ రైట్! నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి. రూం నెంబరు మూడొందలామూడు. హోటల్ ఆల్మండ్. మిస్టర్ కాంత్ కావాలని అడుగు. ఒక్కటిమాత్రం గుర్తుంచుకో. నేను మళ్ళీ నిన్ను కలుసుకొనేలోపల నీకు ప్రమాదం సంభవించే అవకాశముంది" అన్నాడు కాంత్.

"నాకేం భయంలేదు. నా ఫోన్ కోసం ఎదురుచూడండి. అప్పుడు మీకంతా వివరంగా చెపుతాను" అంది జరీనా.

"అలాగే! వస్తాను" అంటూ వెలుపలకు నడచాడు కాంత్.

టాక్సీ ఎక్కి హోటల్ ఆల్మండ్ కు పోనిమ్మని చెప్పాడు.

అతనికి జరీనా ప్రవర్తన కాస్త వింతగా తోచింది. ఆమె మాటల్నిబట్టి అంతకుముందే ఎవరో వచ్చి వెళ్ళినట్లు స్పష్టమైంది. తన ప్రత్యర్థులయివుండాలి బహుశా. వాళ్ళకు తెలుసు తను ఆమెను కలుసుకుంటాడని. తనకన్నా ముందా

మెను వాళ్ళు కలుసుకొని హోటల్లో మధ్య పెట్టి, తామే మెను రక్షించేవాళ్ళమని చెప్పకొనివుండాలి. తమకు ముందుగా సమాచారం అందజేసి, ఆ తర్వాత తనకోసం సునీల్ కుమార్ హత్యవిషయంలో వాకబు చెయ్యను వచ్చిన వాళ్ళను కలుసుకోమని చెప్పివుంటారు. అందుకే ఆమె తనను తర్వాత రమ్మంది.

అడబోయిన తీర్థ మెదురయినట్లు ఫీలయినాడు.ఆనందంతో ఈలవేశాడు కాంత్.

ఆల్మండ్ హోటల్ దగ్గర దిగి డబ్బిచ్చి టాక్సీని పంపేశాడు. రూంకు వెళ్ళాడు. జార్జి సుష్టుగాతిని, త్రాగి ప్రక్క మీద దొర్లుతున్నాడు.

"జార్జి! జార్జి!" పిలిచాడు.

"ఏమిటి?" అడిగాడు.

"లేచి డ్రెస్ చేసుకో!" అన్నాడు.

జార్జి చకచక బట్టలు మార్చుకున్నాడు. ఆరంగుళాల ఆటోమేటిక్ నైఫ్ జేబులో పెట్టుకున్నాడు.

"రెడీ బాస్!" అన్నాడు జార్జి.

"సుల్తాన్ రోడ్ లో 65 నెంబరు ఇంటికెదురుగా చిన్న హోటలుంది. నువ్వెళ్ళి అక్కడ కూర్చుని ఆ యింట్లోకి ఎవరెవరు పోయేది, ఎంతమంది పోయేది, పోయినవాళ్ళు వెలుపలికొచ్చేదీ, లేనిదీ, జాగ్రత్తగా కనిపెట్టుకునివుండు. నేను వచ్చి కలుసుకుంటాను తర్వాత" అన్నాడు కాంత్.

"అలాగే!" అంటూ జార్జి బయటికి వెళ్ళాడు.

# 6

ఫోన్ మ్రోగింది.

రిసీవరు తీసుకుంటూ గోడగడియారంకేసి చూసింది జరీనా. పన్నెండయింది.

"జరీనా!" అంది.

"నేను పోలీస్ ఆఫీసర్ను మాట్లాడుతున్నాను" అన్నాడు అవతలి వ్యక్తి.

"మీ కాల్ కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను. మీరు అటు వెళ్ళగానే వచ్చాడు ఆగంతకుడు. బలవంతంగా లోనికొచ్చాడు. చంపుతాడేమోనని భయపడ్డాను. అతన్ని తప్పించుకోవడం కష్టమైంది."

"ఏమైనా ప్రశ్నలడిగాడా?"

"అడగాలన్నాడు. నేనే జవాబు చెప్పనన్నాను తర్వాత ఫోన్ చేస్తానని చెప్పాను."

"వెల్ డన్! అయితే అతనికి ఫోన్ చేసి రెండింటికి రమ్మను. ఈలోగా ఇద్దరు పోలీసుల్ని పంపుతాను. అతన్నెలా అరెస్ట్ చెయ్యవలసిందీ వాళ్ళకి వివరించి చెబుతాను. నువ్వు వాళ్లు చెప్పినట్లు చెయ్యి చాలు" అన్నాడు ఆవ్యక్తి.

"అలాగే! మీరుగూడా రాకూడదూ!"

"ఇది చిన్న కేసు. నాకు వేరే అర్జంటు పనులున్నాయి. నీకేం భయంలేదు. నేను పంపే మనుషులు అంతా చూసుకుంటారు. ధైర్యంగా వుండు" అన్నాడతను.

"అలాగే!" అంది జరీనా.

అవతలివ్యక్తి ఫోన్ పెట్టేశాడు. జరీనాకూడా రిసీవరు క్రేడిల్ పైన పడేసింది.

సునీల్ కుమార్ గుర్తొచ్చాడు. అతను చాలామంచివాడు. అతనితో తన పరిచయం పట్టుమని పదిహేను రోజులన్నా లేదు. తనతన్ని పెళ్ళాడుదామనుకుంది.

తను ఇండియాలోనే పుట్టింది. అక్కడ తన బంధువులు చాలామంది వున్నారు. వాళ్ళందర్నీ అతనికి తెలుసు. ఎన్నో విషయాలు చెప్పేవాను. అతన్ని పెళ్లాడి, అతనితో

ఇండియాకు వెళ్ళిపోవాలనుకుంది.

కానీ తన పథకం తారుమారైంది. ఆ రాత్రి అతను తనతో పదింటిదాకా వున్నాడు. తనకు స్వర్గం చూపించాడు. ప్రొద్దున్నే వస్తానని చెప్పాడు. తెల్లారేసరికి అతని కారు ఎలక్ట్రిక్ పోల్‌ను గుద్దుకుందని, అతను చనిపోయాడని వార్తొచ్చింది.

అందరూ అది ఆక్సిడెంటనే అన్నారు. కానీ తను శవాన్ని చూచింది. నడుం క్రింద పిస్తోలు గుళ్ళు దూరిన గుర్తులున్నాయి. కారులో అతన్ని చంపి కూర్చోబెట్టి తర్వాత మరో కారుతో అతని కారును ఎలక్ట్రిక్ స్తంభం వైపు బలంగా మోదించారు. పోలీసులతో పోరాడింది. కానీ లాభం లేకపోయింది.

అతను భారతదేశపు గూఢచారనీ, మరేదో గూఢచారి ముఠా చేసిన హత్యయి వుంటుందనీ, గాంట్లో తాము మామూలుగా జోక్యం చేసుకోమని చెప్పారు పోలీసులు. సునీల్‌ను చంపిన వాళ్ళపై పగతీర్చుకునే అవకాశం కోసం ఎదురుచూస్తూ వుండిపోయింది.

బహుశా తను పోలీసులతో పోరాడిన విధానం వివరంగా సునీల్ హంతకులకు తెలిసి వుంటుంది. ప్రభుత్వంలోని కొందరు పెద్ద అధికారుల్ని తను కలుసుకుందామనుకోవడం కూడా వాళ్ళకు చూచాయగా గుర్తింపుకొచ్చి వుంటుంది. అందుకే తననోరు మూయ్యాలనీ, అందుకే చంపడం మినహా మరోమార్గం లేదన్న నిర్ణయానికొచ్చి, తెగించి ఇంటికొచ్చి వుంటారనిపించింది.

తనకై తనే వచ్చి సాయం చేసేందుకు సిద్ధమైన పోలీస్ ఆఫీసర్ను తలచుకోగానే ఆమెలో కృతజ్ఞత కట్టలు తెంచుకొంది.

ఫోన్ పైనున్న రిసీవరుతీసి హోటల్ ఆల్మండ్‌కు డయల్ చేసింది.

"హోటల్ అల్మండ్!" రిసెప్షనిస్టు కంఠం ఖంగుమంది.

"రూం నెంబరు మూడొందలామూడు" అంది జరీనా.

"యస్! రూం నెంబర్ త్రీనాట్ త్రీ" అవతలివేపునుండి వినిపించగానే "మిస్టర్ కాంత్ ప్లీజ్!" అంది జరీనా.

"స్పీకింగ్!"

"ఇందాక మీరు నా దగ్గరకొచ్చారు. నాపేరు జరీనా. మీరు సరిగ్గా రెండింటికల్లా రావాలి. ఆలస్యం చెయ్యొద్దు. మీతో పదినిముషాలకన్నా ఎక్కువ మాట్లాడటం వీలుపడదు. వచ్చేందుకు వీలవుతుందా?" అడిగింది.

"వస్తాను! మీ వాలకం చూస్తే నా గురించి లేనిపోని అపోహలు పెట్టుకొని నానుండి మిమ్మల్ని మీరు కాపాడుకునేందుకు చాలా జాగ్రత్తలు తీసుకొంటున్నట్లుగావుంది. మీకంత అనుమానంగానూ, భయంగానూ వుంటే నేను రానులెండి. సునీల్ హత్యగురించి కావలసిన వివరాలు కొన్ని నేను వేరేవాళ్ళద్వారా సేకరించాను" అన్నాడు కాంత్.

"నో! నో! అలాంటిదేమీ లేదు. చాలా బిజీగా వుండడంతో ప్రొద్దున్న మీతో మాట్లాడే వీలులేకపోయింది. దానికి మరోవిధంగా ఆలోచించకండి. రెండింటికల్లారండి. ఎదురుచూస్తుంటాను" అంది గోముగా.

జరీనాకు తను అతన్ని అరెస్టు చేయించేందుకు పోలీసుల్ని పిలిపిస్తున్నదన్న విషయం తెలిసిందేమోనన్న అనుమానం కలిగింది. ఎలాగైనా అతన్ని రప్పించాలన్న ధ్యేయంతో కాస్త మురిపెంగా మాట్లాడింది.

"ఆల్ రైట్! మీరంతగా చెప్తుంటే రాకుంటే ఎలా? వస్తాను. కావాలంటే ఇంకా ముందుగానే వస్తాను. నాకు వేరే పనులేమీ లేవు."

"రావచ్చనుకోండి. నేను రెండింటికిగాని ఇల్లుచేరను.

అందుకని మీరు రెండింటికల్లా రండి. చాలు!" అంది జరీనా.

"అలాగే!" అని ఫోన్ పెట్టేశాడు.

## 7

జార్జి వాచీకేసి చూసుకున్నాడు. పన్నెండయింది.

దాదాపు తను అక్కడకొచ్చి ఒకటిన్నర గంటయింది. ఆ రోడ్ అంతా అటు ఇటు తిరుగుతూ తచ్చాడుతున్నాడు. కాళ్ళు లాగడం మొదలెట్టాయి. ఎండ ఎక్కువగా వుండటంతో ఒళ్ళంతా చెమట పట్టింది. వచ్చి హోటల్లో కూర్చున్నాడు.

వెయిటర్ రాగానే బన్ బటర్ తెమ్మన్నాడు. తెచ్చాక మెల్లగా ఒక్కొక్క ముక్క నములుతూ ఎదురుగావున్న ఇంటికేసి చూస్తూ కూర్చున్నాడు. బన్ తినేందుకు అరగంట పట్టింది. టీ తెప్పించుకున్నాడు. మెల్లగా సిప్ చేస్తూ, ఎదురుగా చూస్తూ మరో అరగంట గడిపాడు.

హోటల్లోని జనం వస్తూ పోతూనే వున్నారు. వెయిటర్ తనకేసి వింతగా చూడసాగాడు.

'అరణాల బిల్లుకు ఆరుగంటలు కుర్చీవదలదేమిట్రా?' అనుకుంటున్నాదేమో వెధవ అనుకున్నాడు జార్జి.

అయినా తను లేచి పోదలచుకోలేదు. అక్కడ్నుంచి ఎదురుగావున్న ఇల్లు బాగా కనుపిస్తుంది. పైగా మండుటెండ.

టెలిఫోన్ బూతులో కెళ్ళి కొలీగ్ కు ఫోన్ చేసి అంతదాకా ఏవిధమైన అసక్తికరమైన సంఘటనలు జరగలేదని చెప్పాడు.,

కాంత్, తను రెండింటికల్లా వచ్చేస్తాననీ తన్ను అతను కలుసుకోనవసరంలేదనీ, తను వెళ్ళాక అక్కడేవుండి, తన కోసం వచ్చే వ్యక్తులు ఎక్కడి కెళ్ళేదీ తెలుసుకోమని చెప్పాడు.

జార్జి సరేనని ఫోన్ పెట్టేశాడు.

పొడవుగావున్న లావుపాటి వ్యక్తి ఒకతనువచ్చి జరీనా ఇంటిముందు నిలబడ్డాడు. అతని ముఖం భయంకరంగావుంది. హత్యలు చెయ్యడంలో ఆరితేరిన వ్యక్తిలా తోచింది జార్జికి.

అతను రోడ్డు కొసదాకావెళ్ళి తిరిగొచ్చాడు. అంతలో మరో పొట్టిగావున్న దుబ్బువ్యక్తి రోడ్ కి అవతలివేపునుండి వచ్చి పొడవుపాటి వ్యక్తిని కలుసుకున్నాడు.

ఇద్దరూ రెండుక్షణాలు ఏదో మాట్లాడుకున్నారు. ఆ తర్వాత ఇద్దరూ లోనికెళ్ళారు.

జార్జి ఇద్దర్నీ స్పష్టంగా చూశాడు. ఎంతమందిలోవున్నా తను వాళ్ళిద్దర్నీ సులభంగా గుర్తుపట్టగలననిపించింది.

జరీనా ఇంటి కిటికీకేసి దృష్టి సారించాడు. కర్టెన్ తప్పుకుంది. కిటికీ వెనకాల పొడవుపాటి వ్యక్తి కనుపించాడు. అంటే రోడ్డులో ఎవరన్నా తమను గమనిస్తున్నారేమో తెలుసుకోనేందుకే అతనలా చూస్తున్నాడని అర్థంచేసుకున్నాడు జార్జి.

ఆ పరిస్థితుల్లో తను వెలుపలకు వెళ్ళడం మంచిదిగాదనిపించింది.

వెయిటర్ వచ్చి "క్యా సాబ్! అవ్ ఇదర్ సే నైజాతే!" అడిగాడు విసుగ్గా.

"మా ఫ్రెండు వస్తానన్నాడు. ఇక్కడే కలుసుకుంటానన్నాడు. రెండుగంటలనుండీ వెయిట్ చేస్తున్నాను. ఇంకా రాలేదు. అతను రాగానే వెళ్తాను. మరో టీ పట్రా."

వెయిటర్ ఉషారుగా వెళ్ళిపోయాడు.

రెండు నిముషాల్లో టీకప్పు తెచ్చిపెట్టాడు. రూపాయి నోటుతీసి అతనికి అందించాడు. అతను చిల్లరతీసి ఇవ్వబోయాడు. వద్దని సైగచేశాడు. వెయిటర్ సెల్యూట్ కొట్టి సర్వ్ చేసేందుకు ప్రక్క టేబుల్ చుట్టూ అప్పుడేవచ్చి

కూర్చున్న వ్యక్తుల దగ్గరకు వెళ్ళిపోయాడు.

జార్జి టీ త్రాగి, సిగరెట్ వెలిగించుకొని టెలిఫోన్ బూత్‌లోకి వెళ్ళాడు. అల్మండ్ హోటల్ నెంబరు డయల్ చేసి కనెక్షను రాగానే రూం నెంబరు 'మూడొందల మూడు' అన్నాడు.

"కాంత్ హియర్!" అన్నాడు అవతలవేపునుండి.

"నేను బాస్! జార్జిని!"

"ఏమిటి విశేషాలు!"

"ఇద్దరు హంతక శిఖామణులు ఇప్పుడే వచ్చారు. కాసేపు తచ్చాడి తిన్నగా జరీనా ఇంట్లో దూరారు. మీ రెక్కలు విరగ్గొట్టేందుకు లోపల సిద్ధంగా కూర్చుని వున్నారు" అన్నాడు జార్జి.

"గుడ్! ఇంకెవరన్నా కొలుపల వెయిట్ చేస్తున్నారా?"

"లేదు బాస్! ఇంతవరకూ నాకు కనిపించలేదు" అన్నాడు జార్జి.

"ఓమారు నువ్వు రోడ్ చివరంటా రెండువైపులా చూడు. కారేదైనా పార్క్ చేసి అందులో కూర్చుని చూస్తున్నారేమో గమనించు. ఆ తర్వాత సరిగ్గా నువ్వు ఒకటి యాభై నిముషాలకు ఫోన్ చెయ్యి" అన్నాడు కాంత్.

"అలాగే బాస్! మీరు ఆ యింట్లోకి వెళ్ళడం అంత క్షేమంగాదు. నేనుగూడా వస్తాను మీ వెంట. లోపలిద్దరున్నారు. మనం ఇద్దరముంటే మంచిదేమో ఆలోచించండి" అన్నాడు జార్జి.

"అవసరంలేదు; నే చెప్పినట్లు చెయ్యి" అన్నాడు కాంత్. వెంటనే ఫోన్ కట్ అయింది.

జార్జికి కాంత్ అంటే అంగుకే గౌరవం. ప్రాణాలతో చెలగాటమాడే పనులన్నీ తనే నెత్తిన వేసుకుంటాడు. ప్రాణభయంలేని పనులే తన అనుచరులకు పురమాయిస్తాడు.

అంతకుముందు అతనితో ఐదారుసార్లు తను పని చేశాడు.

సీక్రెట్ ఏజంట్లందరిలోకి కాంత్‌కి మంచి పేరుంది. మృత్యువుతో చెక్కు చెదరని ధైర్యంతో పోరాడడం అతని హాబీ.

జార్జి హోటల్ వెలుపలికొచ్చి రోడ్ చివరిదాకా వెళ్లాడు. కారుగానీ, వ్యాన్ గానీ ఏదీ కనుపించలేదు. అక్కడ్నుంచి రెండో చివరకు నడిచాడు. అక్కడా ఏమీ కనుపించలేదు. చివరనున్న పబ్లిక్ బూత్ నుంచిఫోన్ చేసి చెప్పాడు కాంత్‌కు.

ఆ తర్వాతవచ్చి జరీనా యింటి కెదురుగావున్న హోటల్ నానుకునివున్న కిళ్ళీకొట్టు దగ్గర సిగరెట్ త్రాగుతూ నిలబడ్డాడు. అతని రెండోచెయ్యి ఆటోమేటిక్ నైఫ్ మీదుంది.

కాంత్ వెళ్ళాక పదినిముషాలు చూడదలచుకున్నాడు. ఆలోగా అతను వెలుపలికి రాకుంటే తను వెళ్ళి లోపలున్న ఇద్దర్నీ నరికి పోగులు పెట్టి రాదలచుకున్నాడు.

వాచీకేసిచూస్తూ కూర్చున్నాడు బెంచీమీద సిగరెట్ వడివడిగా దమ్ములాగుతూ.

# 8

తలుపు తట్టగానే ఒక్క ఉదుటున వచ్చి జరీనా తలుపు తీసింది.

లావుపాటి పొడవైన వ్యక్తి, అతని ప్రక్కనేవున్న పొట్టిగా వున్న గుబ్బుమనిషి ప్రత్యక్షమైనారు.

"ఎవరు మీరు?" అడిగింది జరీనా.

"పోలీసులం. మా ఆఫీసరు పంపారు."

"లోనికి రండి!" అంటూ దారితీసింది.

వాళ్ళ మొఖాలు చూడంగానే భయపడింది జరీనా. తను నగరంలో ఎంతోమంది పోలీసుల్ని నిత్యం చూస్తూనేవుంది. వీళ్ళ ముఖాల్లోవుండే క్రౌర్యం, కాఠిన్యం, వాళ్ళల్లో కను

పించలేదు. వీళ్ళను చూస్తే వాంతకుల్లాగాను, దొంగల్లాగాను వున్నట్లనిపించింది. ఒకవేళ స్పెషల్ పోలీసులేమో ననుకుంది.

గూఢచారిని పట్టుకునేందుకు వచ్చినవాళ్ళు కాబట్టి, కాస్త గట్టివాళ్ళుగా వుండాలని, తన్ను కలుసుకున్న ఆఫీసరు ఏరి ఏరి పంపాడేమోనని తన్నుతానే సమాధాన పరచుకుంది.

లోపలికి రాగానే పొడవుపాటి వ్యక్తి, గబగబ కర్టెన్ల వెనుక, బాత్ రూంలో, లెట్రిన్ లో, మిగిలిన గదుల్లో ఏమేమో వెతకసాగాడు. పొట్టిగావున్న దుబ్బుమనిషిమాత్రం హాల్లోనే నిలబడ్డాడు.

"ఏమిటతను వెతికేది?" అడిగింది జరీనా.

"మీకు తెలీకుండా ఎవరైనా విరోధులు ముందే లోనికి దూరారేమోనని చూస్తున్నాడు."

"అది అసంభవం! నన్నడిగితే చెప్పేదాన్నిగా" అంది జరీనా.

అంతలో ఆ పొడవు వ్యక్తి వచ్చేశాడు హాల్లోకి.

"మేడమ్ మా ఆఫీసరుగారు మీకంతా చెప్పారనుకుంటాను" అన్నాడు.

"ఆఁ!" అంది జరీనా.

"ఆ వచ్చేవాడు అసాధ్యుడు. అందులో శత్రుదేశపు గూఢచారి. వాళ్ళు హత్యలు చేసేందుకు, ప్రాణాలు తీసేందుకు, వెనుకాడరు. అతనితో తలపడి, కొట్టి, కట్టి, బంధించి అరెస్టు చెయ్యవచ్చు. కానీ దానివల్ల వీధంతా తెలిసిపోని అల్లరి అవుతుంది. జనం గుమిగూడుతారు. అది మా ఆఫీసరుకు ఇష్టంలేదు" అన్నాడు పొడవుపాటి వ్యక్తి.

"అయితే ఎలా అరెస్టు చేస్తారు!"

"ఇదిగో విస్కీ బాటిల్. దీంట్లో గార్డినాల్ టేబ్లెట్లు కరిగించాం. అతను రాగానే, అతనిముందు నువ్వు బాటిల్

ఓపెన్ చెయ్యి. అతనికా గ్లాసు ఇచ్చి, అతనికి అనుమానం రాకుండా నువ్వుగూడా త్రాగు. వెంటనే అతను స్పృహ తప్పిపోతాడు. మేము అతన్ని అరెస్టుచేసి తీసుకెళ్తాం'' అన్నాడతను.

''నేను త్రాగితే నాక్కూడా స్పృహపోతుందిగా?'' అడిగింది జరీనా.

''పోతుంది. మేము వెళ్ళిపోతాం. అరగంటలో నీకు మైకం వదులుతుంది. అంతకన్నా మరేం వుండదు''అన్నాడు.

''అతన్ని తీసుకెళ్ళేందుకు పోలీస్ వాన్ తీసుకొచ్చారా?'' అడిగింది జరీనా_ తనకు అలాంటిదేమీ కధలో కనిపించక పోవడంతో.

''దాన్ని తెచ్చి ఇంటిముందు పెడితే వచ్చేవ్యక్తి దాన్ని చూసి తనకోసం వలవిసిరి వుంచారని తెలుసుకొని లోనికి రాకుండానే వెళ్ళిపోతాడు. అందుకని తేలేదు. అతనికి స్పృహపోగానే ఆఫీస్ కి ఫోన్ చేస్తాం. పదినిముషాల్లోవాన్ వస్తుంది. అతన్ని అందులో వేసుకునిపోతాం'' అన్నాడు పొట్టిగావున్న దుబ్బుమనిషి.

''అవును అదీ నిజమే! ఆ బాటిల్ ఇలా తే!'' అంది. అతను బాటిల్ అందించాడు. తీసుకొని టీపాయ్ పైన పెట్టింది.

''నేను బాత్ రూంలో దాక్కుంటాను. అతను అదిగో ఆ రూం కర్టెన్ వెనకాతల వుంటాడు.నీకేంభయం వుండదు. చెప్పిందిమాత్రం మరచిపోవద్దు'' అన్నాడు పొడవుగా వున్న మనిషి.

''ఆల్ రైట్! మీరు మీ మీ స్థానాలకు వెళ్ళిపొండి. గంట రెండవుతోంది. అతను వచ్చేస్తాడు ఏ క్షణంలో నయినా'' అంది జరీనా. వాళ్ళిద్దరూ దాక్కునేందుకు వెళ్ళి పోయారు.

జరీనా బయటకు, లోపలకు తిరగసాగింది. తలుపులు దగ్గరగా వేసి పెట్టింది. టీపాయిపైన విస్కీసీసా పెట్టింది. దానిప్రక్కన రెండుగ్లాసులుగూడా పెట్టింది.

అతను రాగానే ఎలా మాట్లాడాలో, అతను త్రాగనంటే ఎలాంటి మాటలుచెప్పి, అతనిచేత తాగించాలో ఆలోచించుకుంటూ కూర్చుంది.

బయట ఏదో కారాగిన శబ్దమైంది. ఇంజెన్ మాత్రం రొద పెడుతూనేవుంది. పిజిన్ హోల్ గుండా చూసింది. అతనే! ప్రొద్దున్న వచ్చిన వ్యక్తే స్టీరింగు దగ్గరున్నాడు. క్రిందికి దిగాడు. తలుపుని తెరచే వుంచాడు.

ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం. తెల్లటి సూట్ లో వున్నాడు. నల్లటి గాగుల్స్ పెట్టుకున్నాడు. మంచి అందగాడే ననుకుంది.

కాంత్ కారు దిగి జరీనా ఇంటిముందు నిలబడ్డాడు.

మెల్లగా జేబులోవున్న 'వెస్సన్' రివాల్వరుతీసి చేతిలో పెట్టుకున్నాడు. రోడ్ ను కలయచూశాడు. నిర్మానుష్యంగా వుంది. ఎదురుగావున్న హోటల్ లోమాత్రం నలుగు రైదుగురు మనుషులున్నారు.

చటుక్కున వెనక్కి తిరిగి తలుపు తట్టాడు.

ఒక్కక్షణం తర్వాత జరీనా తలుపు తెరచింది. ఒక చెయ్యి బైటపెట్టి, తల వెలుపలకువంచి తొంగిచూసి నవ్వింది.

వెలుపల తలుపుపైన పెట్టిన చెయ్యిని తన ఎడంచేత్తో పట్టుకొని కుడిచేతిలోవున్న రివాల్వర్ ను ఆమె గుండెలకానించాడు. నల్లటి రివాల్వరు చల్లగా ఆమె ఎడం రొమ్ముకు తగలగానే బిక్కచచ్చిపోయింది.

"అరిస్తే కాలుస్తాను! రా!" అంటూ వెలుపలకు లాగాడు.

ఆమె తలుపు ఇవతలవేపు పడగానే, తలుపుమూసి గొళ్ళెం బిగించాడు. ఆమెను లాక్కుపోయి తెరచి వుంచిన

తలుపుద్వారా కారు ముందు సీట్లోకి స్టీరింగు వీలు ప్రక్క నుండి తోసి, తను ఒక్క గెంతులో ఎక్కి కూర్చున్నాడు. ఇంజన్ ఆడుతూనే వుంది.

తలుపు మూసుకుని, ఆక్సిలేటర్ నొక్కాడు. కారు ఎగిరి దూకింది. చకచక గేర్లుమార్చి, ఆక్సిలేటరు పూర్తిగా తొక్క గానే అరవై మైళ్ళ స్పీడందుకుంది. కన్నుమూసి తెరచేలోగా కారు ఆల్మండ్ హోటల్ చేరుకుంది.

"నీకేం భయంలేదు. నన్ను చంపించేందుకు నువ్వు సిద్ధం చేసిన పథకం నాకు తెలీదనుకున్నావా. నన్ను చంపేందు కొచ్చిన ఇద్దర్నీ చంపడం నాకు కష్టంగాదు. కానీ నీ ఇంట్లో పెద్ద సీను సృష్టించడం ఇష్టంలేదు. నిన్ను రక్షించడం నా కర్తవ్యం. అందుకే ఇలా బలవంతంగా లాక్కొచ్చాను. నా రూంకు రా. అన్నీ నీకు వివరించి చెబుతాను" అన్నాడు కాంత్.

జరీనా తనుతిన్న షాక్ నుంచి తేరుకోలేదు. కాంత్ ను ప్రతిఘటించడం ఇష్టంలేదు. తాము తెలివిగా తయారుచేసిన పథకాన్ని వమ్ముచేసిన మనిషి, తన్ను చంపడం పెద్ద విచిత్రంగాదన్న నమ్మకం కలిగిందామెకు. అందుకే నోరు మెదపక అతనివెంట ఎలివేటర్ ఎక్కి రూంకు వెళ్ళింది.

## 9

జార్జి కారువచ్చిన అలికిడికాగానే తలెత్తి చూశాడు. స్టీరింగుముందు కూర్చున్న కాంత్ కనుపించాడు. హుషారుగా లోలోపలే ఈలవేసుకున్నాడు.

కారు తిన్నగా రోడ్ చివరంటవెళ్ళి టర్నయి తిరిగివచ్చి జరీనా ఇంటి ముందాగింది.

ఇంజన్ ఆఫ్ చెయ్యకుండా ఫ్రంట్ డోర్ తెరచివుంచి పోతున్నప్పుడే బాస్ ఏదో పెద్ద పథకం వేశాడనుకున్నాడు

జార్జి. కన్నుమూసి తెరచేలోగా జరీనాతో సహా కారెక్కి దూసుకుపోయాడు కాంత్.

"హేట్స్ ఆఫ్ టు యువర్ బ్లిస్నెస్!" అనుకున్నాడు పెద్దగా పైకి.

తనకు ఫోన్లో చెప్పిన పని గుర్తొచ్చింది. తన పని ఇంక ప్రారంభమవుతుంది. జరీనా ఇంట్లోవున్న వెధవల్ని తను అనుసరించి వెళ్ళాలి. వాళ్ళు ఎక్కడికి పోతారో తెలుసుకోవాలి. సిద్ధంగా కాచుకుని వున్నాడు.

పదినిముషాల తర్వాత ఒకతలుపు విరిగి వెలుపలకు పడటం గమనించాడు జార్జి. లావుపాటి పొడివు మనిషి ముందు దూకాడు. అతని అనుచరుడు వెనకదిగాడు. ఇద్దరూ రోడ్ కేసి అటూ ఇటూ చూసి తిన్నగా రోడ్ దాటి హోటల్ లోకి వెళ్ళారు.

జార్జి కదలకుండా కిళ్ళీకొట్టు దగ్గరే కూర్చున్నాడు. తను కూడా లోనికి వెళ్దామనుకున్నాడు. ఒకవేళ వెయిటర్ గుర్తించి మీ ఫ్రెండు ఇంకా రాలేదని అడిగితే ఆ ఇద్దరూ తన్ను అనుమానించవచ్చన్న భయంతో లోనికివెళ్ళే ప్రయత్నం మానుకున్నాడు.

ఏంచేస్తున్నారో చూడాలన్న ఆతృత కలిగింది జార్జికి. హోటల్ వైపు చూస్తూ దాటిపోయాడు. పొట్టివాడు కూర్చుని టీ త్రాగుతున్నాడు. పొడవుపాటి మనిషి బహుశా ఇక్కడ జరిగిన విచిత్రం ఫోన్ లో తన బాస్ కు చెప్తున్నాడేమో ననుకున్నాడు. మళ్ళా వెనక్కి రాకుండా ఇంకొంత ముందుకు పోయి నిలబడ్డాడు జార్జి. వీళ్ళిద్దర్నీ ఎలాగైనా తన కత్తితో చంపేందుకు నిర్ణయించుకున్నాడు.

రెండు నిముషాల తర్వాత ఇద్దరూ తనవైపే రావడం గమనించాడు.

తన్ను అనుమానించారేమో ననుకుని చెయ్యి పాంట్

జేబులో పెట్టి కత్తి పిడి పట్టుకొని, బొటనవేలుని బటన్ పైన పెట్టాడు, వాళ్ళతో తలపడేందుకు సిద్ధంగా.

ఇద్దరూ ఏదో మాట్లాడుకుంటూ జార్జినిదాటి ముందుకు వెళ్ళిపోయారు.

జార్జి కూడా దూరంగా వాళ్ళను అనుసరించాడు. రోడ్ చివర్న టాక్సీ ఆపి ఎక్కారు ఇద్దరూ. గబగబ నెంబరు మనసులో నోట్ చేసుకున్నాడు. ముందు టాక్సీ కదిలివెళ్ళింది. వెనుక మరో కారొచ్చింది. అది రివ్వున దూసుకుపోయింది. దానివెనుక టాక్సీ వచ్చింది. ఖాళీగాకూడా వుంది. ఆపాడు జార్జి. టాక్సీ ఆగింది. ఎక్కి కూర్చున్నాడు.

"సార్! ఇంటికి అన్నానికి పోతున్నాను సార్" అన్నాడు తను రాలేనన్నట్లు.

"చాలా అర్జంటు. ఇద్దరు దొంగలు ముందు టాక్సీలో పోతున్నారు వాళ్ళను పట్టుకోవాలి. నీకు ఫేర్ పైన మరో పదిరూపాయలిస్తాను. పద. క్విక్!" అన్నాడు.

పదిరూపాయల మాట వినగానే టాక్సీ కదిలించాడు డ్రైవరు. రివ్వున దూసుకు పోయింది. తనకు కావలసిన టాక్సీ నెంబరు చెప్పాడు జార్జి.

రకరకాల రోడ్లు చుట్టుకొంటూ టాక్సీలు రెండూ రింగ్ రోడ్ లో దూరాయి.

ముందున్న టాక్సీ ఒక పుస్తకాల షాపు ముందాగింది. దానికి కొంత దూరంలో జార్జి టాక్సీని ఆపమని డబ్బిచ్చి పంపేశాడు.

ఆగంతకు లిద్దరూ టాక్సీదిగి షాపులోకి వెళ్ళారు.

# 10

జార్జి పుస్తకాల షాపుదాకా నడచి వెళ్ళాడు. షాపులో కొంతమంది జనం వున్నారు.

జార్జి గూడా లోనికి దూరాడు. రాక్సులోవున్న పుస్తకాలను పరిశీలిస్తూ చూడసాగాడు. రెండు పుస్తకాలు తీసుకుని కౌంటర్ దగ్గర కొచ్చాడు. ఆ ఇద్దరూ లోపల కనుపడలేదు. అంటే ఏదైనా రహస్య మార్గం వుండివుండాలనుకున్నాడు.

డబ్బులిచ్చి "ఫోన్ చెయ్యాలి" అన్నాడు.

"బాస్ మాట్లాడుతున్నట్లున్నారు. ఐదునిముషాలాగండి" అన్నాడు అతను.

"మీ బాస్ మేడమీదుంటారా?" అడిగాడు.

"లేదండీ! ఆ రాక్సు మధ్యనుంచిపోతే వెనుక చిన్న రూం వుంది. ఆయన అక్కడే వుంటారు" అన్నాడు చిల్లర తిరిగి ఇచ్చేస్తూ.

మరో రెండు నిముషాలాగాడు.

"మీ బాస్ మాట్లాడటమయిందా?" అడిగాడు జార్జి.

కౌంటర్లో వున్న వ్యక్తి ఇన్స్ట్రుమెంటుకేసి చూసి "లేదండీ! ఇంకా మాట్లాడుతూనే వున్నారు" అన్నాడు.

"ఆల్ రైట్! నేను మరో చోటినుండి ఫోన్ చేసుకుంటాలెండి. థాంక్స్!" అంటూ వెలుపల పడ్డాడు.

షాపు కెదురుగా పార్క్ చేసిన ఫియట్ కారు చూశాడు. దాని నెంబరు తనుకొన్న పుస్తకంపైన రాసుకున్నాడు. ఆ కారు వాళ్ళదే అయివుండాలనిపించింది.

ఐదునిముషాల తర్వాత కారు బయలుదేరింది. జార్జి గూడా ఒక టాక్సీ మాట్లాడుకుని ముందుకుపోతున్న కారుని అనుసరించసాగాడు.

ముందున్న కార్లో ప్రస్తుతం ముగ్గురు వ్యక్తులున్నారు. క్రొత్తగా చేరిన వ్యక్తి డ్రైవ్ చేస్తున్నాడు. కారును అనుసరించి వందగజాల వెనుకగా జార్జి ఎక్కిన టాక్సీ మెల్లగా పోసాగింది.

ముందున్న వాళ్ళు తమ స్థావరానికి పోతుండాలనిపించింది

జార్జికి. దాన్ని తను గుర్తుపట్టి వెంటనే కాంత్‌కు తెలిపితే, యుద్ధం ప్రారంభించవచ్చు ననుకున్నాడు జార్జి. ప్రయోజనకరమైన పని తనుగూడా చెయ్యగలిగినందుకు సంతోషంగా వుందతనికి.

రెండు వాహనాలు ఊరుదాటాయి. మరో ఐదుమైళ్ళు పోయాయి. కారాగిపోయింది. టాక్సీనిగూడా ఆపేశాడు. ముందున్న కారు రివ్వుమంటూ వెనక్కి వచ్చింది. జార్జి తను ఏం చెయ్యాలో నిర్ణయించుకోనే లోగానే కార్లో వున్న వ్యక్తులు టాక్సీ ముందు టైర్లని రెండింటిని పేల్చి పారేశారు.

జార్జి టాక్సీ తలుపుతీసి దిగబోయాడు. తుపాకీ గుండురివ్వుమని దూసుకుపోయింది. తలుపు మూసుకొని కూర్చున్నాడు.

డ్రైవరు ఏడుపు ముఖం పెట్టాడు.

కార్లోంచి ముగ్గురూదిగి రోడ్డున పడ్డారు. ముగ్గురి చేతుల్లో రివాల్వర్లు నిప్పులు కక్కేందుకు సిద్ధంగా వున్నాయి.

"ఏమిటి సార్ ఇదంతా!" అడిగాడు డ్రైవరు.

"యుద్ధం!"

"టాక్సీ కావాలని ఫోన్ చేస్తే వచ్చాను సార్! ఈ గందరగోళం నాకు తెలీలేదు!" అన్నాడు డ్రైవరు.

"ఫోన్ చేశారా? ఎవరు?"

"ఏమో సార్! 'వెంటనే పరిస్తాన్ బుక్ కంపెనీ ముందుకు టాక్సీ పంపండి' అని చెప్పి టాక్సీ నెంబరుగూడా చెప్పించుకున్నారు సార్ ఫోన్లో."

"మరి నువ్వు అక్కడ నన్నడగలేదే?"

"మీరు హడావిడిలో వున్నారు. మీరే ఫోన్ చేశారనుకున్నాను."

ప్రత్యర్థులు తెలివిగా తన్ను బంధించారనుకున్నాడు జార్జి. తనదగ్గర రివాల్వరులేదు. పైగా ఒంటరిగాడు. వాళ్లు ముగ్గురు. వాళ్ళతో తలపడడం ప్రాణాలు తీసుకోవడమేతప్ప ప్రయో

జనం లేదనిపించింది. తను ఎటు వెళ్ళిందీ కాంత్‌కు చెప్ప లేకపోతున్నానన్న బాధ ఎక్కువైంది.

మరోనిముషంలో ముగ్గురూ టాక్సీని చుట్టుముట్టారు.

జార్జి క్రిందకు దిగాడు. డ్రైవరునికూడా దిగమన్నారు. అతనుకూడా దిగాడు.

జార్జి జేబులోవున్న కత్తి తీసేసుకున్నారు. ఇద్దర్నీ నడిపించుకు వెళ్ళారు ముందు కారుదగ్గరకు. వెనుక సీట్లో ఇద్దర్నీ మధ్య కూర్చోపెట్టుకున్నారు.

కారు ముందుకు వెళ్ళి కుడివేపుతిరిగి, ఒక పాడుపడ్డ బంగళావద్దకు వెళ్ళి ఆగింది. అంతకుముందే అక్కడో పాడు గాటి కారు పార్కు చేసివుంది.

"బాస్ ఇక్కడే వున్నారా?" అడిగాడు పాడుగాటి వ్యక్తి.

"ఆఁ! అందర్నీ ఇక్కడకే రమ్మన్నారు. మీకు చాలా పనుంటుంది."

అన్నాడు మూడోవ్యక్తి. అతనే వహీద్.

అందరూ కారుదిగి బంగళాలోకి వెళ్ళారు.

# 11

"కూర్చోండి!" అన్నాడు కాంత్ జరీనాను.

జరీనా కూర్చుంది.

రూం సర్వీస్‌కు ఫోన్ చేసి రెండు కాఫీలు తెమ్మన్నాడు. రెండు నిముషాల్లో కాఫీలు వచ్చాయి. ఇద్దరూ త్రాగారు.

"మేడమ్! ఇవిగో నా గుర్తు పత్రాలు. నేను ఇండియా ఏజంటునని ధృవపరిచే కాగితాలు ఇవిగో. ఈ వీసా చూడు. ఇవన్నీ చూశాక నేను సునీల్‌కుమార్‌కు విరోధిని గానని, అతని మిత్రుణ్ణని నీకు తెలుస్తుంది!" అన్నాడు.

జరీనా అలాంటి కాగితాల్నే సునీల్ దగ్గరకూడా అంతకు

ముందు చూచివుండటంతో, కాంత్ చూపించిన కాగితాల్ని సులభంగానే గుర్తుపట్టింది.

“మరి వాళ్లు అలా చెప్పారే?” విస్తుపోతూ అడిగింది జరీనా.

“ఏమిటి చెప్పారు?” అడిగాడు కాంత్.

అంతా వివరంగా చెప్పింది.

“నన్ను అరెస్టు చేసేందుకు వచ్చేవాళ్ళు నిజంగా పోలీసు అయితే భయపడవలసిన అవసరం వాళ్ళకేముంది. ఇద్దరికి నేను అలివిగాననుకుంటే పదిమందిని పంపివుండేవాళ్ళు కదా. విస్కీలో నిద్రమాత్రలు కలిపామని నీకు చెప్పారు. కానీ నా అనుమానం అందులో విషం కలిపి వుంటారు. మనిద్దరం త్రాగి చనిపోతే వాళ్ళకింక ఎదురులేదు. మన శవాల్ని అక్కడే వదిలేసి పోయేవాళ్ళు. మన బట్టలు విప్పి, క్రైమ్‌గా సృష్టించి వుండేవాళ్ళు!” అన్నాడు కాంత్.

“అవును. నా కనుమానంగానే వుండింది. అడిగాను. వాళ్లు ఏదో సమాధానం చెప్పారు. అప్పట్లో వాళ్ల సమాధానం కరెక్టుగానే తోచింది. మీరు ఎలా అనుమానించారు?” అడిగింది జరీనా.

“నువ్వు నాతో మాట్లాడేందుకు తర్వాత రమ్మన్నావు. నన్ను వెళ్ళిపొమ్మని బ్రతిమిలాడావు. పైగా అంతకుముందే ఎవరోవచ్చి నీతో మాట్లాడి వెళ్ళారని నీ మాటలవల్ల కనిపెట్టాను. దీన్నిబట్టి అనుమానమేసింది. నా అసిస్టెంటును నీయిల్లు పహారా కాయమని పురమాయించాను. అతని ద్వారా నీ యింట్లోకి ఇద్దరు ఆగంతకులు ముందుగానే వచ్చినట్లు తెల్సుకున్నాను. వెంటనే పథకం మార్చుకున్నాను. వాళ్లు ఊహించని విధంగా నిన్ను అక్కడ్నుంచి లాక్కొచ్చాను. అందువల్లే ఇద్దరం బ్రతికాం!” అన్నాడు కాంత్.

"ఇదంతా ఎందుకు చేస్తున్నట్లు?"

"నీకేం తెలీదా?"

"తెలీదు!"

"సునీల్ ఏమీ చెప్పలేదా?"

"లేదు. అర్జంటు పనులంటూ వెళ్ళేవాడు. వచ్చేవాడు. అంతే!"

"ప్రఖ్యాత సైంటిస్టు ప్రేమనాథ్ డ్రోగేని ఈ ముఠా మా దేశంనుండి తస్కరించు కొచ్చింది. ఆయన్నెక్కడో దాచి పెట్టింది. అతన్ని విడిపించేందుకు మా గూఢచారి దళం రంగంలో కురికింది. కానీ ప్రత్యర్థి కూటమి తెలివిగా ఇప్పటికి ఇద్దరు ఏజంట్లను, వాళ్ళతోపాటు మాకు సాయంచేసిన మరో నలుగుర్ని చంపింది. దాంతో నన్ను పంపారు" అన్నాడు కాంత్.

"ఆయనెక్కడున్నాడో తెలిసిందా?"

"తెలుస్తుంది."

"నన్ను నీ ద్వారా సులభంగా చంపగల ననుకున్నారు. అది ఫెయిల్ కాగానే వాళ్ళకు చెమటలు క్రమ్ముతాయి. ఇప్పుడు ఎంత ఘోరానికైనా తలపడతారు. వాళ్ళ హడావుడిలో తమ రహస్యాల్ని తామే బైటపెట్టుకొంటారు" అన్నాడు కాంత్.

ఫోన్ మ్రోగింది.

"నా అసిస్టెంటు. విరోధి కూటమి ఎక్కడుంది కనుక్కొని చెప్పమన్నాను. చెప్పేందుకు ఫోన్ చేస్తున్నట్లున్నాడు" అన్నాడు కాంత్ రిసీవరు తీసుకుంటూ.

"హల్లో!"

"ఈజిట్ మిస్టర్ కాంత్" అడిగారు అవతలవేపు నుండి.

"యస్. మీ రెవరు?"

‘‘సీ కొలుగుళ్ళం. నీ అసిస్టెంటు జార్జి మాకు పట్టు పడ్డాడు.’’

‘‘నో. నేను నమ్మను.’’

‘‘అయితే అతనితో నే మాట్లాడు.’’

క్షణం తర్వాత.

‘‘నేనే బాస్ జార్జిని మాట్లాడుతున్నాను’’ అంటూ జార్జి కంఠం వినిపించింది.

కాంత్ లేచి నిలుచున్నాడు.

‘‘నువ్వా! వాళ్ళకెలా చిక్కావ్?’’

‘‘మోసపోయాను బాస్!’’ అంటూండగానే అతని మాటలు వినపడడం ఆగిపోయింది. మళ్ళీ మొదటివ్యక్తే ఫోన్‌లో కొచ్చాడు.

‘‘విన్నావా?’’

‘‘ఆఁ!’’

‘‘అతన్ని ప్రాణాలతో పంపమంటావా?’’

‘‘అంత మంచితనం మీకుందని నాకు నమ్మకం లేదు.’’

‘‘ఉండదు. మనదంతా ఒకే కులంగదా! అతన్ని ప్రాణాలతో పంపుతాను. కానీ జరీనాను నాకు అప్పగించాలి.’’

‘‘ఆమె ఎందుకు?’’ అడిగాడు కాంత్.

‘‘అవన్నీ నీ కనవసరం.’’

‘‘ఆల్ రైట్! కానీ మాట తప్పగూడదు.’’

‘‘తప్పం!’’

‘‘ఎక్కడకు తీసుకు రమ్మంటారు?’’

‘‘ఊరవతల దక్షిణంగా ఐదుమైళ్ళ రా. ఐదో మైలు రాయి దగ్గరనుంచి కుడివేపు అరమైలు వచ్చావంటే అక్కడ పాతబంగళా వుంది. అందులో వున్నాడు నీ అసిస్టెంటు. జరీనాను తీసుకురా!’’ అంటూ ఫోన్ కట్ చేశాడు అవతలి వ్యక్తి.

తన సంభాషణ సారాంశం వివరించి చెప్పాడు జరీనాకి కాంత్.

"అయితే నన్ను వాళ్ళకు అప్పగిస్తావా?" అడిగింది జరీనా.

"నాలో ప్రాణాలున్నంతదాకా అది జరుగదు" అన్నాడు కాంత్ దృఢనిశ్చయంతో.

# 12

డోగ్రే ఆకారం భయంకరంగావుంది. అతన్ని కొరడాలతో కొట్టారు. కత్తితో గాట్లు పెట్టారు. తలవెంట్రుకలు బలంగా పీకారు. బట్టలన్నీ చించారు.

జార్జి చూస్తూ నిల్చున్నాడు. మొత్తం ఎనిమిదిమంది వున్నారు. కాంత్ తోడుంటే అందర్నీ ఖర్మాచేసి వుండే వాడు.

అంత చేసినా డోగ్రేమాత్రం ఫార్ములా చెప్పనని మొరా యిస్తూనే వున్నాడు.

"మిస్టర్ డోగ్రీ! దేశం విడిపోకముందు లాహోర్ యూని వర్సిటీలో పనిచేస్తున్నప్పుడు నువ్వు షర్మిలా అనే ఆమెను ప్రేమించావు. గుర్తుందా?" అడిగాడు వాల్టర్.

"ఆఁ!"

"ఆమెకు నీవల్ల గర్భం వచ్చింది. ఆ తర్వాత నువ్వు ఇండియాకు వెళ్ళావ్. ఆమె ఆడపిల్లని కని చనిపోయింది. ఆ పిల్ల పెరిగి పెద్దదయింది. ఆమే జరీనా. మరో అరగంటలో ఇక్కడికొస్తుంది. నీముందే ఆమెను నా అనుచరులు మాన భంగం చేస్తారు. చూస్తూ సహిస్తావో, ఆ ఘోరం జరగ కుండా ఆ ఫార్ములా మాకు చెప్తావో నిర్ణయించుకో!" అన్నాడు వాల్టర్.

"నీ మాటలు నేను నమ్మను."

"ఈ ఫోటోలు నమ్ముతావా?" అంటూ షర్మిల, డోగ్రే తీయించుకున్న ఫోటోలు, ఆ తర్వాత, షర్మిల, జరీనా తీయించుకున్న ఫోటోలు కళ్ళముందు పెట్టాడు వాల్టర్.

డోగ్రేకు నమ్మక తప్పలేదు.

తెలుపల కారాగిన చప్పుడైంది.

"మన దోస్త్ వచ్చినట్లున్నాడు" అన్నాడు వహీద్.

"జార్జి కట్లువిప్పండి" అన్నాడు వాల్టర్.

"అయితే బాస్ మనం వీడ్ని నిజంగా అప్పగించాల్సిందేనా?"

"జరీనా మనవైపు రాగానే మీరు ఇద్దర్నీ కాల్చిపారేయ్యండి" అన్నాడు వాల్టర్.

వహీద్ తన అనుచరులిద్దర్నీ వెంటబెట్టుకొని బంగళా తెలుపలకు వచ్చాడు. వెంట జార్జిగూడా వున్నాడు.

ఎదురుగా జరీనా మాత్రమేవుంది.

"వాడు రాలేదా?" అడిగాడు వహీద్.

అంతలోనే తలుపువారగా గోడకానుకుని నిలుచున్న కాంత్ చేతిలోవున్న రివాల్వరు నిప్పులు కురిపించింది. వహీద్, అతని అనుచరులిద్దరూ 'అబ్బా,' అంటూ వరుసగా నేల కూలిపోయారు. జార్జి కత్తి చేతికి తీసుకున్నాడు. జరీనా రివాల్వరు బొమ్మల మధ్యనుండి వెలుపలకు తీసింది.

"ఎంతమందున్నారు?" అడిగాడు కాంత్.

"మరో ఐదుగురున్నారు. బాస్ గాడుగూడా వున్నాడు."

"నేను వాడిసంగతి చూస్తాను. మీ రిద్దరు మిగిలిన వాళ్ళను చూచుకోండి" అన్నాడు కాంత్.

జరీనా తండ్రే ప్రేమనాథ్ డోగ్రే అన్న సంగతి చెప్పాడు జార్జి. ఆమె విస్తుపోయింది. తన తండ్రిని ఎలాగైనా రక్షించుకోవాలన్న ఆకాంక్ష బలీయంగా కలిగిందామెకు. తలుపుత్రోసుకుని జరీనా ముందు లోనికెళ్ళింది.

"రా! నీకోసం ఎదురుచూస్తున్నాను" అన్నాడు వాల్టర్.

జరీనా చీరచాటున రివాల్వరును వుంచుకుంది. వాల్టర్ ఆమె రెక్కపట్టుకొని లోనికి లాక్కెళ్ళాడు తిన్నగా డోగ్రే దగ్గరకు తీసుకువెళ్ళాడు.

"ఇదిగో నీ కూతురు" అంటూ జరీనాను డోగ్రేపైకి తోశాడు. జరీనా పైన పడగానే తనచేతిలోవున్న రివాల్వరును తండ్రిచేతిలో పెట్టింది.

"ఆమె శీలం పోకముందే ఫార్ములా మాకు చెప్పు" అరిచాడు వాల్టర్.

"నాన్నా! చెప్పొద్దు! నాకేమైనా ఫర్వాలేదు!" అంది జరీనా.

వాల్టర్ ఆమెను వెనక్కిలాగి చెంపమీదచాచి కొట్టాడు. దెబ్బకు జరీనా వెళ్ళి దూరంగా పడింది. డోగ్రే చేతిలో వున్న రివాల్వరు పేలింది. వాల్టర్ గుండెల్లోంచి చీల్చుకు పోయింది.

మిగిలిన నలుగుర్నీ మట్టుబెట్టి లోనికొచ్చిన కాంత్, జాజి తమముందు నేలకూలిన వాల్టర్‌ను చూడగానే విస్తుపోయారు.

"యూ! త్రీనాట్ త్రీ!" అన్నాడు వాల్టర్ క్రిందనుండి కాంత్‌ను చూసి.

"అవును. నేనే! మా సైంటిస్టును బలవంతంగా ఎత్తుకొచ్చిన నీవు ఆ సైంటిస్టు చేతిలోనే చచ్చావ్. మీ బలగం మొత్తం నాశనమైంది" అన్నాడు కాంత్.

వాల్టర్ కళ్ళుమూశాడు.

జరీనా డోగ్రే కట్లువిప్పింది. తండ్రీ కూతుళ్ళిద్దరూ గాఢంగా కౌగలించుకున్నారు.

"మిస్టర్ కాంత్! నన్ను కాపాడడమే గాక మా తండ్రిని

నాకు చూపించారు. మీకు నేను కృతజ్ఞురాల్ని!'' అంది జరీనా.

''ఇది నా డ్యూటీ!'' అన్నాడు కాంత్.

''ఈ కత్తి కడుక్కుంటే బాగుండును. నీళ్లెక్కడున్నాయో?'' అన్నాడు జార్జి.

''ఎంతమందిని పొడిచావ్?'' నవ్వుతూ అడిగాడు కాంత్.

''ముగ్గుర్నే సార్! అవీ చిన్న చేపలు'' అన్నాడు జార్జి కూడా నవ్వుతూ.

నలుగురూ ఆనందంగా బయటికి నడిచారు.

— : ఐపోయింది : —

# దుష్టులు దురాగతాలు!

కె. శివరామ్

ట్రాన్సిస్టర్ టెలిఫోన్ మ్రోగింది.

ట్రాన్సిస్టర్ టెలిఫోన్ ఇంకా ప్రబలం కాలేదు. మార్కెట్టుకు రాలేదు. ఈ ట్రాన్సిస్టర్ టెలిఫోన్‌కు తీగలతో పనిలేదు, డయల్ చేయవచ్చు.

ఇటువంటి ట్రాన్సిస్టర్ టెలిఫోన్ డిటెక్టివ్ యువరాజ్ దగ్గరున్నది. ఇంకా దేశంలో కొందరు ఉన్నతాధికారులవద్ద, ఉన్నతోద్యోగులవద్ద వున్నవి.

డిటెక్టివ్ యువరాజ్ రిసీవరందుకుని, "హల్లో! యువరాజ్ స్పీకింగ్!" అన్నాడు.

"నేను ధనార్జనరావుని మాట్లాడుతూంట!" అని వినబడింది.

"ఏమిటి విశేషం?" అనడిగాడు యువరాజ్.

"హోమిసైడ్ స్క్వాడ్, ఫోటోగ్రాఫర్లు, సర్జన్ నేను అందరూ ఇలియట్స్ రోడ్ కార్నర్‌లోవున్న శివాలయం వద్ద కెళ్లుతున్నాము. అతిభయంకరంగా, దారుణంగా ఓ హత్య జరిగిందట! నేనిపుడు జీపులో వెళ్ళుతున్నాను. మీరు కూడా రండి. మీకోసం ఎదురు చూస్తుంటాను" అని చెప్పాడు క్రైం బ్రాంచ్ ఇన్స్పెక్టర్ ధనార్జనరావు.

"అలాగే వస్తాను" అని చెప్పాడు యువరాజ్.

రిసీవర్ని ఫోన్ మీద పెట్టేశాడు.

ఆ ట్రాన్సిస్టర్ టెలిఫోన్‌ని చేతికి అందుకుంటూ, "ఎవరు సార్?" అనడిగాడు సూరి.

"ఇంకెవరు ధనార్జనరావ్! ఎక్కడో భయంకరంగా హత్య జరిగిందట! రమ్మన్నాడు" అనంటూ యువరాజ్ లేచి నిలబడ్డాడు.

"ఎక్కడ?"

"శివాలయం ముందు. పద, వెళ్ళుదాం. ట్రాన్సిస్టర్ టెలిఫోన్‌ని చేతికందుకుని రా" అనన్నాడు యువరాజ్.

ఆ ఇద్దరు డిటెక్టివ్‌లు బయటకొచ్చి తమ సిట్రన్ కారులో బయలుదేరారు.

ఇలియట్స్ రోడ్ కార్నర్ అల్లంత దూరంలో వుంది. శివాలయం ముందు చేరిన గుంపును చెదరగొట్టడానికి పోలీసులు విశ్వప్రయత్నం చేయడం స్పష్టంగా కనబడుతోంది.

యువరాజ్ తన సిట్రన్ కారుని ఆపి దిగాడు.

శివాలయం ఎదురుగా పోలీసులు, ఫోటోగ్రాఫర్లు హోమిసయిడ్ స్క్వాడ్ వారు హడావిడిలో వున్నారు.

ఇన్స్పెక్టర్ ధనార్జనరావు యువరాజ్‌ని చూసి గబగబ వచ్చాడు.

"హారిబుల్ మర్డర్ మిస్టర్ యువరాజ్! నేను చూశ్శేక

పోతున్నాను" అనంటూ నొచ్చుకున్నాడు ధనార్జనరావు.

యువరాజ్, సూరిలకు శవాన్ని చూడగానే గుండెలు ఝల్లుమన్నవి. ధనార్జనరావు చెప్పినదానిలో సత్యముంది. ఎన్నో భీకరాలు, దారుణాలు చూసిన డిటెక్టివ్‌లు!! చావుకు వెంట్రుకవాసంత దగ్గరకెళ్ళి బ్రతికిన యువరాజ్ సూరిలు కూడా ఆ దృశ్యాన్ని చూడలేకపోయారు.

తలను నరికివున్నారు. తల వేరుపడిపోయి వుంది. రెండు చేతులు రెండు ముక్కలుగా వేరు చేయబడివున్నవి. రెండు కాళ్ళు వేరువేరుగా వున్నవి. మొండెము ఓ ముక్కగా వుంది.

ఆ శవం ఆరు ముక్కలుగా గోచరిస్తూంది. తెగిపోయిన కాళ్ళూ చేతులు అటుయిటు చెదిరిపడివున్నవి. తల ఎటో వుంది. మొండెం బోర్లాపడివుంది. చూచి చూడగనే స్త్రీ శవమని తెలుస్తూంది.

నగ్నంగా వుంది. వక్షోజాలు, పిరుదులు కొట్టవచ్చినట్టు కనబడుతున్నవి. యువరాజ్ నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

"ఎక్కడో తలను, కాళ్ళూ చేతులను తెగనరికేసి ఇక్కడ ముక్కలను పారవైచి వెళ్ళివున్నారు. ఈ స్థలంలో నరికివుంటే నెత్తురు కారివుండేది. నెత్తురు కనపడటంలేదు," అన్నాడు యువరాజ్.

ఆ శవపు ముక్కలను ఫోటోగ్రాఫర్లు ప్రతికోణాన్నుండి ఫోటోలు తీస్తున్నారు.

"ఇక్కడ శవమున్నట్టు మీకెలా తెల్సింది?" అనడిగాడు సూరి.

"ఈ శివాలయం పూజారి తెలియజేశాడు" అని చెప్పాడు ధనార్జనరావ్.

"రాత్రి, ఇక్కడెవరైనా తచ్చాడడమో, కారాగడమో జరిగిందేమో భోగట్టా సేకరించారా?" అడిగాడు యువరాజ్.

"ఆఁ... ఈ ప్రదేశం, సాయంకాలం ఏడు గంటలకే నిర్మానుష్య మయిపోతుంది. జనసంచారం వుండదు. చూచినట్లు ఎవరూ చెప్పడంలేదు," అన్నాడు ధనార్జనరావ్.

"చనిపోయిన యువతెవరు?"

"ఏమో. ఇకమీదట తెలియాలి. దర్యాప్తు చేస్తున్నాం."

యువరాజ్ చెదిరిపడిన ముక్కలను చూస్తూ ఆలోచనలో పడిపోయాడు.

## 2

"ఆ యువతి యెవరయింది కనుగొన్నారా?" అనడిగాడు యువరాజ్.

"ఆఁ... తెలుసుకున్నాం!" అన్నాడు ధనార్జనరావ్.

"ఆ యువతెవరు?"

"ఆమె పేరు సురభి. ఆమెకు యాభైఏళ్ళ తల్లివుంది."

"ఎలా ఆచూకీ తీయగల్గారు?"

"సురభి శవం ఫోటో తీసి— ఆ ఫోటోను పత్రికలలో ప్రకటించాము. మరుసటి ఆమెతల్లి స్టేషనుకు వచ్చింది" అని చెప్పాడు ధనార్జనరావ్.

"సురభి అలా మరణించడానికి గల కారణమేదైనా తెల్సిందా?" అడిగాడు యువరాజ్.

"సురభి తల్లి సుభద్రమ్మను ఎన్ని ప్రశ్నలడిగినా తెలియదంటోంది. అందుకే విసుగుపుట్టిపోయింది. ఇంటికి వెళ్ళమని చెప్పాను. ఈ పాటికి ఇల్లుచేరుకుని వుంటుంది. మనమెళ్ళి ఆమె ఇంటిని సోదా చేయాలి. హంతకుని ఆచూకీ తీయాలి," అనంటూ ధనార్జనరావ్ లేచాడు.

"యస్ గో ఆన్" అనంటూ యువరాజ్ లేచాడు.

యువరాజ్ సూరిలు ధనార్జనరావుని అనుసరించారు.

కాసేపటిలో ఆ ముగ్గురున్న పోలీస్ జీప్ బయలుదేరింది.

"పోస్టుమార్టం రిపోర్టు విశేషా లేమిటి?" అడిగాడు యువరాజ్.

"అతిఘోరంగా వున్నది. మరణం రాత్రి ఒంటిగంట ప్రాంతంలో సంభవించింది. ముగ్గురిచేత మానభంగం చేయబడివుంది. కుడి చేయిని ప్రథమంగా నరికి వున్నారు. తరువాత ఎడమచెయ్యిని నరికేసి వున్నారు. ఆ పిదప కాళ్ళను. కాళ్ళ తరువాత తలను నరికేసి వున్నారు" చెప్పాడు ఇన్స్పెక్టర్.

జీపు సుభద్రమ్మ ఇంటి ముందాగింది.

ముగ్గురూ దిగారు. సుభద్రమ్మ ఇంట్లోకి ప్రవేశించారు.

సుభద్రమ్మ వీళ్ళనుచూసి బెదిరిపోయింది. కూతురు చనిపోయిన దుఃఖం కాబోలు ముఖం వాడిపోయివుంది. ఆమె ముఖం ఎందుకో బ్బరిలా ముడుచుకు పోయివుంది.

యువరాజ్ ఆ ఇంటిని పరీక్షగా చూశాడు.

చాలా చిన్నయిల్లు. రెండే రెండు గదులున్నవి. ఒక కుర్చీ వుంది. కుర్చీముందు బల్లొకటివుంది. ముందుగది హాలులాగ వుంది. వెనుకగది వంటగదిలాగుంది. గోడలకు సినిమా తారల బొమ్మలుగల కేలెండర్లు వ్రేలాడుతున్నవి.

లోపలగదిలో ఒక బీరువావుంది. అక్కడక్కడ రెండు ట్రంక్ పెట్టెలు వున్నవి.

"ఏమ్మా, మీ అమ్మాయి హత్యచేయబడింది. మీరు సహకరించకపోతే హంతకుడు దొరకడు. గనక మీ అమ్మాయిని గురించి తెల్సిన విషయాలు చెప్పండి," అనడిగాడు యువరాజ్.

"ఏం చెప్పాలో నాకు తెలియడం లేదండి" అనంటూ సుభద్రమ్మ బావురుమనేసింది.

"జరిగిన విషయాలు చెప్పండి."

"నూది యీ వూరు కాదండి. ఒక కుగ్రామం. గ్రామం

నుండీ నన్ను బలవంతాన ఈ ఆద్దెకొంపకు తీసుకొచ్చింది సురభి. ఎక్కడికో వెళ్ళేది. ఎప్పుడో వచ్చేది. మందలించే దాన్ని. పెళ్ళిచేసుకొమ్మని పోరాడేదాన్ని. నా మాటను లక్ష్యపెట్టలేదు. చివరకు యిలా చచ్చింది," అనంటూ సుభ ద్రమ్మ వుసూరుమంది.

సురభి వ్యభిచరించేదన్న వుద్దేశాన్ని తెలియజేసిందని యువరాజ్ అనుకున్నాడు.

"మీ అమ్మాయి యెక్కడెక్కడకు వెళ్ళేది?"

"ఆ విషయాలు నాకు తెలియవు. అడిగినా చెప్పేదికాదు. చెప్పినా నాకు తెలియని విషయాలు."

"అంటే?"

"ప్రభుత్వం, రాజకీయాల్ని గురించి చెప్పేది."

ఆ మాటకు ధనార్జనరావు, యువరాజ్, సూరీ అదిరి పడ్డారు.

ప్రభుత్వం, రాజకీయాల్ని గురించి సురభి ఏం మాట్లాడి వుంటుంది? స్త్రీలుకూడా యిప్పుడు రాజకీయాలలో ప్రవే శించి బహుముఖ పాత్రలు వహిస్తున్నారని అందరికీ తెల్సు. ఇండియాలోను, రష్యాలోను స్త్రీ రాజకీయవాదులు అధిక మని యువరాజ్‌కు తెల్సు.

"మీ కుమార్తెను గురించి మీరు సరైన సమాధానాలు యివ్వలేకపోతున్నారు. గనక మీ అమ్మాయిని గురించి తెల్సుకోడానికి ఏవైనా నిదర్శనాలు మాకు లభించవచ్చు మీ యింటిని వెదికితే!" అన్నాడు యువరాజ్.

"నాకు చదువురాదు. నిరభ్యంతరంగా వెదుకుకోండి" అని చెప్పింది సుభద్రమ్మ.

యువరాజ్, సూరీ, ధనార్జనరావ్ వెదకడం ప్రారం భించారు.

మావో సూక్తులు, చైనా సాహిత్యం, ఇంకా మన

ప్రభుత్వం నిషేధించిన కొన్ని పుస్తకాలు, కొన్ని కరపత్రాలు లభించాయి. కొన్నిటిపైన నాగరాజు అనే పేరు వుంది.

వాటిని చూసి యువరాజ్, సూరి, ధనార్జనరావు ఆశ్చర్యచకితులై ఒకరిముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు.

ఇంకా వెదికారు.

రెండు నాటుబాంబులు స్వాధీనమైనవి.

సుభద్రమ్మ వాటిని చూసి, "అవి ఏమిటి? ఆ పుస్తకాలలో ఏముంది? సురభిని ఎవరు చంపారో తెల్సిందా?" అనడుగుతోంది.

"త్వరలో సురభిని చంపినవారు తెలియవచ్చు" అనంటూ యువరాజ్ ఆ యింటినుండి బయటకు వచ్చాడు.

"సురభి నక్సలైట్ల మనిషై వుండాలి" అని ధనార్జనరావు తన అనుమానం వెలిబుచ్చాడు.

# 3

సూరి తన సిట్రన్ కారుని తను యింటిముందాపాడు. దిగగనే యువరాజ్ ప్రత్యక్షమయ్యాడు.

"సూరీ, నువ్వు వెళ్ళినపని ఏమైంది?" అడిగాడు యువరాజ్.

"నాగరాజు గురించి చాలా విషయాలు తెలుసుకున్నా."

యువరాజ్ సూరీ ఇద్దరు కన్సల్టింగ్ గదిలోకి దారితీశారు. సూరిని తెల్సుకున్న విషయాలు చెప్పమన్నట్టు యువరాజ్ చూశాడు.

"నాగరాజు సత్యం అల్లుడట! సత్యం గొప్ప నక్సలైట్ నాయకుడని చెప్పుకుంటున్నారు. నాగరాజు కడుబీదవాడు. మొన్ననే పెద్ద బంగళా ఒకటి కట్టాడు. కారొకటి కొన్నాడు. నక్సలైట్ వుద్యమంద్వారా దోచుకున్నడబ్బును

ఆ యా నాయకులు తమ బంధువులకు యిచ్చుకుంటారట. సత్యం తన అల్లుడైన నాగరాజుకు చాలా డబ్బులు యిచ్చి వుండాలని కథలు కథలుగా చెప్పుకుంటున్నారు'' అన న్నాడు సూరి.

''నిజమే సూరి. ఆ విషయం నాకూ తెల్సు. భూస్వాముల వద్ద దోపిడీచేసిన ధనాన్ని పేదలకు పంచాలన్నది నక్స లైట్ ముఖ్య ఉద్దేశం. కానీ ఆ నాయకులు అలా చేయక బంధువులకు యిచ్చుకుంటున్నారు. బంధువులు ఇళ్ళు కట్టించు కుంటున్నారు. కార్లు కొనుక్కుంటున్నారు. కొందరేమో బంగారు కణికలు దాచుకుంటున్నారు. చూశావా నక్సలైట్ల ల్లోను బంధుప్రీతివుంది'' యువరాజ్ అన్నాడు నవ్వుతూ.

''ఆ బంధుప్రీతికి అంతశక్తి వుందని విశదమవుతుంది. నాగ రాజు నక్సలైట్లలో చేరదలుచుకున్న వారిని గాదర్ చేస్తు న్నాడు. అలా గాదర్ చేసిన వారిని సత్యం వద్దకు పంపు తున్నాడు. సత్యం రిక్రూట్ చేస్తున్నాడని రూఢిగా తెలిసింది'' అనన్నాడు సూరి.

''అంటె సురభి నాగరాజు మూలంగా సత్యంవద్ద కెళ్ళి వుండవచ్చును.''

''అఁ... వుండొచ్చు.''

''సత్యం రిక్రూట్ చేస్తుంటె పోలీసులు బంధించలేదా?''

''పోలీసుల కనుగప్పి తిరుగుతున్నాడని వదంతి వుంది. నాగరాజు అతిరహస్యంగా ఇక్కడ పోగుచేసిన వారిని— సత్యం వద్దకు పంపడం మర్మంగా సాగుతూంది. ఎలా పంపు తున్నాడో అంతుపట్టలేదు'' అనన్నాడు సూరి.

## 4

''మేమిద్దరం నక్సలైట్ వుద్యమంలో పాల్గొనాలనివుంది. మమ్ములను చేర్చుకుంటారా?'' అనడిగాడతను. అతని

ప్రక్కనే మరో యువకుడు నిలబడివున్నాడు. వీరిద్దరికెదురుగా స్టైలుగా సిగరెట్ తాగుతూ నాగరాజు నిలబడి వున్నాడు.

"మీ పేర్లేమిటి? ఏవూరు? దృఢకాయుల్లాగున్నారు. మీబోటి బలవంతులు మాకు తప్పక అవసరం" అన్నాడు నాగరాజు.

"నాపేరు వీర్రాఘవులు. వీరి పేరు వీరయ్య. మాది యీవూరే!" అన్నాడు వీర్రాఘవులు.

"సరి. సాయంకాలం రండి. చెప్పవలసినవి, చేయవలసినవి మా మామయ్య చెప్తాడు," అన్నాడు ధీమాగా నాగరాజు.

"మరొక్క మనవి" నసిగాడు వీర్రాఘవులు.

ఏమిటదన్నట్టు నాగరాజు సిగరెట్ పొగ పీలుస్తూ చూశాడు.

"నాతోబాటు యింకా నలుగురు యువకులున్నారు. వాళ్ళనూ తీసుకు రమ్మంటారా? వాళ్ళూ నక్సలైట్లలో కలవడానికి ఆతృత చెందుతున్నారు," అన్నాడు వీర్రాఘవులు.

"అలాగే తీసుకురండి. మీరు పిలుచుకొచ్చు వ్యక్తులు మూలంగా ఎటువంటి బెడదవచ్చి పడకూడదు," అని నాగరాజు హెచ్చరింపుగా చెప్పాడు.

సరేనన్నట్టు వీర్రాఘవులు తలాడించాడు.

## 5

"వీర్రాఘవులూ! వీళ్ళంతా నమ్మకస్తులేనా?" అనడిగాడు నాగరాజు.

"అందరూ నమ్మకస్తులేనండి. మీ మాటలు మీరం!" అని చెప్పాడు వీర్రాఘవులు.

నాగరాజు అందరినీ ఒక్కతడవ పరకాయించి చూశాడు. అతని మనసులో నమ్మకం కుదిరింది.

"సరి రండి" అనంటూ నాగరాజా బయలుదేరాడు. నాగరాజా కనకాశే వీర్రాఘవులు, వీరయ్య మరి నలుగురు కల్సి ఆరుమంది వున్నారు.

నాగరాజా తన సరికొత్త అంబాసిడర్ కారుని గారేజ్ నుండి బయటకు తీశాడు. అందులోకి అందరూ యెక్కారు. చాలా ఇరుకుగా వుంది. ఆ ఇరుకులోనే అందరూ ఇమిడి కూర్చున్నారు. బయటి వారికి లోపల కూర్చున్నవారు కన్పించడంలేదు.

కారు బయలుదేరింది.

కారు చాలా సేపు ప్రయాణించింది. ఒక ఇంటిముందాగింది. కారులోంచి దిగిన వారందరూ అదొక గ్రామమని తెల్సుకున్నారు.

కారునుండి దిగిన నాగరాజు గబగబ ఆ ఇంటివైపు నడిచాడు. ఆ ఇంటి తలుపులు కొద్దిగా తెరచి వున్నవి.

నాగరాజా, "మామయ్యా, మామయ్యా," అనంటూ తలుపులు తోసి, లోనచూసి గావుకేక పెట్టేశాడు.

నక్సలైట్లలో చేరదలచుకుని వచ్చిన ఆరుగురు ఖంగారుగా పరుగెత్తారు. లోన చూశారు. ఆశ్చర్యం—

ఒక స్త్రీ తలనరికి వేయబడివుంది. కట్టుకున్న తెల్లచీర నిండా రక్తమయంగా వుంది. ఎగజిమ్మిన రక్తం గడ్డకట్టుకుని పోయివుంది. ఆ దృశ్యాన్ని చూశ్లేకపోయారు.

"మా అత్తయ్యను యెవరో చంపేశారు" అనంటూ నాగరాజా బావురుమనేశాడు.

"మీ మామయ్య ఏడి?" అని వీర్రాఘవులు అడిగాడు.

"ఏమో?" అనంటూ నాగరాజా ఆ ఇంట్లోకి ప్రవేశించి వెదికాడు. లేడు. "మామయ్య ఏమైపోయాడు?" అనంటూ దుఃఖాన్ని ఆపుకోడానికి నాగరాజా సతమతమవుతున్నాడు.

"మీ అత్తయ్యను యెవరు చంపివుంటారు?" అడిగాడు వీరయ్య.

"ఏమో? ఆమె ఆడవాళ్ళను రిక్రూట్ చేసేది," అన్నాడు నాగరాజు.

"అంటె నక్సలైట్లల్లో స్త్రీలూ వున్నారా?" అని ఆశ్చర్య పడుతూ అడిగాడు వీర్రాఘవులు.

"అవును. పురుషులను మామయ్య, స్త్రీలను అత్తయ్య రిక్రూట్ చేసేవారు."

"రిక్రూట్ చేసేవాళ్ళను యెవరు చంపి వుంటారు?" అడిగాడు వీర్రాఘవులు.

"నా కంతుపట్టలేదు. ఎవరో దుర్మార్గులు చేసివుంటారు."

"మీ మామయ్య దుర్మార్గాన్ని ప్రోత్సహిస్తూ, ఆ దుర్మార్గాన్ని పెంచడానికి మనుషులను రిక్రూట్ చేస్తూంటె, దుర్మార్గుల నేవారు ఆయన దరికి రావడానికి వీల్లేదు" చెప్పాడు వీర్రాఘవులు.

"మరి మా అత్తయ్య తలను యెవరు నరికి వుంటారు?" అంతుపట్టక అడిగాడు నాగరాజు.

"మీ మామయ్యే చంపి వుండొచ్చు."

"అసంభవం! అలా యెన్నటికి జరిగివుండదు. ఇందులో ఏదో మోసం వుంది."

"మమ్ములను ఏంచేస్తావ్?" అడిగాడు వీర్రాఘవులు.

"మామయ్య లేడు. అత్తయ్య మరణించి వుంది. మామయ్య కనబడగానే కబురు చేస్తాను," అని చెప్పాడు నాగరాజు.

సత్యం ఇంటిముందు ఆ గ్రామస్థులు దూరంగా నిలబడి వింతగా చూస్తున్నారు.

వీర్రాఘవులు తనతోడివారిని ఉద్దేశించి ఏదో సైగ చేశాడు. అంతే—

నాగరాజుని విరిచి పట్టుకుని బంధించారు!

నాగరాజు కుయ్యో, మొర్రో అని అరిచేశాడు. "ఎవరు మీరు?" అని గర్జించాడు.

"నేను డిటెక్టివ్ యువరాజ్‌ని. వీరయ్య నా అసిస్టెంట్ సూరి. మిగతా నలుగురు పోలీస్ ఉద్యోగులు. కిక్కురుమనకుండా కారెక్కు" అని చెప్పాడు వీరరాఘవులు వేషంలో వున్న యువరాజ్.

నాగరాజు బేలైపోయాడు. లొంగిపోయాడు.

సూరి ఆ పోలీస్ ఉద్యోగస్థులకు ఏదో చెప్పాడు.

నాగరాజుని పోలీసులు కారులోకి యెక్కించుకుని వెళ్ళిపోయారు.

యువరాజ్, సూరిలిద్దరూ సత్యం ఇంట్లోకి ప్రవేశించారు.

సత్యం భార్య శవాన్ని చూస్తూ ఆ ఇద్దరు డిటెక్టివ్‌లు మౌనంగా కాసేపు నిలబడ్డారు.

"ఏమిటి సార్, విచిత్రంగా వుంది" అన్నాడు సూరి.

"సురభి నక్సలైట్ వ్యక్తి. సత్యం, సత్యంభార్య నక్సలైట్లను రిక్రూట్ చేసేవారు. అటువంటి వారిని యెవరు చంపి వుంటారు?"

"ఆ విషయాలు తరువాత. ముందు యీ ఇంటిని పరిశోధిద్దాం" అంటూ యువరాజ్ సత్యం ఇంటిని వెతకడం ప్రారంభించాడు. సూరి డిటో!

ఎలాగో తంటాలుపడి నక్సలైట్లలో చేరి వారి స్థావరాలను కనుగొనాలని యువరాజ్ ప్లాన్ వేసుకున్నాడు. ఇపుడు తారుమారయింది.

సత్యం ఇంట్లో అయిదు తుపాకులు, నాటు బాంబులు ఆరు, చైనా సాహిత్యం, కరపత్రాలు, మావో సూక్తులు బయట పడ్డాయి. వాటిని యెంత తిరగేసినా నక్సలైట్ల స్థావరాలు గురించిన ఆచూకీ తెలియ రాలేదు. ఆ ఇంట్లో యెంత వెదికినా నిదర్శనాలు శూన్యం!!

ఆ ఇద్దరు డిటెక్టివ్‌లు సత్యం ఇంటినుండి బయటికొచ్చారు. బయట గ్రామస్తులు చాలామంది నిలబడి వున్నారు.

"సత్యంగారి ఇంటిలో ఏం జరిగిందో చెప్పండి" అన్నాడు యువరాజ్, గ్రామస్తుల నుద్దేశించి.

"ఇద్దరు యువకులు సత్యం ఇంట్లోకి ప్రవేశించారు. వెళ్ళిన యువకులు కాసేపటిలో సత్యాన్ని పిలుచుకుని బయటకి వచ్చారు. బయటకు రాగానే ఒక జీపు యెక్కడనుండి వచ్చిందో వచ్చి ఆగింది. సత్యాన్ని ఆ కారులో యెక్కించుకుని పారిపోయారు," అని చెప్పాడు ఒక వృద్ధుడు.

"ఆ యువకులు యెవరు? ఎలా వుంటారు?" అనడిగాడు యువరాజ్.

"ఎవరయింది మాకు తెల్వదు. యుక్తవయస్సులో వున్నారు" అని చెప్పాడాయన.

"మీవూరు నక్సలైట్ల ప్రభావానికి గురయిందా?"

"అయిందిబాబూ! రాత్రులలో అరచేతులలో ప్రాణాలు పెట్టుకుని వుంటున్నాం. ఈ నక్సలైట్లు నాశనంగానూ... గ్రామాలమీదపడి కొల్లగొట్టుకుపోతున్నారు'" అని ఆయన వాపోయాడు.

"ఈ నక్సలైట్లు ఎక్కడవుంటేది? ఎలా దాడిచేసేది మీకే మైనా వివరాలు తెలిస్తే చెప్పండి. నక్సలైట్లను బంధించడానికి తగిన చర్యలు తీసుకుంటాం" అని యువరాజన్నాడు.

"ఎక్కడో కొండప్రాంతంలో వుంటున్నారంటున్నారండి."

"కొండప్రాంతాలంటే యీ చుట్టుప్రక్కల ప్రదేశమేనా?

"అవునండి."

"మీబోటివారు పోలీసులకు తోడ్పడితే నక్సలైట్లను సమూలంగా నిర్మూలించవచ్చు" అనంటూ యువరాజ్

అక్కడనుండీ కదిలాడు.

## 6

అది అర్థరాత్రి. ఒక గ్రామానికి వందగజాల దూరంలో చెట్లమాటున ముగ్గురు యువకులు చీకటిలో పొంచివున్నారు. వారిపేర్లు సుదర్శన్, గాండీవం, త్రిశూలం.

ఆ ముగ్గురి చేతులలో మిషన్‌గన్స్ వున్నవి. అప్రమత్తులై అతిజాగ్రత్తగా వున్నారు.

“నక్సలైట్లు నిజంగా ఈ వూరిమీదకు ఇవేళ దాడి చేస్తారా?” అనడిగాడు గాండీవం అనుమానంగా.

“రావాలి. వచ్చి తీరాలి” అనన్నాడు సుదర్శన్.

నక్సలైట్లు ఆవూరిమీద ఆరాత్రి దాడి జరుపుతారని పసిగట్టిన ఆ ముగ్గురు దారి కాస్తున్నారు.

కాలం పరుగెత్తుతూంది.

ఆ ముగ్గురూ నక్సలైట్ల కొరకు ఎదురుచూస్తున్నారు. గాఢాంధకారంగావుంది. అడవిప్రదేశమది.

దూరంగా ఒక నక్సలైట్ గుంపు రావడం ఆ ముగ్గురు పసిగట్టారు. మిషిన్‌గన్స్ పట్టుకుని స్టడీ అయ్యారు. అటొకరుగా ఇటొకరుగా కదిలి నక్సలైట్ల గుంపు కెదురుగా నిలబడ్డారు.

సుదర్శన్, “ఫైర్” అనరిచాడు. అంతే—

మూడు మిషిన్‌గన్‌లు ధమధమధమ మని చెవులు తూట్లు పడేలా మ్రోగుతున్నవి.

నక్సలైట్లు అనబడే కొందరు చావరుపులు అరుస్తూ నేల మీదకు ఒరుగుతున్నారు. ఈ హఠాత్సంఘటనకు బెంబేలు పడిపోయిన ఆ గుంపు అటు యిటు ఎటు కదలలేక స్తంభించి నిలబడిపోయింది. అలా నిలబడడం మూలంగా ఆ ముగ్గురి మిషిన్‌గన్‌లు గుంపునంతటిని త్రుటిలో హతమార్చ గలిగాయి.

సుమారు నలభైమంది వున్నారా నక్సలైట్లు.

నలభై శవాలు ఆ చీకటిలో భీకరంగా వున్నవి.

ఆ ముగ్గురు భయంలేకుండా అందరిని కాలితో తన్నుతూ చూశారు. తుపాకులు, నాటుబాంబులు, విల్లంబులు వున్నై.

నలభైమందిలో ఒకతను ఎలాగో చావు తప్పించుకుని బ్రతికి వున్నాడు. బ్రతికివున్న ఆ నక్సలైట్ ఆ ముగ్గురిని చూసి భయభ్రాంతుడై ఆ శవాల మధ్య శవంలా పడి వున్నాడు.

"మన మిషన్‌గన్‌గుండ్లు ఒక్కటి తప్పలేదు. ప్రతిగుండు ప్రాణాలు తీసింది," అనన్నాడు త్రిశూలం.

"అవును. మన గన్‌లు ఫిరంగుల్లా పనిచేశాయి," అని చెప్పాడు గాండీవం.

సుదర్శన్ తన జేబులోనుండి టార్చ్‌లైట్ తీసి వెలిగించి చూశాడు. ఆశ్చర్యం—

చాలామంది ఆడవాళ్ళు వున్నారు. తమ మిషన్‌గన్‌లు ఆడవారి ప్రాణాలూ తీసినందుకు అతిగ నొచ్చుకున్నారు.

బ్రతికివున్న నక్సలైట్ యువకుడు తారెత్తిపోయాడు. తను బ్రతికుండడం వాళ్ళు గమనిస్తే నిర్దాక్షిణ్యంగా చంపేస్తారని భయపడి, లేచి పరుగెత్తాడు. వెంటనే—

గాండీవం అతని వెనుకాలే పరుగెత్తి పట్టుకున్నాడు. అతను భయంతో గడగడ వణికిపోతున్నాడు.

ముగ్గురూ ఆ యువకుణ్ణి ముందుగా చితక బాదారు. "ఎందుకు వీళ్ళలో చేరావు?" అనడిగాడు సుదర్శన్.

"ఏవేవో ఆశలు చూపారు," అని చెప్పాడతను.

"మీ స్థావర మెక్కడో మాకు చూపు," క్రోధంగా అడిగాడు గాండీవం.

"నేను చూపితే నన్ను చంపేస్తారు."

"చూపకపోతే మేము చంపేస్తాం," అనన్నాడు

త్రిశూలం. ఆ యువకుడు బెదిరిపోయి వున్నాడు.

గాండీవం చేతికి కసాయి కత్తిని పుచ్చుకున్నాడు. "చెప్తావా, నీ చేయిని నరకమంటావా?" అని అడిగాడు. అతను మాట్లాడలేదు.

గాండీవం కత్తి, ఆ యువకుని మోచేయిమీద పడింది. చెయ్యి తెగిపడిపోయింది. బాధకు గావుకేకలు పెట్టుతూ అరుస్తున్నాడా యువకుడు.

"మీ స్థావరం యెక్కడో చెప్పు," మళ్ళీ గర్జించి అడిగాడు సుదర్శన్.

ఆ యువకుడు బిత్తరకపోయి, "నాతో రండి చూపిస్తాను" అనన్నాడు. అందరూ బయలుదేరారు. నడుస్తున్నారు.

అంతా అడవి ప్రదేశం, కొండ ప్రదేశం.

"మీ దళంలో యెంతమంది వున్నారు?" ప్రశ్నించాడు గాండీవం. ఆ యువకుడు చెయ్యి తెగిన బాధను ఓర్చుకోలేక మూల్గుతూ మూల్గుతూ నడుస్తున్నాడు.

"డెబ్బైమందిమి వున్నాం."

"మీ నాయకుడెవడు?"

"నరసింహం."

"ఈ అడవులలో దళాలు యెక్కడెక్కడ వున్నవి?"

"నా కా విషయాలు తెలియవు."

"చెప్పు. చెప్పకపోయావా కాళ్ళు నరికేస్తాను," అని వురిమాడు త్రిశూలం.

"నిజంగా నాకు తెలియదండి."

"ఈ నక్సలైట్లలో యెందుకు చేరావు?"

"బుద్ధి గడ్డితిని చేరానండి. చెప్పేదొకటి చేసేదొకటి. నాలా విసుగుపుట్టిన కొందరు తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. కొందరు పశ్చాత్తాపానికి గురై పోలీసులకు చిక్కిపోయారు. ఈ నక్సలైట్ల ఉద్యమంలో ఉత్తేజకరమైన లక్ష్యాలు, ఆశ

యాలు, ఆదర్శాలు వున్నాయని చేరానండీ. పేరుకు పైకి అలా అనిపించింది. చేరిన తరువాత ఒకసామాన్య దోపిడి ముఠాగా ఈ నక్సలైట్ ఉద్యమం ఉందని గ్రహించాను."

"మరెందుకు వున్నావు?"

"రేపు వెళ్ళిపోదాం అనుకున్నాను. ఈలోపు మీ చేతిలో చిక్కుపడ్డాను."

"నీవెన్ని చెప్పినా మీ స్థావరాన్ని చూపితీరాలి. లేదా చంపితీరుతాము. పద" అని హెచ్చరించాడు సుదర్శన్.

## 7

నక్సలైట్ల శవాలున్నచోట జీపాగింది. అక్కడున్న పోలీస్ అధికారులు, ధనార్జనరావుకు యువరాజ్ కు సెల్యూట్ చేశారు.

ఆ శవాలు చూసిన డిటెక్టివ్ లిద్దరు, ధనార్జనరావు గడగడలాడిపోయారు. మృతకళేబరాలు చూస్తుంటే గుండెలను ఎవరో పిండుతున్నట్లయింది.

గడ్డకట్టిన నెత్తురు భయంకరంగా వుంది. వాళ్ళ దగ్గర తుపాకులు, విల్లంబులున్నవి.

చరిత్రకు అందని కాలంలో దోపిడీ దొంగలు, హంతకులు, గ్రామీణ ప్రాంతాలపై దాడిజరిపి దోచుకుని వెళ్ళేవారు. నక్సలైట్లు ఆ కోవకు చెందినవారని స్పష్టంగా తెలుస్తూంది.

యువరాజ్, నూరీ ఆ శవాలను చూస్తూ పరికిస్తున్నారు, మిషన్ గన్ తోనే చంపివుండాలని గుళ్ళు జొరబడ్డ విధానాన్నిబట్టి నిర్ణయించుకున్నారు.

శవాలమధ్య తెగిన చెయ్యి ఒకటి కనబడింది. వెంటనే రక్తం కారినజాడ స్పష్టంగా గోచరిస్తూంది. కారిన రక్తం ఒకవైపు వెళ్ళుతోంది. రక్తం జాడవైపే నడిచాడు యువరాజ్.

రక్తధార తగ్గుముఖం పట్టింది కాబోలు బొట్లు బొట్లుగా

పడివుంది. యువరాజ్ పరీక్షగా చూశాడు. నల్గురు నడిచి వెళ్ళివుండాలని నిర్ధారణ చేశాడు.

"మిస్టర్ ధనార్జనరావ్! ఒక వ్యక్తిని బంధించి వున్నారు! ఆ వ్యక్తిచేత యేదో నిజం చెప్పించడానికని ఒక చెయ్యిని నరికివున్నారు. ఇక్కడున్న శవాలలో ఎవరి చెయ్యీ నరికి లేదు. గనక అలా వూహించాను. చెయ్యి నరకబడ్డతనిని ముగ్గురు పిలుచుక వెళ్ళివున్నారు. బలవంతంమీద తీసుకెళ్ళి వుండాలని నా అభిప్రాయం. నిజం చెప్పించడానికి చెయ్యి నరికి వున్నారంటె బలాత్కారం మీదనే నడిపించుకెళ్ళి వుండాలి. గనక నేను, సూరి ఆ అడుగుజాడలను బట్టి వెళ్ళుతాం. మీరు మీపని చేసుకోండి," అనన్నాడు యువరాజ్.

"యువరాజ్! ప్రమాదమైన పని. ఇదంతా అడవి ప్రదేశం. నక్సలైట్లను గురించి తెలియనిదికాదు. వాళ్ళు పచ్చి దుర్మార్గులు— పోలీసులని అనుమానించారంటె తుపాకీలతో ప్రేల్చుతారు, లేదా నాటుబాంబులు విసురుతారు. లేదా విల్లంబులతో చంపడానికి వెనుకాడరు. జాగ్రత్త" హెచ్చరించాడు ధనార్జనరావ్.

"సూరీ! నీవు జీపువద్ద కెళ్ళు. వీలున్నంతవరకు నా వెనుకనే డ్రైవ్ చేసుకుంటూ రా!" అని చెప్పాడు యువరాజ్.

"సరి సార్!" అనంటూ సూరి జీపువద్ద కెళ్ళాడు.

అడవిలో అడుగుజాడలనుబట్టి యువరాజ్ ముందు నడిచి వెళ్ళుతున్నాడు. యువరాజ్ వెనుకనే సూరి జీప్ని మిట్టపల్లాలలోను, గుట్టల మీద, పొదలలోను దూర్చి నడుపుతున్నాడు.

అదంతా కొండ ప్రదేశం. అడవి ప్రదేశం. ఆ ప్రదేశమంతా నక్సలైట్లకు బాగా తెల్సు. ఏ సమయాన్నైనా విరుచుక పడవచ్చు. ఆ ఇద్దరు డిటెక్టివ్లు అతి జాగ

రూపమై ముందు కెళ్తున్నారు.

యువరాజ్ అడుగుజాడలను తప్పనీయకుండా వెంటాడుతున్నాడు. సూరి, యువరాజ్ వెనుకాలే దారి, డొంకలేని ప్రదేశంలో జీపుని మెల్లగా నడుపుతున్నాడు.

ఒకచోట—

ఒకతను అచేతనంగా పడివున్నాడు. తలనుండి నెత్తురు కారి గడ్డకట్టివుంది. ఒక చెయ్యి తెగివుంది. ఎప్పుడు పడిపోయాడో, ఎప్పటినుండి స్పృహలేకుండా పడివున్నాడో యువరాజ్ ఊహించలేకపోయాడు.

యువరాజ్, సూరి ఆ యువకుని చుట్టూచేరి పరీక్ష బెట్టి చూశారు. ఎవరా యువకుడు? ఎందుకక్కడ పడివున్నాడు? అతని తలమీద ఎవరు, ఎందుకు కొట్టారు? ఇత్యాది ప్రశ్నలు ఆ యిద్దరి డిటెక్టివ్ లకు కలిగాయి.

సూరి జీపులోవున్న 'వాటర్ బాగ్'ని తెచ్చి నీళ్ళు ఆ యువకుని ముఖంమీద చల్లాడు. ముక్కుతూ మూల్గుతూ తల పట్టుకుని లేచాడు. యువరాజ్‌ని సూరిని చూసి భయపడిపోయాడు.

"ఎవరు నువ్వు?" అడిగాడు యువరాజ్.

"మాది గుంటూరు జిల్లాలోని ఒక కుగ్రామం. తెల్సీ తెలియక నక్సలైట్ ఉద్యమంలో చేరాను."

"నిన్నెవరు యిలా కొట్టారు?"

"ఎవరో ముగ్గురు యువకులు. సర్చ్‌లైట్లు అని చెప్పుకున్నారు. ఆ ముగ్గురూ చేరి ముప్పైతొమ్మండుగురు నక్సలైట్లను చంపేశారు! నేనొకడినే బ్రతికి బయటపడ్డాను. నన్ను బలాత్కారంగా తీసుకొచ్చారు. నక్సలైట్ల స్థావరం చూపమన్నారు. చూపాను."

"నీ చేయెందుకు నరికారు?"

"నిజం చెప్పించడానికి."

"ఆ యువకులేరి?"

"ఏమో నాకు తెలియదు."

"నువ్వు చెప్పేది విచిత్రంగావుంది. నక్సలైట్లకు - సెర్చ లైట్లు పుట్టారా?"

"అవునండి. అమానుష అకృత్యాలు అచిరకాలంలోనే అంతం అయితీరుతాయని అనుభవంలో చూశాను. దుర్మార్గానికి దౌర్జన్యం, అవినీతికి అధర్మం ఆవిర్భవించి తీరుతుందని స్వానుభవంలో తెల్సుకున్నాను."

"నీ వెందుకు నక్సలైటల్లో చేరావు? నక్సలైట్ ఉద్యమంలో యెవరెవరు చేరుతున్నారు?"

"నక్సలైట్ల ఉద్యమ ప్రారంభంలో నిరుద్యోగులైన ఉద్యోగులు, విద్యా విషయాలలో రాణించని విద్యార్థులు, నిరక్షరాస్యులు, అమాయకులు, అన్నం పున్నం ఎరుగని యితరులు చేరారు. ఆ తరువాత సంపన్నులైన భూస్వామ్య కుటుంబాలకు చెందినవారు చేరడం ప్రారంభించారు" చెప్పాడా యువకుడు.

"సెర్చలైట్లు అనబడే వ్యక్తులు యెటెళ్ళారు?" అనడిగాడు యువరాజ్.

"మా స్థావరం చూపాను. అంతే! తర్వాత నన్ను స్పృహ పోగొట్టారు."

"ఆ స్థావర మెక్కడో చూపుదువుగాని రా!" అనంటూ యువరాజ్, సూరీలు ఆ యువకుని అనుసరించారు.

చెయ్యి తెగిన బాధను, తలమీది గాయానికి కలుగు బాధను ఓర్చుకుంటూ వెళ్ళుతున్నాడా యువకుడు.

స్థావరం చేరుకున్నారు.

అక్కడి దారుణాన్ని చూడలేక, చూడకుండా ఉండలేక యువరాజ్ సూరీలు వేదన పడిపోయారు. బాంబులతో కూల్చిన గుహ. ఆ గుహలో సుమారు నలభై శవాలు అస్త

వ్యస్థంగా పడివున్నాయి.

తెలిసో, తెలియకో నక్సలైట్ల ఉద్యమంలో కొందరు చేరుతున్నారు. అలా చేరడానికి వారి మనసులను పాడుచేసి కొన్ని దుష్టశక్తులు దోహదం చేస్తున్నవి. బీదవారు, అమాయకులు అయినవారిని అంతదారుణంగా చంపడం మన్నించరాని నేరం.

అంత హీనంగా, దారుణంగా భయంకరంగా చంపడం రాక్షస కృత్యమవుతుంది.

ఎవరా సెర్చ్లైట్లు? నక్సలైట్లను ఎందుకలా చంపుతున్నారు? ఆ ముగ్గురు మూలంగా ఇందరు చనిపోయారా? ఏమిటీ విచిత్రం?

తను నక్సలైట్లను గురించే సరైన భోగట్టా సేకరించలేదు. అంతలోనే సెర్చ్లైట్లు పుట్టడం ఏమిటి?

యువరాజ్ మనసు అల్లకల్లోలమయిపోయింది.

"మనం ట్రాన్సిస్టర్ టెలిఫోన్ ద్వారా దగ్గరలోవున్న పోలీస్ బలగానికి తెలియజేయడం మంచిదని నా అభిప్రాయం," చెప్పాడు సూరి.

"అవును" అంటూ యువరాజ్, సూరి భుజానికున్న ట్రాన్సిస్టర్ టెలిఫోన్ అందుకుని, డయల్ చేశాడు. ఆ టెలిఫోన్లో మాట్లాడడం వైర్లెస్లో మాట్లాడినట్లే వుంటుంది.

యువరాజ్ ఫోన్లో పలికిన పోలీస్ దళానికి, అక్కడి పరిస్థితులు వివరించి చెప్పాడు. తనున్న చోటు గుర్తులు చెప్పాడు.

ఒక గంటలో పోలీస్ దళం చేరుకుందక్కడకు.

పోలీసులకు యువరాజ్ జరిగిన విషయాలను వివరించాడు. ట్రా. టె. డయల్ చేసి, డిప్యూటీ ఐ. జి. కి., ఐ. జి. కి జరిగిన విషయాలను నివేదించాడు ధర్మజనరావు.

పోలీసులు నక్సలైట్ శవాలను వెలికి తీయటంలో లీనమై

పోయారు.

యువరాజ్, నూరీలు తమ జీప్ నెక్కారు.

జీప్ బయలుదేరింది.

# 8

యువరాజ్ నూరీలున్న జీప్ ఓ గ్రామం చేరుకుంది. ఒక చోట జీపు నాపారు. ఆ వూరి ప్రజలు ఎందుకనో భయ భ్రాంతులై ఇళ్ళల్లోకి జొరబడి తలుపులు మూసుకుంటు న్నారు. ఆ డిటెక్టివ్ లిద్దరికి అంతుపట్టలేదు.

ఆదరాబాదరా ఒకతను పరుగెత్తుతున్నాడు. అతనిని బలా త్కారంతో ఆపాడు.

"విషయం ఏమిటి? మీరెందుకు భయపడుతున్నారు?" అనడిగాడు యువరాజ్.

"నక్సలైట్లు ఎవరి తలనో నరికి మాకందరకు చూపు తున్నారు," అని చెప్పి పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడతను.

డిటెక్టివ్ లు ఒకరి ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు.

ఒక గ్రామంలోకి కారేదైనావస్తే ఆ కారుచుట్టూ ఆ గ్రామ ప్రజలు, పిల్లలు చుట్టుముట్టేస్తారు.

కాని, యువరాజ్ జీప్ వద్దకు యెవరూ రాలేదు. అందు క్కారణం నక్సలైట్లు నరికిన తలను చేతపట్టుకుని అందరికీ చూపుతూ రావడమే!!

"నక్సలైట్లు ఎవరి తలను నరికివుంటారు?" నూరడిగాడు.

"ఏమో? ఏ భూస్వామినో, ఏ అమాయకుణ్ణో చంపి వుంటారు?"

"నరికిన తలను యెందుకు చూపుతున్నారు?"

"భయపెట్టడానికి."

"ఈ గ్రామస్తులు అందుకు భయపడి ఇళ్ళల్లో జొరబడు తున్నారు. నక్సలైట్లు ఈ గ్రామంలోకి ప్రవేశించి వున్నారన్న

మాట."

"అవును. నరికిన తలను పట్టుకుని వీధులగుండా చూపుతూ వస్తున్నారనుకుంటాను. ఈ అదనుని వదలకూడదు. తల పట్టుకుని యెంతమంది నక్సలైట్లు వచ్చినా వదలకూడదు. బంధించి తీరాలి," పళ్ళు పటపట కొరుకుతూ చెప్పాడు యువరాజ్.

సూరి, యువరాజ్ ని భయంగా చూశాడు. "సార్! నక్సలైట్లు వస్తున్నారో, సెర్చ్ లైట్లు వస్తున్నారో?" వనికాడు.

"ఏ లైట్లు అయితే మనకేం. నక్సలైట్లు, సెర్చ్ లైట్లు ఇద్దరూ నేరస్తులే!" పిస్తోళ్ళను సరిచూసుకుంటూ చెప్పాడు యువరాజ్.

జీపు ప్రక్కనే నిలబడివున్నారు. ఏవో అరుపులు వినబడినవి. యువరాజ్ సూరీల గుండెలు గుబగుబలాడిపోతున్నవి.

తోటి మానవుని తలనరికి ప్రజలకు చూపుతున్నారంటే వారి క్రూరత్వం, దుర్మార్గం బోధపడిపోతుంది.

అంతటి దుర్మార్గులను తప్పక బంధించితీరాలి. యువరాజ్ ఆలోచిస్తున్నాడు.

ఆ వీధికొసన సుమారు ఎనిమిదిమందివున్న ఒకగుంపు కనబడింది. తమవైపే తిరిగారు. ఒకడి చేతిలో నరికిన ఒక తల వుంది. ఆ తలను చూడడానికి వళ్ళు జలదరించిపోయింది. ఏవేవో కేకలు వేసుకుంటూ వస్తున్నారు. వాళ్ళ చేతులలో తుపాకులున్నవి.

వాళ్ళు జీప్ కారుని చూసి ఆగారు. పోలీసులనుకుని భయపడివుండాలి. చేతిలోవున్న తలను అతడు క్రింది పెట్టాడు.

"సూరీ! బి కేర్ ఫుల్!"అని హెచ్చరించాడు యువరాజ్.

సూరి తన రెండు పిస్తోళ్ళను రెప్పపాటు కాలంలో చేతులలోకి తెచ్చుకున్నాడు. యువరాజ్ కూడా రెండు

పిస్తోళ్ళు పట్టుకుని నక్సలైట్లవైపు పరుగెత్తాడు.

ఢాం, ఢాం, ఢాం, ఢాం...

నక్సలైట్లు తమ తుపాకీలతో గురిపెట్టారేగానీ, పెట్టేలోపు డిటెక్టివ్‌ల పిస్తోళ్ళు ప్రేలాయి. ఆ ప్రేలుడు శబ్దానికి భయపడిన నక్సలైట్లు భయకంపితులైపోయారు.

యువరాజ్ సూరీలు తమ పిస్తోళ్ళను గాలిలోకి ఢమఢమ పేల్చుతూ ఆ యెనిమిదిమందివైపు ధైర్యంగా సమీపించారు.

ఆ యెనిమిదిమంది బిత్తర చూపులతో వారిరువురిని చూస్తూ క్షణంపాటు నిలబడిపోయారు. వెంటనే తుపాకులను వెనుకకు త్రిప్పుకుని యువరాజ్ సూరీలమీదకు కలియబడ్డారు. అదికనిపెట్టిన యువరాజ్, సూరీలు తమ పిస్తోళ్ళను జేబులో వుంచుకుని తిరగబడ్డారు.

నక్సలైట్లు మోటు మనుషుల్లాగున్నారు. మొరటుతనంతో యువరాజ్ సూరీలను పాతమార్చడానికి పూనుకున్నారు. తుపాకీ పిడుల దెబ్బలు తిన్నప్పటికి ఆ ఎనిమిదిమందిని వదలలేదు.

ఇద్దరు డిటెక్టివ్‌లూ జూడో విద్యలో ఆరితేరినవారు. నక్సలైట్లను అతిచాకచక్యంతో ఎదురుదెబ్బ తీస్తూ ఎనిమిదిమందితో పోరాడుతున్నారు.

ఎలాగైతేనేం, చివరకు నక్సలైట్లను లొంగతీసుకున్నారు. అక్కడున్న తల వికృతంగా దర్శనమిస్తూంది. సూరి జీపు వద్దకు రొప్పుతూ రోజుతూ పరుగెత్తాడు. ట్రా. సె. అందుకుని డి. యస్. పి. కి ఫోన్ చేశాడు.

“నక్సలైట్లు ఎవరి తలనో నరికి- ఆ తలను ప్రజలకు చూపి భయపెట్టుతున్నారు. ఎనిమిదిమందిని బంధించి వున్నాం. తొందరగా పోలీసులను పంపి వాళ్ళను స్వాధీన పరుచుకోండి,” అని చెప్పి ఆ వూరుపేరు చెప్పాడు సూరి.

కళరి విద్యలో మనిషిని యెక్కడ కొట్టితే లొంగుతాడో

యువరాజ్ సూరీలకు తెలుసు. కళరి విద్యను ప్రదర్శించి, నక్సలైట్లను లొంగదీశారు. ఆ నక్సలైట్లు ముక్కుతో మూల్గుతూ క్రింద పడివున్నారు.

ఆ గ్రామీణులు ఒక్కొక్కరుగా బయటకువచ్చి యువరాజ్ సూరీలను, దెబ్బతిన్న నక్సలైట్లను చూశారు.

"ఈ నక్సలైట్ల దురాగతాలు రోజురోజుకు శృతిమించుతున్నవండి. గ్రామీణ జీవితం స్తంభించి పోతూంది. ఈ నక్సలైట్ల మూలంగా మా కందరకు భయోత్పాతం కల్గుతూంది. గ్రామాలమీదపడి దోచుకోవడం, ఎదురెళ్ళిన వారిని చంపడం మహాఘోరంగా వుందండి. క్రూరమైన ఘోర కృత్యాలు నక్సలైట్లు అవలీలగా చేస్తున్నారండి. మేము ఈ అకృత్యాలకు గురై మనోవైకల్యానికి, నిస్పృహాలకు లోనవుతున్నాం," అని యొవరో చెప్పారు.

"నక్సలైట్ల అమానుష కృత్యాలను యెదుర్కోవడానికి గ్రామీణులందరూ ఏకమై గ్రామరక్షణ దళాలను ఏర్పరుచుకోవడం వజ్రకవచంలాటిది," అని సూచించాడు యువరాజ్.

"తప్పక ఏర్పరచుకుంటాం. మా కివేళ రాత్రికి తర్ఫీదివ్వండి," అనడిగా రెవరో.

"అలాగే! గ్రామరక్షణ దళాలు, రామదండు, స్వచ్ఛంద దళాలుగా పోలీసులు కొన్ని గ్రామాలలో శిక్షణ యిస్తున్నారు," అని చెప్పాడు సూరి.

ఆ గ్రామస్థులతో యువరాజ్ సూరీలు నక్సలైట్ల గురించి, మిగతావాటి గురించి పిచ్చాపాటి మాట్లాడుకున్నారు. ఆ గ్రామానికి ఒక పోలీస్ దళం చేరుకుంది.

నక్సలైట్లను అప్పగించారు.

## 9

ఒక మోతుబరి రైతు యింట్లో యువరాజ్ సూరీలు ఆ

రాత్రి భోంచేశారు. గ్రామంలోవున్న యువకులు, వృద్ధులు, పెద్దవారు, వయసు మళ్ళినవారు అందరూ గుంపుగా చేరారు.

వారి నందరిని మూడు భాగాలుగా విభజించాడు యువరాజ్. అందరికి యెలా నడుచుకోవాలో తేలికగా బోధించాడు. యువరాజ్ ఆ గ్రామీణులను కూడా పెట్టుకుని శిక్షణ యివ్వతొడగాడు. అందరూ యువరాజ్‌తో అతి ఉత్సాహంగా పాల్గొన్నారు. ఊరు మాటు మణిగిన సమయమది.

అర్థరాత్రి నక్సలైట్లు గుంపొకటి వచ్చింది.

ఆ గుంపుని చూచిన గ్రామరక్షణ దళంవారు కేకలు వేస్తూ ఆ నక్సలైట్లమీదకు ఉరకలు వేస్తూ పరుగులుతీశారు. వారిలో యువరాజ్ సూరీలు కూడా వున్నారు.

ఆ నక్సలైట్లవద్ద ఆయుధాలు వున్నప్పటికి బెదిరిపోయి గ్రామస్థుల ఐక్యతకు అదురుబెదురులతో పారిపోయారు. అలా —

పారిపోవు నక్సలైట్లను రక్షక దళంవారు తరిమి తరిమి కొట్టారు.

"ఈ విధంగా ఐక్యతతో వుంటే నక్సలైట్లే కాదుగదా ఆ సెర్చ్‌లైట్లు వచ్చినా మిమ్ములను ఏమీ చేయలేరు. మీరంతా ఈరోజే రక్షకదళాన్ని ఏర్పరచుకోవడం, ఇవేళే ఆ నక్సలైట్లు రావడం విచిత్రం! బహుశ నరికిన తలను చూపిన నక్సలైట్లను మీరంతా బంధించి పోలీసులకు అప్పగించివుంటారని, మీమీద పగతీర్చుకోడానికి ఆ నక్సలైట్ల గుంపువచ్చి వుంటుందని నా అనుమానం. మీ మీ జాగ్రత్తలలో మీరుండండి!" అని చెప్పాడు యువరాజ్.

"ఇక మాకు బాధలేదు. భయమూలేదు. ఎప్పుడూ మా యీ దళం అప్రమత్తత కలిగి వుంటుంది. నక్సలైట్ అన్న

వాడు కనబడితే నరికి పాతి పెట్టేస్తాం!" అని ఆవేశాలతో అన్నారు.

వారి ధైర్యోత్సాహాలకు యువరాజ్ తృప్తిగ నవ్వాడు. ఇంకా చెప్పవలసినవన్నీ చెప్పారు యువరాజ్, సూరీలు.

మరుసటిరోజు ఉదయం...

డిటెక్టివ్ లిద్దరూ తమ జీపునెక్కి మరో గ్రామానికి బయలుదేరారు.

"మనం నిన్న ఆ ఎనిమిదిమంది నక్సలైట్లను బంధించి పోలీసులకు అప్పగించిన విషయం నక్సలైట్ల నాయకులు పసి గట్టి వుంటారేమో??" సూరన్నాడు.

"పసిగట్టి వుండొచ్చు. మన జాగ్రత్తలో మనముండాలి," చెప్పాడు యువరాజ్.

"ఈ నక్సలైట్ ఉద్యమాన్ని యెలా మనం అరికట్ట గలం?"

"ఉద్యమ నాయకుల్ని బంధిస్తే చాలు, తగ్గుముఖం పట్టుతుంది."

"ఆ నాయకు లెవరు? మనం తెల్సుకు వేదెలా?"

"నాయకులు ఏ అడవుల్లోనో వుంటున్నారు. వారిజాడ తెల్సుకుని బంధించాలి. ఎంతమంది వున్నారో మనకు తెలియదు. నక్సలైట్లు అనబడేవారు, వేలమంది ఉండొచ్చు. వీరందరకూ నాయకులు ఎందరుంటారో తెలియదు. వీలున్నంత వరకు ప్రయత్నిద్దాం," చెప్పాడు యువరాజ్.

"ఏమో సార్! నా కగమ్యంగావుంది. నక్సలైట్లు ఒకరో యిద్దరో కాదు. వేలమంది అంటున్నారు. అంత మందిని మనం బంధించలేము. ఈఉద్యమాన్ని అరికట్టలేమేమోననిపిస్తూంది."

"అలా నిరుత్సాహపడకు సూరీ! మావో సిద్ధాంత దుష్ప్రచారానికి లోనైన కొందరు కేరళలోకూడా వున్నారు. కేరళ ప్రభుత్వం కనబడ్డ నక్సలైటుని కాల్చివేయమని

ఆర్డర్ జారీచేసివుంది. మన యీ ప్రాంతంలోను పోలీస్ బలగం నక్సలైట్ ఏరివేతలో తీవ్రంగా మునిగివున్నారు. మనలాగ చాలామంది పోలీసులు, అధికారులు కృషిచేస్తున్నారు. తప్పక నక్సలైట్ ఉద్యమం నశించి తీరుతుంది" చెప్పాడు యువ రాజ్.

వారికి ఎదురుగా సుమారు పదిమంది తుపాకులు పట్టుకుని నిలబడి వున్నారు.

వాళ్ళు తుపాకులను తమవైపే ఎక్కుపెట్టుతున్నారు. జీపుకు గురిపెట్టుతున్నారు.

యువరాజ్, నూరీల గుండెలు వేగంగా కొట్టుకుంటున్నవి.

యువరాజ్ అపాయం గుర్తించాడు. నక్సలైట్లను బంధించి పోలీసులకు అప్పగించినందుకు కక్ష తీర్చుకోడానికి నక్సలైట్లు కాపు కాస్తున్నారు. నిర్దాక్షిణ్యంగా చంపేస్తారు.

యువరాజ్ యాక్సిలేటర్ మీదనుండి కాలే తేశాడు.

"నూరీ! ట్రాన్సిస్టర్ అందుకో" చెప్పాడు యువరాజ్. నూరి అందుకున్నాడు.

జీపు ఇంజన్ వేగం తగ్గినా వురుకుతూ వెళ్ళుతోంది. ఆ పదిమంది జీపును తుపాకులతో గురిపెట్టి సిద్ధంగా నిలబడి వున్నారు.

"గెట్ డవున్!" అనరుస్తూ యువరాజ్ జీపులోనుండి క్రిందకు దుమికేశాడు. నూరి డిటో!

ఖాళీ జీప్ వాళ్ళవైపు పరుగులు తీసింది. మీదికొస్తున్న జీపును తమ తుపాకులతో ఢాం, ఢాం అని పేల్చారు. అంతటితో వదలక తమదగ్గరున్న నాటుబాంబులను జీప్ మీదకు విసిరారు.

జీప్ పెట్రోల్ టాంక్ దెబ్బతిన్నది. మంటలు లేచాయి! మండుతూన్న జీప్ ఆగింది.

జీపులో మనుషులు లేరు. అది తెల్సుకున్న నక్సలైట్లు

"వాళ్ళు లేరు. మనలను చూసి దుమికేశారు. పదండి" అనంటూ పరుగెత్తారు.

కొందరు తుపాకులను యెక్కుపెట్టారు. అనుమానమున్న పొదలవైపు గురిపెట్టి ప్రేల్చుతున్నారు. నాటుబాంబులను విసురుతున్నారు.

జీప్ నుండి క్రిందకు గుమికిన యువరాజ్, సూరితో కల్సి పొదలచాటున నక్కుతూ వెళ్ళుతున్నాడు. వెనుక తుపాకులు ప్రేల్చిన చప్పుళ్ళు నాటుబాంబులు ప్రయోగించిన ప్రేలుళ్లు స్పష్టంగా వినబడుతున్నవి.

ఎదురు కాల్పులు జరపాలని ఆ ఇద్దరు డిటెక్టివ్ లకు ఆతృతవుంది. నక్సలైట్లు తుపాకులతో కాల్చడమే గాక నాటు బాంబులను విసురుతున్నారు.

యువరాజ్, సూరీలు పడుతూ లేస్తూ ఆ పొదలలో, చెట్లల్లో వెళ్ళుతున్నారు. హఠాత్తుగా—

ఆ నక్సలైట్లు డిటెక్టివ్ లను చుట్టుముట్టేశారు. అంటే ఆ నక్సలైట్లకు ఆ అడవి ప్రాంతమంతా బాగా పరిచయమైంది. అలవాటైనది. అందుకే నక్సలైట్లు యువరాజ్, సూరీలను అతిత్వరగావచ్చి చుట్టుముట్టగలిగారు.

ఎదురు కాల్పులు జరపవల్సిన దుస్థితి ఏర్పడిపోయింది. యువరాజ్, సూరీల చేతులలోవున్న నాల్గు పిస్తోళ్ళ ఇపుడు పేలుతున్నవి. అదంతా అడవిప్రదేశం. పిస్తోళ్ళ చప్పుళ్ళు, తుపాకుల కాల్పులు, నాటుబాంబుల ప్రేలుళ్ళు ఆ ప్రదేశ మంతటిని భయంకర పరుస్తున్నవి.

యువరాజ్ సూరీలు ఎదురు కాల్పులు కాల్చుతున్నారు. నక్సలైట్లు కాల్చుతున్నారు. ఈ కాల్పులతో డిటెక్టివ్ లు చెరొకవైపు కదిలారు.

యువరాజ్ కు సూరి కనబడడం లేదు. సూరికి యువరాజ్ కనబడడం లేదు.

దట్టంగా పెరిగివున్న చెట్లు. యువరాజ్ కు ఆ అడవిలో యెటెళ్లాలో అంతుపట్టడంలేదు. నక్సలైట్ల బారినుండి బయట పడడానికి ప్రయత్నిస్తున్నాడన్న మాటేగాని ఎటెళ్లాలో అంతుపట్టడంలేదు. యువరాజ్ పిస్తోలుని ప్రేల్చడం మానే శాడు.

ఒక ఇప్పచెట్టు వెనుక నక్కాడు.

యువరాజ్ నక్సలైట్లను తప్పదోవ పట్టించడానికి ఎత్తు వేస్తున్నాడు. కానీ—

హఠాత్తుగ ఆ చెట్టుని ముగ్గురు నక్సలైట్లు చుట్టేశారు.

ఆ ముగ్గురి నక్సలైట్ల చేతులలోను తుపాకులున్నవి. తుపా కులు యువరాజ్ ని తీక్షణంగా చూస్తున్నవి. యువరాజ్ భయపడిపోయాడు.

# 10

సూరి యెగురు కాల్పులు జరుపుతున్నాడు. అటు యిటు చూశాడు. యువరాజ్ కనబడలేదు. ఏమయివుంటాడో వూహించలేకపోయాడు సూరి.

ఒక నక్సలైటు అతిసమీపంలో వుండి తుపాకీని ప్రేల్చు తున్నాడు. సూరి అతనిమీదకు తన రెండు పిస్తోళ్ళను గురి చూసి కాల్చుతున్నాడు. కానీ గుళ్ళు తగలడంలేదు.

సూరికి ఒక యోచన మెరుపులా తోచింది.

తనెలాగైనా అతిచాకచక్యంగా ప్రవర్తించి నక్సలైట్లలో చేరిపోవాలనుకున్నాడు. అలా చేరిపోతే వారి సమాచారమంతా క్షుణ్ణంగా తెల్సిపోతుంది.

నక్సలైట్ చేతిలోని తుపాకీ ఢాం అని ప్రేలింది.

సూరి గావుకేక పెట్టాడు. విరుచుకు పడిపోయాడు. అంతే—

సూరి మరణించాడనుకుని ఆ నక్సలైట్ తుపాకీని ప్రేల్చా

దేసుకుని సూరివద్దకు పరుగెత్తాడు. సూరి చచ్చినవాడిలా పడి వున్నాడు. నక్సలైటు దగ్గరకు రాగానే చివాలున లేచాడు.

అంతే, కొట్టవల్సిన చోట ఊడ్చికొట్టేసాడు. ఆ నక్సలైట్ కిక్కురుమనకుండా పడిపోయాడు.

గబగబ అతని రెండు కాళ్ళను పట్టుకుని గుబురుగావున్న పొదవైపు ఈడ్చుకెళ్లాడు సూరి.

తన వంటిమీది బట్టలను తీసేశాడు. నక్సలైట్ వంటిమీది బట్టలను తీసుకుని ధరించుకున్నాడు. చకచక మూడు నిముషాల్లో సూరి నక్సలైట్‌లా తయారైపోయాడు.

ట్రాన్సిస్టర్ టెలిఫోన్‌ని బయటకు కనబడకుండా దాచుకున్నాడు. తుపాకీని చేతపట్టుకున్నాడు.

కాసేపటికి సూరివద్దకు నలుగురు నక్సలైట్లు చేరుకున్నారు.

“ఒకడు చచ్చాడు. వీణ్ణి అడవి జంతువులకు వదిలేసి వెళ్ళుదాం, పదండి” అనన్నాడు సూరి.

“ఇంకొకడు?” అడిగారు.

“అతన్ని మనవాళ్ళు మట్టుపెట్టివుంటారు,” అనన్నాడు సూరి.

“సరి. రండి వెళ్ళుదాం. వీరిద్దరు డిటెక్టివ్‌లట! వీళ్ళ మూలంగానే నిన్న ఎనిమిదిమంది మనోళ్లు పట్టుబడిపోయారు. వీరిద్దరిని చంపిరమ్మని మనదొర ఆజ్ఞ,” చెప్పాడొకడు.

“వీరిద్దరినీ చంపితే ఎలా? పోలీసులు బోచ్చెడు మంది మనకోసం గాలిస్తున్నారుగా?” అడిగాడు సూరి అయోమయం నటిస్తూ.

“పోలీసుల సంగతి వేరు. డిటెక్టివ్‌ల సంగతి వేరు. అందుకే చంపెయ్యమని దొర ఆజ్ఞ,” అనన్నాడతను.

సూరి మరేమీ మాట్లాడలేదు. వాళ్ళతో అలవాటైన వ్యక్తిలా నడుస్తున్నాడు.

# 11

యువరాజ్ గుడ్లప్పగించి చూస్తూవున్న వాడల్లా, తన పిస్తోళ్ళను బయటకుతీసి ఢాం, ఢాం, ఢాం అని పేల్చాడు. ఆ ముగ్గురు అరుస్తూ క్రిందకొరిగిపోయారు.

యువరాజ్ అటు యిటు చూశాడు. ఎక్కడా పిస్తోళ్ళ చప్పుడో, తుపాకుల ప్రేలుళ్ళో వినబడలేదు.

సూరి ఏమయివుంటాడు? నక్సలైట్ల చేతిలో చిక్కుబడి వుంటాడా?

యువరాజ్‌కు ఆదుర్దా ఎక్కువయింది. గబగబ ఆ అడవిలో అటు యిటు పరుగెత్తాడు. సూరి జాడలు కనబడలేదు.

యువరాజ్ అలా వెదికేటపుడు ఒక నక్సలైట్ పడి వుండడం గోచరించింది. ఆ నక్సలైట్‌కు సూరి బట్టలుండడం గమనించాడు యువరాజ్. అతడికి పూర్తిగా బోధపడి పోయింది.

సూరి నక్సలైట్ల వేషంలో, వారి దళంలో జొరబడి వున్నాడు. సూరి ఒకమంచి అవకాశాన్ని ఉపయోగించు కున్నందుకు యువరాజ్ గర్వపడ్డాడు.

యువరాజ్ ఒక గ్రామం చేరుకున్నాడు.

ఆ గ్రామంలో జనసంచారమే లేదు. నిశ్శబ్దంగా వుంది.

ఆధునికంగా కట్టబడివున్న ఒక ఇంట్లోకి అడుగుపెట్టాడు. తలుపులు కిటికీలు మూసివున్నవి.

యువరాజ్ తలుపు తట్టాడు. ఎవరూ అన్న కేక వినబడింది.

"తలుపు తెరవండి. చెప్తాను," అన్నాడు యువరాజ్.

ప్రక్కనున్న కిటికీ తెరుచుకుంది. యువరాజ్‌ని చూచిన యింటివారు, తలుపులు తెరిచారు.

"ఎందుకు మీరింత భయపడి తలుపులు మూసుకున్నారు?"

అనడిగాడు యువరాజ్.

"నక్సలైట్లు మా గ్రామంమీద దాడిచేస్తారని ఎవరో వార్త తెచ్చారు. అందుకే భయపడి చస్తున్నాం" అని చెప్పాడు ఆ యింటాయన.

యువరాజ్ కు బోధపడిపోయింది. "నక్సలైట్లు దాడిచేస్తారని ఇలా భయపడితే ఎలాగండి? రామదండునో, గ్రామ రక్షణ దళాన్నో మీకై మీరే నెలకొల్పుకొని నక్సలైట్లను యెదురుదెబ్బ తీయాలి," అని చెప్పాడు యువరాజ్.

"మా గ్రామంలో ఐకమత్యం లేదండి. ఎవడెటుపోతే మనకేం. అన్న నిర్లక్ష్యభావంతో వుంటారండి. అందరూ ఏకమై నిలబడితే నక్సలైట్లు అణుబాంబులతో దాడిచేసినా తిప్పికొట్టగలం. మాలో ఏకత్వంలేదు," బాధగా చెప్పాడాయన.

"మీరంతా కల్సి అలుసు ఇవ్వబట్టే నక్సలైట్ వుద్యమం విజృంభిస్తూంది. పోలీస్ అదనపు దళాన్ని ప్రభుత్వం నియమించి వుంది. మీరు భయపడకండి. మీ సహాకారమూ వుండాలి. ఒక్క ప్రభుత్వమే చేయగల కార్యంకాదు," చెప్పాడు యువరాజ్.

"ఇంతకీ మీరెవరండి?"

"ప్రయివేట్ డిటెక్టివ్ నండి. నక్సలైట్ల ఆచూకీ తీయడానికి ప్రయత్నిస్తున్నాను."

ఆ యింట్లో యువరాజ్ కు అతిధి మర్యాదలు జరిగినవి. విశ్రాంతి తీసుకుందామని ఒక నులక మంచంమీద అలా పడుకున్నాడో లేదో ఒక నక్సలైట్ ముఠా ఆ యింట్లోకి జొరబడింది.

ఆ ముఠాలో యెందరున్నారో వూహించేలోపే యువరాజ్ ని విరిచి కట్టేశారు. ఒక స్తంభానికి విరగతీసి కట్టేశారు. ఆ నక్సలైట్లు కేకలేస్తూ దుర్భాషలాడుతున్నారు.

యువరాజ్ తననితానే నిందించుకున్నాడు. తను మెళు కువతో ఉండివుండవల్సింది.

ఇపుడు ఆ నక్సలైట్లు ఏంచేస్తారు? తనని చంపుతారా? యువరాజ్ దిగ్భ్రాంతుడై, భీతావహుడై చూస్తున్నాడు.

నక్సలైట్లు ఆ ఇంట్లో స్త్రీలను, పక్కిళ్ళ స్త్రీలను బడబడ ఈడ్చుకొచ్చి స్తంభాలకు విరిచి కట్టేస్తున్నారు. ఆ స్త్రీలు గోలగా అరిచేస్తున్నారు. వాళ్ళ అరుపులు అతిదీనంగా వున్నై!

## 12

సూరి నక్సలైట్లలో కలసి ఒక స్థావరం చేరుకున్నాడు.

ఆ స్థావరం అతిరహస్య ప్రదేశంలో వుంది. అక్కడ యింకా చాలామంది వున్నారు.

వీళ్ళను చూచి.చూడగానే ఆతృతతో ఎదురొచ్చారు.

సూరి గుండెలు వేగంగా కొట్టుకుంటున్నవి. అక్కడి వాతావరణం సూరిని భయభ్రాంతుణ్ణి చేస్తూంది.

"ఒకడు చచ్చాడు. మరొకడు చావు బ్రతుకుల్లో వున్నాడు. జీపుని తగులబెట్టేశాం," అని చెప్పాడు.

"సరి మీరు తొందరగా కూడు తినండి," చెప్పాడతను.

అందరూ అటువైపు వెళ్ళారు. అక్కడ పొయ్యిలు, వంట పాత్రలున్నవి. ఒకచోట కూర్చున్నారు. ఎవరో వడ్డిస్తున్నారు. సూరి అందరితో బాటు కూర్చుని మౌనంగా వడ్డించింది తినేశాడు.

ఆ స్థావరంలోవున్న నక్సలైట్లందరూ యెక్కడికో వెళ్ళ డానికి ఆయత్తమవుతున్నారు. సూరికి ఆతృత ఎక్కువయింది. ఈ అదనుని ఉపయోగించుకోవాలి.

వీళ్ళేవూరుమీదకు వెళ్ళుతున్నారు? ఆ వూరికి దగ్గరలో పోలీస్ బలగం వుంటుందా? వుండదు. పోలీస్ వుంటే నక్స

లెట్లు వెళ్ళరని తెల్సు. పోలీసులుండని గ్రామం మీదకు దాడీ చేయబోతారు. ఏ గ్రామం? తనెలా పోలీసులకు తెలియ పరచడం?

అందరూ ఏకమై తుపాకులు, నాటుబాంబులు, కొందరు విల్లంబులు తీసుకున్నారు. ఆశ్చర్యం మేమిటంటే ఆ దళంలో స్త్రీలూ వున్నారు. వారందరు ఇద్దరు నాయకులచే నడప బడుతున్నారని సూరి గ్రహించాడు.

అరణ్య ప్రాంతమది. గంభీరంగావుంది. గుండెలు గుబగుబ లాడిపోతున్నవి.

సూరికూడా తుపాకీ, నాటుబాంబులు భద్రపరుచు కున్నాడు. అందరితో బాటు నిలబడ్డాడు. అందరూ బయలు దేరారు.

ఎదురుగా మసక వెలుతురులో ఒక గ్రామం కనబడు తూంది. అంతకూ ఏకంగా ఆ గ్రామంమీద పడ్డారు.

ఒక యింటి తలుపులను దభేల్ దభేల్ మని బాదడం, తెరవడం నిముషంలో జరిగిపోయింది.

ఆ యింటి వాతావరణంచూస్తే ఆ యింటతను అతి బీద వాడని తెలుస్తూంది. ఆ బీదవాని యింట్లో ఏముంటుంది? ఆ యింట్లోవున్న కొద్దిపాటి ధాన్యం, అయిదారు రూపాయలు, కొన్ని చిరిగిన బట్టలు నక్సలైట్లు చేపట్టుకున్నారు.

ఆ యింటి యజమాని తన దగ్గరున్న ఆ కొద్ది మోతాదు ధాన్యాన్ని తస్కరించుకు పోవడంగాంచి బిగ్గరగా వెర్రి రుపు అరుస్తూ-తల ప్రేళ్ళాడేసేశాడు.

అతడు గుండెపగిలి చనిపోయాడని వెంటనే సూరి గ్రహించుకున్నాడు. అతని మనసు చివుక్కుమంది.

కూడావుంటూ ఆ అమానుషకృత్యం తిలకిస్తూన్న సూరి కంటికొలకులలోనుంచి అప్రయత్నంగా కన్నీటిబొట్లు రాలాయి. అంతటితో ఆ దండు అగక మరోవైపు పరు

గాత్తారు.

ఒకచోట ఆగారు. సూరి చూశాడు. అక్కడొక చిన్న బోర్డువుంది. అదొక మెడికల్ షాప్. ఆ షాపు తాళాలు పగులగొట్టి కొల్లగొట్టుకుంటున్నారు.

సూరి ఉద్రేకానికిలోనై ఆగలేకపోయాడు. ఒక సందులోకి తప్పుకున్నాడు. గబగబ డయల్ చేశాడు.

అటువైపునుండి గొంతు వినబడగానే ఆ వూరిలో జరుగు అక్రమాలను గబగబ చెప్పాడు. మెడికల్ షాప్ బోర్డు మీదున్న వూరుపేరు చెప్పాడు. ఆ నక్సలైట్లు వుంటున్న స్థావరాన్ని గురించి తనకు తెల్సిన విషయాలను క్షుణ్ణంగా వివరించాడు. చెప్పవలసినవన్నీ చెప్పి యిటు తిరిగాడు.

అంతే, యిద్దరు నక్సలైట్లు తుపాకులు గురిపెట్టి నిలబడి ఉన్నారు.

సూరి గుండెలు గుభేలుమన్నవి. వాళ్ళకు విషయం తెల్సిపోయింది. ఆ యిద్దరూ మిగతా వారికి చెప్పవచ్చు. తనగుట్టు బయటపడిపోతుంది.

సూరి భయపడుతూ వాళ్ళను చూశాడు.

"ఎవరు నువ్వు?" ఒకడడిగాడు.

సూరి జవాబు చెప్పలేదు.

హఠాత్తుగా తన రెండుచేతులతో ఆ తుపాకీ గొట్టాలను పైకి నెట్టేస్తూ, ఎగిరి తన రెండు కాళ్ళతో ఆ యిరువురి డొక్కలమీద తన్నాడు. ఆ ఎదురుచూడని సంఘటనకు వారిద్దరూ ఆదరా బాదరా పైకి లేవబోయారు.

సూరి తన బలాన్నుపయోగించి కొట్టవలసినచోట కొట్టి వదిలిపెట్టాడు. ఆ ఇద్దరూ కిక్కురుమనకుండా పడిపోయారు.

సూరి ఆ సందులోనుండి బయటకు వచ్చాడు.

అక్కడ నక్సలైట్ల శవాలు నాల్గు క్రిందపడివున్నవి. వారిని చుట్టుముట్టి మెషిన్ గన్‌లతో ముగ్గురు యువకులు

భయపెట్టుతున్నారు. నక్సలైట్లు అదిరిపడిపోయి వాళ్ళను అదురు బెదురులతో చూస్తున్నారు.

ఆ యువకులు సెర్చిలైట్లు ఉండాలని సూరి వూహించాడు. అక్కడ కెళ్ళడం అవివేకమని సూరి అలాగే నిలబడిపోయాడు.

ఆ సెర్చిలైట్లు తనని చంపినా చంపేయవచ్చు. వాళ్ళ చేతులలో మిషిన్ గన్‌లున్నవి. సూరి వెనుకకు తగ్గాడు.

సెర్చిలయిట్లు, నక్సలయిట్లు గుంపులోనుండి యిద్దరిని బయటకులాగి ఈడ్చుకెళ్ళుతున్నారు. ఆ యిద్దరు నక్సలయిట్ల నాయకులు అని సూరికి యిట్టే తెల్సిపోయింది.

సెర్చిలయిట్లు, నాయకులను ఏంచేసుకుంటారు? చంపుతారా? మరేం చేస్తారు? సూరికి అంతుపట్టలేదు.

సెర్చిలయిట్లు అటెళ్ళగానే సూరి, మిగతా నక్సలయిట్లు అడవులవైపు పరుగుతీశారు.

సాగరం చేరుకున్నారు. అక్కడ అందరూ, చనిపోయిన నక్సలయిట్ల గురించి, తమ నాయకుల గురించి ఏదేదో మాట్లాడుకున్నారు. ఏంచేయాలో వాళ్ళకే అంతుపట్టలేదు. ఆ తరువాత ఏంచేయాలో సూరికికూడా అయోమయంగా వుంది.

సెర్చిలైట్లు గురించి, నాయకులను గురించి మాట్లాడుకుంటూ నిద్రలో పడిపోయారు. సూరి వాళ్ళతో బాటే నిద్రపోయాడు.

తెల్లవారింది. ఆశ్చర్యం—

ఆ సాగరాన్ని పోలీసులు చుట్టుముట్టి వుండడం గమనించారు. అంతే, ఎవరికి వాళ్ళు తుపాకులను, నాటుబాంబులను, విల్లంబులను అందుకుని పోలీసులమీద తిరగబడ్డారు.

నక్సలైట్లకు పోలీసులకు కాల్పులు ప్రారంభమయినాయి. పోలీసుల రైఫిళ్ళకు ఇద్దరు నక్సలయిట్లు హతులయి

నారు. కొంతమంది గాయపడ్డారు.

నూరి మనస్సు సంతోషంతో గెంతింది. ఎందుకంటె తను ట్రాన్సిస్టర్ టెలిఫోన్‌లో చెప్పినట్లు పోలీసులు కను గొని అంతతొందరలోవచ్చి ఆ స్థావరాన్ని ముట్టడించి నందుకు...!

# 13

స్తంభాలకు విరిచి కట్టబడిన స్త్రీల కెదురుగా నక్స లయిట్లు నిలబడి వున్నారు. నానాదుర్భాష లాడుతున్నారు. నోటికొచ్చినట్టు వాగుతున్నారు. వారి మాటలను యువ రాజ్ వినలేకపోతున్నాడు.

మానవజన్మ అన్ని జన్మలలోను ఉత్తమమైనదని మాన వుడే అంటాడు. అటువంటి మానవుడు ఎందుకింత అధోగతి పాలవుతున్నాడు?

యువరాజ్ ముందుకు ఒకతను వచ్చాడు. "ఏమోయ్! నువ్వు పెద్ద డిటెక్టివ్‌వా? నక్సలయిట్లను బంధించడానికి మీ తాతలు, జేజమ్మలు లేచిరావాలి. హంతకులకు, దొంగ లకు, దుర్మార్గులకు, దోపిడీగాళ్ళకు మించిన వాళ్ళం మేము. మాకు ఎదురేలేదు. చూడు మా తడాఖా!" అని గర్జించా డతను.

యువరాజ్, అతనిని వురిమిచూశాడు.

కొందరు నక్సలయిట్లు—కొందరు పురుషులను ఈడ్చు కొచ్చారు. ఆ పురుషులను స్తంభాలకు కట్టబడివున్న స్త్రీల కెదురుగా నిలబెట్టారు.

వాళ్ళను చూడగానే ఆ స్త్రీలకు భర్తలయి వుండాలని యువరాజ్ అనుకున్నాడు. కొందరు వృద్ధులున్నారు. వాళ్ళు ఆ స్త్రీలకు తండ్రులయి వుండాలని వూహించాడు.

ఆ పురుషులు భయభ్రాంతులై అయోమయులై నిలబడి

వున్నారు. ఇద్దరు నక్సలైట్లు రెండు కత్తులను చేతపట్టుకుని వచ్చారు.

యువరాజ్ గుండెలు ధమధమలాడుతున్నాయి.

కట్టివేయబడివున్న స్త్రీలు గావుకేకలు, వెర్రరుపులు అరుస్తున్నారు. ఆ ప్రదేశమంతా ఆ అరుపులతో భీకరంగా వుంది.

స్త్రీల కెదురుగా నిలబెట్టిన వ్యక్తులను పొడుస్తూ, కుమ్ముతూ దూషిస్తున్నారు.

ఒక నక్సలైట్ కత్తితో ఒకవ్యక్తి తల కసుక్కున నరికేశాడు. ఆ దృశ్యాన్ని యువరాజ్ చూళ్ళేకపోయాడు.

బలి అనేది చదివి వున్నాడు. కానీ యువరాజ్ ఎప్పుడూ బలి యివ్వడాన్ని ప్రత్యక్షంగా చూచివుండలేదు. ఇపుడు కళ్లారా నరబలిని తిలకించాడు. యువరాజ్ మనసు బాధతో విలవిల్లాడిపోయింది.

తల తెగి క్రిందపడడం తిలకించిన స్త్రీలు గగ్గోలుపెట్టుతూ అరిచేస్తున్నారు. కొందరు స్పృహ కోల్పోయారు. ఆ స్త్రీల కెదురుగా నిలబెట్టిన వ్యక్తులను-నక్సలైట్లు తమ కత్తులతో కసుక్, కసుక్కున నరికేశారు. యువరాజ్ ఆ దృశ్యాన్ని చూడలేక బాధతో కళ్ళుమూసుకున్నాడు.

క్రిందపడ్డ తలలు, మొండాలు వికృతంగా, అతిభయానకంగా, భీభత్సంగా వున్నవి. రక్తం ఎగజిమ్మబడి కారుతూంది. ఆ నక్సలైట్లు ఆ కేకలతో పడిపడి నవ్వుతున్నారు.

ఎవరో నలుగురు వచ్చారు. ఆ నలుగురను చూచిన నక్సలైట్లు తప్పుకున్నారు. అంటే ఆ నలుగురు నక్సలైట్లకు నాయకులై వుండాలని యువరాజ్ తలపోశాడు.

తెగి పడివున్న తలలను, మొండాలను చూస్తూ తృప్తిగా నవ్వారు. ఆ స్త్రీల కెదురుగా నిలబడ్డారు. ఆ స్త్రీల మెడలలో వున్న మంగళసూత్రాలను పుటుక్, పుటుక్కున తెంపు

కున్నారు.

అది చూస్తున్న యువరాజ్ కోపంతో, రౌద్రావేశంతో వూగిపోయాడు. యువరాజ్ ఆ సమయంలో బంధితుడై వుండకపోతే ఆ నక్సలైటల్లో ఒక్కడూ తిరిగివెళ్ళి వుండే వాడుకాదు. తన బలం, తన విద్యలు, తన ప్రవీణతను వుపయోగించి ఎదురుదెబ్బతీసి వుండేవాడు.

అంతలో, అక్కడకు ముగ్గురు యువకులు ప్రవేశించారు. వారి చేతులలో మిషిన్‌గన్‌లున్నవి. ధమధమ పేల్చారు. నక్సలైట్లు నలుగురు అరుస్తూ క్రింద పడిపోయారు. క్రింద పడ్డ నక్సలైట్లు అరుస్తూ రక్తపు మడుగులో గిజగిజ తన్నుకుంటూ మరణించారు.

ఆ యువకులను అందరూ ఆశ్చర్యంగా చూశారు. నాయకులు వుగ్రులై వారిమీదకు ఎగబడ్డారు. మిషిన్‌గన్‌లు మళ్ళీ పేలాయి. నాయకుల కాళ్ళల్లో గుళ్ళు దూసుకు వెళ్ళాయి. అరుస్తూ కుప్పగా పడ్డారు. 'ఎవరు మీరు?'' అని గర్జించి అడిగారు వారిని.

''నక్సలైటలను దెబ్బతీసే సెర్చ్‌లైటల్లం!! ఉఁ కమాన్! మీరు దోచుకున్న సొమ్ము యిటుపడెయ్యండి. లేనిచో మీ ప్రాణాలు మీకు దక్కవు. మీరే దుర్మార్గులని, ధైర్యసాహసవంతులని, తెగించిన వాళ్ళమని విర్రవీగకండి. అంతకుమించిన వాళ్ళం. నక్సలైటలను సమూలంగా నిర్మూలించడానికి అవతారమెత్తిన యువకులం. సెర్చ్‌లైటల్లం!!'' అని చెప్పాడొక యువకుడు.

యువరాజ్ వాళ్ళను విచిత్రంగా చూశాడు. ఒక ఘోర దృశ్యం కళ్ళముందే వుంది. దానికిమించిన ఘోరం జరుగుతూ వుంది. తన కళ్ళను తనే నమ్మలేకపోతున్నాడు.

అక్కడి దృశ్యాలను తెగిన తలలు, మొండాలు, కట్టివేయబడిన స్త్రీలను చూచిన సెర్చ్‌లైట్లు వుగ్రులైపోయారు.

అక్కడున్న నక్సలైట్లను తమ కత్తులతో నరికి పేగులను బయటకు తీశారు. కాళ్ళు చేతులను ముక్కముక్కలుగా నరికి ఆ ముక్కలతో ఆ నాయకులను చావబడా కొట్టేశారు. ఆ నాయకులు సెర్చ్‌లైట్లను చూసి గడగడలాడిపోయారు.

అంతటితో వదలక ఆ నాయకులను లేవదీసుకున్నారు. ఒక నాయకుని అరిచేయి నరికేశారు. ఒకరికాలు, ఒకరిచేయి యిలా అవయవాలను వేరుచేసిన పిదప సెర్చ్‌లైట్లు వారిని ఎటో యీడ్చుకెళ్లారు.

యువరాజ్‌లో చలనంలేదు. ఒకటి దుర్మార్గమనుకుంటే, దానికి మించిన దుర్మార్గం మరొకటి కళ్లారా చూశాడు.

# 14

పోలీసుల కాల్పులనుండి తప్పించుకుంటూ నక్కివున్నాడు సూరి. అటువంటి సమయంలో—

"ఒరేయ్, మనమిక్కడనుండి పారిపోదాం. జోగారావు నాయకత్వం క్రిందున్న దళంలోకెళ్ళి చేరుదాం." అన్న మాటలు వినబడ్డవి. అటుతిరిగి చూశాడు. ఒక వ్యక్తి అదురు బెదురులతో అటు వచ్చాడు.

"అలాగే, యిపుడిక్కడనుండి తప్పించుకునేదెలా?" సూరడిగాడు.

"నేను చెప్తాను. నాతోరా," అన్నాడతను.

ఆ స్థావరాన్ని పోలీసులు ఎలాగూ వశపరచుకుంటారని సూరికి తెలుసు. అక్కడినుండి, అతనితో వెళ్ళితే మరో స్థావరం తను తెలుసుకోవచ్చు. ఆ స్థావరాన్ని పోలీసులకు అప్పగించవచ్చు అనుకున్నాడు సూరి.

పోలీసుల రైఫిళ్ళు జివ్, జివ్‌మని మ్రోగుతున్నవి.

సూరి అతనితో కలిసి అడవివైపు పరుగులుతీశాడు. అలా వెళ్ళివెళ్ళి జోగారావు స్థావరాన్ని సమీపించారు.

"నీ కివన్నీ ఎలా తెల్సు?" అడగాడు సూరి.

"ఈ రోశెయ్య సంగతి నీకు తెలియదా? ఈ అడవులలో, కొండ ప్రాంతాలలోవున్న నక్సలైట్ల స్థావరాలన్ని నాకు బాగా తెల్సు" అని చెప్పాడతను.

అతని పేరు రోసయ్యాని సూరి తెల్సుకున్నాడు. నక్సలైట్ల స్థావరాలన్నీ తెలిస్తే-అతన్ని మంచి చేసుకుంటే అన్ని బయట పడతాయి. అతనినుండి ఎలా చెప్పించుకోవడం? సూరి ఆలోచిస్తున్నాడు. ఇంతలో—.

జోగారావు నాయకత్వం క్రిందున్న స్థావరం వచ్చింది. వాళ్ళ పద్ధతుల ప్రకారం రోశెయ్య ముందెళ్లాడు. వెనుకనే సూరి వెళ్ళాడు.

"నాపేరు రోశెయ్య!..." అనంటూ రోశెయ్య జరిగిన దంతా జోగారావుకు విన్నవించాడు.

"ఆ సెర్చిలైట్లు ఎవరు? మనకు మించినవాడు పుట్టడం అసంభవం! పోలీసులనుండి తప్పించుకుని మీరు వచ్చినందుకు చాలా సంతోషం!" అనంటూ జోగారావు మెప్పు కురిపించాడు. రోశెయ్య, సూరీలు తబ్బిబ్బైపోయారు.

రోశెయ్య సూరీలు ఆ దళంలోని వ్యక్తులతో కలిసి పోయారు. సూరి ఆ స్థావరాన్ని యెలా తెలియజేయాలో ఆలోచిస్తున్నాడు. సూరి, రోసయ్యాను అంటి పెట్టుకునే వున్నాడు.

అన్నపానాదులు ముగిశాయి. చీకటి దట్టంగా అలుము కుంది. అటువంటి సమయంలో ఒకతను అక్కడకు ప్రవేశించాడు.

జోగారావు, "ఏమయింది?" అని ప్రశ్నించాడు.

"పరంధామయ్య మనకు సరుకులు యివ్వనన్నాడు" అని నసుగుతూ చెప్పాడు.

"ఎందుకు?" అని గర్జించి అడిగాడు జోగారావు.

"డబ్బులు యివ్వనిదే యివ్వనని చెప్పాడు."

"ఎంత పొగరు? మన తడాఖా తెలియదు కాబోలు," అంటూ జోగారావు లేచాడు.

జోగారావు గట్టిగ కేకలు పెట్టాడు. అందరూ తుపాకులు నాటుబాంబులు అందుకున్నారు. బయలుదేరారు.

ఈ నక్సలయిట్లకు అవసరమగు వస్తుసామగ్రిని ఎవరో వర్తకుడు అందిస్తున్నాడు. అతనెందుకో యివ్వలేదు. అతని పని పట్టించడానికి అందరూ బయలుదేరారు.

ఆ ముఠా ఒక గ్రామంలోకి జొరబడింది. ఆ వర్తకుని యింటిమీదికి దాడిచేసింది. ఆ వర్తకుడు భయపడిపోయి హాహాకారాలు చేసేశాడు.

"మాకు సరుకులు అందిస్తూ యివ్వనంటావా?! ఇవ్వనంటే శిక్ష ఏమిటో తెల్సా?" అనంటూ ఆ వర్తకుని తలనరికేశారు.

ఆ తలను వాకిట్లో వ్రేళ్ళాడకట్టారు. ఆ యింట్లో వున్న సరుకులను మూటకట్టుకుని బయలుదేరారు. సూరి నిర్జీవిగా వుండిపోయాడు. అంతమందిలో తనొక్కడు ఏమీ చేయలేడు.

ట్రాన్సిస్టర్ టెలిఫోన్ డయల్ చేసి పోలీసులకు తెలియజేయడానికి సతమతమవుతున్నాడు. నక్సలయిట్లు అందరూ ముందువెళ్ళుతున్నారు. సూరి మెల్లగా వెనుకకు తగ్గాడు. గబగబ డయిల్ చేశాడు. స్థావరం గురించిన ఆచూకీ, జరిగిన విశేషాలను ఆత్రుతగా చెప్తున్నాడు.

అంతలో, నాటుబాంబులు ప్రేలిన చప్పుడు, మిషన్‌గన్ మోత వినబడింది. సూరి గడగడలాడిపోయాడు.

ఎవరో ముందువెళ్తున్న నక్సలయిట్లను చుట్టుముట్టారు. ఎవరు? సెర్చ్‌లయిట్లా? పోలీసులా? అంతుపట్టలేదు. సూరి అయోమయంగా నిలబడి వుండిపోయాడు.

ఈ నక్సలయిట్లు ఎదురు కాల్పులు చేయలేకపోయారు. అదను చిక్కిన కొందరు పలాయనం చిత్తగించారు.

సెర్చిలయిట్లు జోగారావుని బంధించడం సూరి చూశాడు. అంతే, సూరి పరుగు లంఘించాడు. సూరి పరుగెత్తుతున్నప్పుడు రోసెయ్య కల్సాడు. సూరి రోశయ్యలు కల్సి అడవిలోకి దూరి మాయమైపోయారు.

"సెర్చిలయిట్లు మననాయకులను పట్టుకెళ్ళిపోయారు. మన మక్కడకు వెళ్ళడం శ్రేయస్కరంకాదు. గనక మరో రహస్య స్థావరానికి వెళ్ళుదాం!" అని చెప్పాడు రోశయ్య.

"అలాగే" అన్నాడు సూరి.

ఆ రాత్రిలో ఆ అడవిలో సూరి భయపడిపోతున్నాడు. పాములుండవచ్చు. మరేవైన విషజీవులు కాటువేయవచ్చు. సూరి అతిజాగ్రత్తగా నడుస్తున్నాడు.

మానవుడు ఇల్లు వాకిలి ఏర్పరచుకుని జీవిస్తుంటే, నక్సలయిట్లు మృగాల్లాగా అడవిలో సంచరిస్తున్నారు. మృగాలు తమ ఆహారానికి వేటాడుతవి. ఆ వేటలో ఆ జంతువులు తమ సంతతిని వేటాడవు. ఇతర జంతువులను వేటాడి భక్షిస్తాయి.

కానీ నక్సలయిట్లు తోటిమానవులను చంపేస్తున్నారు. ఏమిటీ వైపరీత్యం? ఆలోచిస్తూ సూరి, రోశయ్య వెనకాలే నడుస్తున్నాడు.

తెల్లవారబోతూంది.

సూరికి మెరుపులా ఒక యోచన తట్టింది.

రోశయ్యను తను బంధిస్తే నక్సలయిట్ల స్థావరాలు గురించి తెల్సుకోవచ్చు. పోలీసులకు అప్పగిస్తే అతడి మూలంగా ఆచూకీ తెలియవచ్చు.

సూరి గురిచూసి త్రుటికాలంలో రోశయ్యను కొట్టవల్సిన చోట కొట్టేశాడు. పాపం రోశయ్య కిక్కురుమనకుండా

దొర్లి పడిపోయాడు.

నూరి అదరాబాదరా దాచుకున్న ట్రాన్సిస్టర్ టెలీ ఫోన్ ని బయటకు తీశాడు.

# 15

"నక్సలయిట్లు అఖండులు. వాళ్ళజోలికి పోకూడదు" అనంటూ యెవరో యువరాజ్ కట్లు విప్పారు.

క్రిందపడివున్న తలలేని మొండెములు, స్త్రీల రోదనలు, సహించలేకపోయాడు యువరాజ్. ఆ ప్రదేశంలో అంత ఘోరకృత్యం జరిగినా ఆ గ్రామప్రజలు ఒక్కరూ రాలేదు. భీతిచే యెవరూ రాలేకపోయారు.

యువరాజ్ కు ఏంచేయాలో తోచక ఆ యింటినుండి బయటకువచ్చాడు. నక్సలయిట్లు, సెర్బిలయిట్లు వీరు ఒకరిని మించిన దుర్మార్గులు ఒకరు.

గ్రామవీధులలో ఎవరూ కనబడలేదు. మెల్లగా నడిచాడు. తన కళ్ళముందు జరిగిన దారుణాన్ని తలుచుకుని కుమిలిపోయాడు.

ఎవరో ఒకతను సిగరెట్ తాగుతూ తాపీగా వస్తున్నాడు. అతనికి యువరాజ్ ఎదురెళ్ళాడు.

"నక్సలయిట్లు అమానుషంగా, ఘోరంగా హింసాకాండ సాగించారు. ప్రక్కవూరికెళ్ళి పోలీసులకు ఫిర్యాదు చేయగలరా?" అనడిగాడు.

"నాకెందుకు? అసలు మనకెందుకు? ఎవడెటుపోతే మనకేమిటంట. నక్సలయిట్లు అతిదుర్మార్గులు," అనంటూ వెళ్ళబోయాడు. అతనిని నమిలి మింగేయాలన్నంత కోపంతో వూగిపోయాడు యువరాజ్. సమాళించుకున్నాడు.

"మీరెళ్ళకపోతే–ఎటు వెళ్ళాలో దారైనా చెప్పండి" అనడిగాడు యువరాజ్.

"నాకు తెలియదు ఫో," అని చీదరించుకుంటూ అతనూ వెళ్ళిపోతున్నాడు. యువరాజ్ కు ఎందుకనో అనుమాన మేసింది. ఎవరతను? ఎందుకిలా ప్రవర్తించుతున్నాడు?

ఆ యువకుని అటు వెళ్ళనిచ్చి—యువరాజ్ వెంట బడ్డాడు. ఆ గ్రామవీధులు నిర్మానుష్యంగా వున్నవి. కొన్ని కుక్కలు భీకరంగా యేడుస్తున్నవి.

ఆ యువకుడు ఒక యింట్లో కెళ్ళాడు. యువరాజ్ తచ్చాడుతూ ఆ యింటి గుమ్మంవద్ద నిలబడ్డాడు. ఆశ్చర్యం!—

ఆ యువకుడు చేతిలో తుపాకీ పట్టుకు నిలబడివున్నాడు.

"ఎవరు నువ్వు?" గర్జించాడు యువరాజ్.

"అదే ప్రశ్న నేను నిన్నడుగుతున్నాను. ఎవరు నువ్వు? నా వెంటబడి యింటికి ఎందుకొచ్చావు?"

యువరాజ్ మనసు ఉరకలువేసింది. అతనికి నక్సలైట్లకి సంబంధముండితీరాలి.

"నేను నేను..." అనన్నాడేగాని యువరాజ్ ఏదో చెప్పినట్టు నటిస్తూ ఒక్క ఉరుకులో అతని కాళ్ళ మీద బోర్లా పడిపోయాడు. తుపాకీ పేలింది.

గుండు గుమ్మంగుండా వీధివైపు దూసుకెళ్ళింది.

యువరాజ్ అతని కాళ్ళను పట్టుకుని ఒక్కలాగు లాగాడు. అతడు దభేలున పడ్డాడు.

"ఎవరు నువ్వు? నీకు నక్సలయిట్లకు సంబంధ మేమిటి? నన్నెందుకు చంప ప్రయత్నించావు?" అని గంభీరంగా అడిగాడు యువరాజ్.

ఆ యువకుడు బేలయిపోయి యువరాజ్ ని భయభయంగా చూశాడు. సమాధానం చెప్పలేదు.

"చెప్తావా, చెప్పవా?" అని యువరాజ్ ఉరిమి చూశాడు.

యువరాజ్ ఆరడుగులా మూడంగుళాల పొడుగున్నాడు.

పొడవుకి తగిన లావు. విశాలమైన ఛాతి. ఇనుప కండరాలు. ఉక్కు నరాలు. భారీమనిషి. ఆజానుబాహు. యువరాజ్ దేహాన్ని చూసి ఆ యువకుడు గడగడలాడిపోయాడు.

"నేను నక్సలయిట్లకు నాటుబాంబులు తయారుచేసి యిచ్చేవాడిని" అని చెప్పాడు.

యువరాజ్ అదిరిపడి ఆ యువకుని గబగబ కట్టిపడేశాడు. ఆ యింటి నంతటిని సోదాచేశాడు.

వంద కిలోగ్రాముల గంధకం, వంద కిలోగ్రాముల సూరేకారం, వంద కిలోగ్రాముల పొటాష్, ఫ్యూజ్ వైర్, మావోసూక్తులు, చైనాసాహిత్యం, మన ప్రభుత్వం నిషేధించిన ప్రచురణలు కొన్ని వున్నవి.

యువరాజ్ యింకా వెదికాడు. కొన్ని కాగితాలు దొరికాయి. ఆ కాగితాలలో నక్సలయిట్ల స్థావరాలను గురించిన వివరాలు స్పష్టంగా వున్నవి. యువరాజ్ సంతోషంతో బయటకు వచ్చాడు. ఆశ్చర్యం!—

క్రైంబ్రాంచ్ ఇన్స్పెక్టర్ ధనార్జనరావ్, లా అండ్ ఆర్డర్ సర్కిల్ ఇన్స్పెక్టర్, స్పెషల్ బ్రాంచ్ సర్కిల్ ఇన్స్పెక్టర్, డి. యస్. పి. లు, మరి కొంతమంది పోలీసులు యువరాజ్ ని విష్ చేశారు.

"మీరెలా ఇక్కడకు వచ్చారు?" ఆశ్చర్యపోతూ అడిగాడు యువరాజ్.

"మేము గ్రామగ్రామమూ—అంటె నక్సలైట్ల బెడదవున్న ఊర్లన్నీ తిరుగుతూ అవసరమైన చోట్ల పోలీస్ గస్తీదళాలను నియమించుతూ, అనుమానమున్న చోట్లల్లా పోలీసులచే చుట్టుముట్టి నక్సలైట్ల స్థావరాలను తుదముట్టిస్తున్నాం. నూరి నక్సలైట్లల్లో చేరిపోయి వారి స్థావరాల ఆచూకీని ట్రాన్సిస్టర్ టెలిఫోన్ మూలంగా తెలియజేస్తున్నాడు. మాపని యింకా సుళువయింది," అని చెప్పాడు ధనార్జనరావ్.

"సూరి యిప్పుడెక్కడున్నాడు?" ఆత్రంగా అడిగాడు యువరాజ్.

"ఫలానా చోటని తెలియడంలేదు. ఇంకా ఫోన్ చేయలేదు. మీరెలా ఇక్కడకు వచ్చారు?" అడిగాడు డి.యస్.పి.

"నన్ను సూరిని నక్సలైట్లు చుట్టుముట్టారు. తప్పించుకుని విడిపోయాం. నేనిలా ఈ ఊరు చేరాను. సూరి నక్సలైట్లలో కల్సిపోయాడు," చెప్పాడు యువరాజ్.

"యువరాజ్! ఈ ఊళ్ళో మహాదారుణంగా నక్సలైట్లు అక్రమంచేసి వున్నారు," అని బాధపడ్డాడు డి.యస్.పి.

"అవునండి. నా కళ్ళెదుటే జరిగింది..." అనంటూ యువరాజ్ జరిగినది బాధగా చెప్పాడు.

"ఈ నక్సలైట్లను సమూలంగా నిర్మూలించడం ఖాయం! కేంద్రంనుండి రిజర్వ్ పోలీస్ దళమూ చేరుకుంది. రాష్ట్ర స్పెషల్ పోలీస్ బలగమూ తోడయింది. అనుమానమున్న వైపు పోలీస్ దళాలు తమరక్షణ చర్యలతో నక్సలైట్ల ప్రతిఘటనలను ఎదుర్కోడానికి దండెత్తుతున్నాయి," చెప్పాడు ధనార్జనరావ్.

ట్రాన్సిస్టర్ టెలిఫోన్ మ్రోగింది. ఫోనులో సూరి చెప్పసాగాడు.

# 16

స్నానంచేసి బట్టలు మార్చుకుని తమ కన్సల్టింగ్ గదిలోకి వచ్చారు యువరాజ్, సూరీలు.

ట్రాన్సిస్టర్ టెలిఫోన్ మ్రోగింది. యువరాజ్ రిసీవ్ చేసుకున్నాడు.

"మిస్టర్ యువరాజ్ మీరు ఇచ్చిన కాగితాల మూలంగా చాలామంది నాయకులను, నక్సలైట్లను బంధించాము. కొమ్ములు తిరిగిన నక్సలైట్ల నాయకులను బంధించాము. నక్సలైట్ల వుద్య

మానికి చావుదెబ్బ తగిలింది. కొద్ది రోజులలో మిగిలిని నక్సలైట్లు కూడా లొంగిపోక తప్పదు. ప్రజలంతా పోలీస్ కార్యకలాపాలకు సహకరిస్తున్నారు. అయితే నక్సలైట్లను మాత్రం మార్చి, వారి నాయకులను దాచిపెట్టిన సెర్చ్ లైట్లు మాత్రం పట్టుబడలేదు. వాళ్ళను మీ రెలాగైనా బంధించాలి. మా పోలీసు బలగమూ తీవ్ర కృషిచేస్తూంది," అని పోలీస్ సూపరింటెండెంట్ చెప్పాడు.

"ఇందులో మా కృషి ఏమీ లేదండి. నక్సలైట్ వుద్యమాన్ని ప్రతి ఒక్కరూ అసహ్యించుకుంటున్నారు. కొందరు వ్యక్తులు విదేశీయుల ప్రలోభాలకు బానిసలై మాతృదేశానికి ద్రోహం చేస్తున్నారు. మీ పోలీసుల సామర్థ్యం మూలంగా నక్సలైట్ ఉద్యమం తగ్గుముఖం పట్టింది. కొంత కాలానికి నామరూపాలు లేకుండా పోవచ్చు. పోవాలి కూడా! సెర్చ్ లైట్ల సంగతే నాకంతుపట్టడంలేదు. వాళ్ళెవరయింది తెలీడం లేదు. వాళ్ళు తీసుకెళ్ళిన నాయకులను ఏమిచేస్తున్నదీ తెలియడంలేదు. నా శాయశక్తులా ప్రయత్నిస్తాను," చెప్పాడు యువరాజ్.

"అలాగే! ఈ నక్సలయిట్ల సంగతి యిక పోలీసులు చూసుకుంటారు. సెర్చ్ లయిట్ల సంగతి మీరు వదలకూడదు," అని చెప్పాడు పోలీస్ సూపరింటెండెంట్.

"అలాగేనండి!" అనంటూ యువరాజ్ రిసీవర్ బాక్స మీద పెట్టేశాడు. సూరికి చెప్పాడు.

"సెర్చ్ లయిట్లను యెలాసార్ కనుగొనడం?" సూరడిగాడు.

కాలింగ్ బెల్ మ్రోగింది.

ఆ డిటెక్టివ్ లిద్దరూ ఒకరిముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు. సూరిలేచి వెళ్ళి తలుపులు తెరిచాడు. ఆశ్చర్యం!_

ఆ డిటెక్టివ్ గుండె క్షణంపాటు ధమధమ కొట్టు కున్నది.

సెర్చ్‌లయిట్లు అనబడే ముగ్గురు యువకులు మిషిన్‌గన్‌లతో సూరిని నెట్టుకుంటూ లోనికి ప్రవేశించారు.

"ఎవరు మీరు? ఏమిటీ దౌర్జన్యం?" అనరిచాడు యువరాజ్, ఆశ్చర్యపడిపోతూ.

"యువరాజ్ గారూ! మే మెవరయింది మీకు తెల్సు. మీ రెవరయింది మాకు తెల్సు!" అన్నాడు సుదర్శనం.

"ఎందుకు వచ్చారు?"

"మమ్ములను బంధించడానికి, నక్సలయిట్లని వదలి రంగంలోకి దిగుతారని తెల్సి—మీకు శ్రమ ఇవ్వకుండా మీ దగ్గరకు వచ్చాం," చెప్పాడు త్రిశూలం.

యువరాజ్, సూరీల ఆశ్చర్యానికి అంతులేదు. తాము వాళ్ళను పట్టుకోడానికి ప్రయత్నించబోతామని ఎలా పసి కట్టగలారు?

"మీరు సెర్చ్‌లయిట్లని పేరుపెట్టుకుని నక్సలయిట్లమీద అంతఘోరకృత్యాలు ఎందుకు చేస్తున్నారు? ఆ నాయకులను ఏం చేశారు? సురభిని, సత్యం భార్యను ఎందుకు చంపారు?" అడిగాడు యువరాజు.

"నక్సలయిట్ల ఉద్యమంగూర్చి తెలియనివారులేరు. వాళ్లు ఎన్ని అక్రమాలు చేస్తున్నారో—ఆ అక్రమాలకు ఎందరు బలి అవుతున్నారో మాకు తెల్సు. మేము వాళ్ళ అకృత్యాలకు బలయినవాళ్ళం! గర్భవతైన నా భార్యను, పసిబిడ్డను, తలితండ్రిని పొట్టబెట్టుకున్నారు. కక్ష తీర్చుకోడానికి, దెబ్బకుదెబ్బ తీయడానికి నక్సలయిట్లకు సర్చ్‌లయిట్లుగ మారాము. వీరిరువురూ నక్సలయిట్ల అమానుషాలకు ఆహుతైనవారు. మా దగ్గరున్న డబ్బును భద్రపరుచుకుని ఎన్నో కష్టాలకు ఓర్చి మిషిన్‌గన్‌లు సంపాదించుకున్నాం. రంగ

లోకి దిగాం. సురభిని నిలువునా చీల్చి చెండాడి చంపాం. సత్యం భార్యను అతని కళ్ళెదుటే నరికేశాం. ఆ ఇరువురూ ఎందరో స్త్రీలను రిక్రూట్ చేసి యీ నక్సలయిట్లలో చేర్చారు. నక్సలయిట్లను పూర్తిగా దెబ్బతీయాలని మేము కంకణం కట్టుకున్నాం. అందుకే కనబడ్డ నక్సలయిట్లని నిలువునా కాల్చిపడేశాం,'' అని సుదర్శనం ఆవేశంతో చెప్పాడు.

"ఇపుడు నక్సలయిట్ల నాయకులను ఎక్కడ బంధించి వున్నారు?'' అడిగాడు యువరాజ్.

"ఆ విషయం చెప్పం. నక్సలయిట్ల ఏరివేతలో పోలీసులు తీవ్రంగా, ముమ్మరంగా వున్నారు. నక్సలయిట్ అనబడే వాడు సమూలంగా నిర్మూలం అవుతాడని మాకు నమ్మకం కల్గింది. అందుకే మేము మీదగ్గరకు వచ్చాం,'' అని చెప్పాడు గాండీవం.

"ఎందుకు?'' ఆశ్చర్యంగా అడిగాడు యువరాజ్.

"తుపాకీ గొట్టానికి, ఫిరంగిగొట్టం పుట్టుతుంది. నక్సలయిట్లకు సెర్చ్‌లయిట్లు పుట్టుతారని నిరూపించాం. మాకు అంతేచాలు. ఆ నాయకులు మే మనుకున్నట్టుగా నికృష్టంగా చావాలి,'' చెప్పాడు త్రిశూలం.

"ఎలా?''

"ఆ విషయాలు మీరే తెల్సుకుంటారు మిస్టర్ యువరాజ్! మేము నక్సలయిట్లను ఎందరినో చంపాం. చట్ట ప్రకారం నేరసులం. నేరసులను చంపిన నేరసులం. నేరాన్ని అణచడానికి నేరం చేశాం. మా జీవితాలు ఇంతటితో చాలించుకుంటున్నాం.''

అనంటూ సుదర్శన్ తన మిషిన్‌గన్‌ని త్రిశూలానికి గురిపెట్టాడు.

త్రిశూలం, గాండీవానికి తన గన్‌ని గురిపెట్టాడు.

గాండీవం తన గన్‌ని సుదర్శనానికి గురిపెట్టాడు.

యువరాజ్ సూరీలు విచిత్రంగా చూస్తున్నారు.

"మా చావుకు ఎవరూ బాధ్యులుకారు," అన్నారు ముగ్గురు ఏకంగా.

మూడు మిషన్‌గన్‌లు ఢమ, ఢమ, ఢమ అంటూ ఒకేసారి మ్రోగిపోయాయి.

అంతే! ఆ ముగ్గురు యువకులు నిర్జీవంగా యువరాజ్ సూరీలముందు పడిపోయారు. వారి శరీరాలనుండి రక్తం ఎగజిమ్మింది.

## 17

నెక్సలయిట్లు బంధించిన నాయకులు ఎక్కడున్నారు? ప్రాణాలతో వున్నారా? వాళ్ళ నెందుకలా అజ్ఞాతంగా వదలి నెక్సలయిట్లు ఆత్మహత్య చేసుకున్నారు? యువరాజ్‌కు అంతుపట్టలేదు.

నాయకులు ఎక్కడ బంధింపబడివున్నారో కనుగొనడానికి ప్రత్యేక సిబ్బందిని ప్రభుత్వం నెలకొల్పింది. ఆ సిబ్బందిగాక పోలీసులు, యస్. బి. ఏజంట్లు, అధికారులు, అనధికారులు అందరూ రంగంలోకి దిగారు. ప్రతి అంగుళ భాగాన్ని వెదుకుతున్నారు.

కానీ, నెక్సలయిట్లు బంధించిన నక్సలయిట్ నాయకులు ఎక్కడున్నది తెలియరాలేదు. యువరాజ్‌కు ఆత్రుత ఎక్కువైపోతూంది.

నాయకులు ప్రాణాలతో ఉంటారా? మరణించి ఉంటారా? తప్పించుకుని ఉంటారా? నిర్ణయించుకోలేక పోయాడు.

దర్యాప్తు కొనసాగుతూనే వుంది.

కొన్నిరోజులు గడిచాయి. ఎక్కడో ఒకచోట దుర్గా

సన మూలంగా ఒకయింటితాళం పగులగొట్టి చూశారు. ఆశ్చర్యం!—

ఆ యింటిలో నాయకుల శవాలు వున్నవి.

అక్కడకు యువరాజ్, సూరీ, ధనార్జనరావులు హుటాహుటిగా చేరుకున్నారు.

నాయకులంతా నగ్నంగా వున్నారు. విరిచి కట్టబడి వున్నారు. అరవడానికి వీలులేకుండా నోటిలో గుడ్డలు కుక్కబడి వున్నవి. అలా బంధితులయిన నాయకులు అలాగే ప్రాణాలు వదిలివున్నారు.

శవాలు కుళ్ళిపోయి దుర్గంధం భరింపజాలనిదిగా వుంది.

ఆ నాయకుల కెదురుగా స్త్రీల నగలు, ధాన్యం, తుపాకులు, నాటుబాంబులు, విల్లంబులున్నవి. అవన్నీ నక్సలయిట్లచేత దోచుకోబడ్డవని ఇట్టే తెల్సిపోయింది.

ఆ దృశ్యాన్ని చూచిన యువరాజ్, సూరీ, ధనార్జన రావ్ లు నిబ్బరించుకోలేకపోయారు.

"ఆడవారి సొమ్మును, అమాయకులను బెదిరించి దోచుకుని రాజ్యాంగాన్ని హస్తగతం చేసుకోవాలని ఉద్యమం లేవదీసిన నాయకులు, ఘోరంగా మరణించారు. అలా మరణించడానికి గల కారణం వారి అమానుషాలే!" అంటూ బయటికి నడిచాడు డిటెక్టివ్ యువరాజ్.

—: ఐపోయింది :—

# ప్రాక్టికల్ టెస్ట్

## రమణశ్రీ

"మనం బయలుదేరి వారం రోజులయింది కదూ!" నిండు పున్నమి వెన్నెలలో వాచీ చూసుకుంటూ అన్నాడు విలియం.

"అవును. వారం రోజులూ నిమిషాలలా గడిచిపోయాయి. ఎంత హాయిగా వుందో! ఇలాగే జీవితాంతం వుండా లని పిస్తోంది" డెక్ మీద ఫోల్డింగ్ ఛేర్‌లో కూర్చొని సిగరెట్ త్రాగుతూ అన్నాడు కాంతారావు.

"ఈ మన ప్రయాణం విజయవంతమయితే, ప్రపంచంలో నూతన శకం ఆరంభమవుతుంది" కాఫీ కలుపుతూ అంది లూసీ.

ఏం మాట్లాడకుండా గంభీరంగా సముద్రంవైపు చూస్తూ కూర్చొని ఉన్నాడు ప్రొఫెసర్ జయరాం.

పున్నమి చంద్రుడు నీళ్ళమీద నృత్యం చేస్తున్నాడు. వెన్నెల తెల్లని దుస్తులలోవున్న యూరోపియన్ యువతిలా వుంది. కనుచూపుమేరలో ఎటుచూసినా సముద్రమే!

ఆ సువిశాలమైన సముద్రంలో ఆ నలుగురూ ఓ మెషీన్ బోట్ మీద గమ్యంలేని ప్రయాణం చేస్తున్నారు.

## 2

శాంతారావు ఓసారి విలియం, లూసీలవైపు చూసి చిన్నగా నవ్వుతూ చెప్పసాగాడు.

అదే సమయంలో సైకాలజీ ప్రొఫెసర్ జయరాంగారు ఆ గదిలోకి ప్రవేశించారు. ప్రొఫెసర్‌ని చూసి ఆ ముగ్గురూ విష్ చేశారు. ప్రొఫెసర్ ప్రతిగా విష్ చేసి ప్రక్కనేవున్న యీజీఛేర్‌లో కూలబడ్డారు.

"నేడు మనలో గూడు కట్టుకొనిపోయిన యీ అరిష్టాలను, అవి అప్పుడప్పుడు వెర్రితలలు వేయడానికి, యీ సంఘమెంత దోహదం చేస్తుందో, మీకు ఒక సంఘటనద్వారా తెలియ చేస్తాను," శాంతారావు చెప్పసాగాడు. అంతా శ్రద్ధగా వింటున్నారు.

మా నేటివ్ కు సమీపంలోనే ఓ గ్రామం వుంది. ఆ గ్రామంలో రాజారావుగారనే ధనికుడు వున్నాడు. ఆయనకు ఒక్కగానొక్క కూతురు అరుణ. ఆయన తదనంతరం అరుణ దాదాపు నాలుగు లక్షలకు అధికారిణి.

రాజారావుగారికి చెల్లెలు కొడుకు మూర్తి. వాళ్లూ బాగా వున్నవాళ్ళే! అరుణ పుట్టగానే మూర్తి పెళ్ళాం అన్నా రందరూ. మూర్తి తల్లి ఆ పిల్లవ్రేలికి ఏదో వుంగరంకూడా తొడిగింది.

కాలగర్భంలో కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. ఇద్దరూ యుక్తవయస్కు లయ్యారు.

అరుణ మద్రాస్ ప్రెసిడెన్సీ కాలేజీలో చదువుతోంది. మూర్తికూడా అక్కడే చదువుతున్నాడు.

పెద్దలువేసిన ప్రేమ బీజాలవలన, అరుణకు కాబోయే వరుడయిన బావను చూడగానే ఎంతో సిగ్గువేసేది. మూర్తిని బావా అని పిలుస్తూంటే ఆమెలో కోటివీణలు వుదయరాగాలను ఆలపించేవి.

అరుణ నోటినుండి రసరమ్యమైన పలుకులు వింటూంటే, మూర్తిలో శతకోటి అనన్యమైన అనురాగ తరంగాలు పెల్లుబుకేవి.

రాజారావు అరుణ చదువు పూర్తయిన తరువాతనే పెళ్ళి అని స్పష్టం చేశాడు.

ఈలోగా ఓ విచిత్రం జరిగిపోయింది.

మూర్తిలో ఓ కోర్కె పెరగసాగింది.

"మరదలుపిల్ల వున్న మూర్తి ఎంత అదృష్టవంతుడురా" అంటున్న ఫ్రెండ్స్ మాటలకు మూర్తిలోవున్న కోర్కె మురిసిపోయేది.

"ఏంట్రా మూర్తీ, చేతిలో చక్కని చుక్కను పెట్టుకొని, మాలాగా ఒంటరిగా రూంలో అఘోరించడమెందుకోయ్" అన్న ఆప్త మిత్రుల మాటలకు అవునని తవూపేది అంతరాత్మ.

"అరుణ ఎలాగూ నీ భార్యకదా! కాకపోతే ఓ సంవత్సరం అటూ, యిటూ, అంతే. మరేం తప్పులేదులే" అన్న అంతరాత్మ మాటలకు పూర్తిగా లొంగిపోయాడు మూర్తి.

సరిగ్గా ఇదేవిధంగా అరుణ విషయంలోగూడా జరిగింది.

"ఎంచక్కా నీకు బోయ్ ఫ్రెండ్ను వెతుక్కునే బాధ లేదు" అన్న పంకజాక్షి మాటలకు అరుణ హృదయం పరవళ్ళు తొక్కింది.

"మీ బావ చాలా అందంగా వుంటాడు సుమీ" అనే మీనాక్షి మాటలకు ముసిముసిగా నవ్వేది.

ఎట్టకేలకు యిరువురి హృదయాలు కోర్కెతో బరువెక్కాయి. వారు ఆ బరువును మరెంతోకాలం సహించలేక పోయారు.

వెంటనే యిద్దరూ కలిసి ఓ నిర్ణయానికి వచ్చారు. ఆ బరువును చెరిసగం పంచుకోవాలని నిశ్చయించుకున్నారు.

అంతే, ఇద్దరూ హాస్టల్ రూంలు ఖాళీచేసేసి, లాడ్జింగ్‌లో రూం తీసేసుకున్నారు.

పెద్దవాళ్ళకు తెలియకుండా కొన్ని నెలలు గడిచిపోయాయి.

అయితే ఆ కొన్ని నెలలలోనే విపరీతమైన మార్పులు సంభవించాయి.

మూర్తి తల్లిదండ్రులు వ్యాపారంలో విపరీతంగా నష్టపడ్డారు. మూర్తి బికారిగా తయారయ్యాడు.

రాజారావు బికారిమూర్తికి ఛస్తే తన కూతురును యివ్వనన్నాడు.

ఇప్పుడు ఆ యిద్దరూ ఏమవ్వాలి?

అప్పుడున్న పరిస్థితిని చూస్తుంటే, తల్లిదండ్రులను ఎదిరించే మూర్తితో వుండే ధైర్యం అరుణలో లేదు.

అరుణను బుజ్జగించి వుంచే స్థోమత మూర్తిలో కరువయింది.

ఓ శుభముహూర్తాన అరుణ మెడలో మరో లక్షాధికారి కొడుకయిన జగన్నాథం మూడుముళ్ళు వేశాడు.

మూర్తికి అర్పించిన అరుణ శరీరం మరొకరి సొత్తు అయింది.

అరుణ ఎంత విలపించినా, యీ ఘోరకృత్యం ఆగలేదు.

చివరకు తనకూ, బావకూ శారీరక సంబంధం వున్నదని చెప్పినా, రాజారావు దంపతులు లక్ష్యపెట్టక ఆమె నోరు నొక్కి పెళ్ళి చేసేశారు.

అయితే ఆమె తనలోవున్న కల్మషం దాచుకోలేక

పోయింది.

శోభనం నాటిరాత్రి జగన్నాథంతో విషయం పూర్తిగా చెప్పేసింది.

తను తన బావను ప్రేమించినట్లు, తన బావకు తన శరీరం అర్పితమయినట్లు, ఇప్పుడు ఈ విధంగా జరిగిందనీ, హృదయం విప్పి భర్తముందు పరిచింది.

జగన్నాథం మండిపడ్డాడు. మలినపడిన వస్తువును తను తాకలేనన్నాడు. తన్ని తరిమేశాడు అరుణను.

అప్పుడు పూర్తిగా ధైర్యం వచ్చింది అరుణకు. ఆ సమయంలో అరుణకు తల్లిదండ్రులెవరూ గుర్తుకురాలేదు.

ఆమె కళ్ళముందు ఆజానుబాహుడయిన మూర్తి ప్రత్యక్షమయ్యాడు.

సరాసరి మూర్తి దగ్గరకు వెళ్ళింది.

అయితే అక్కడ మూర్తిలేడు. అతనిగదిలో అతని శవం ఉరికంబానికి వ్రేలాడుతూ కన్పించింది. అక్కడే టేబుల్ మీదవున్న లెటర్ హెడ్ పై ఆర్థికపరమైన యిబ్బందుల వలన ఆత్మహత్య చేసుకుంటున్నట్లు వ్రాయబడివుంది.

అయితే ఆ ఉత్తరంలోని రాతనుబట్టి యదార్థం గ్రహించింది అరుణ.

మూర్తి ఆత్మహత్య చేసుకోలేదు. తండ్రి రాజారావు పగబట్టి అతనిని హత్యచేసి దానిని ఆత్మహత్యగా నిరూపించడానికి ప్రయత్నించాడు.

విషయం గ్రహించిన తరువాత అరుణకు తల్లిదండ్రులమీద విరక్తి పుట్టింది. భర్తదగ్గరకు మళ్ళీ వెళ్ళడానికి అభిమానాన్ని చంపుకున్నా, ధైర్యం మాత్రం చాలలేదు.

అయితే ఆ తరువాత అరుణ ఏమయిందో ఎవరికీ అర్థంకాలేదు.

రాజారావు, తదితరులు అరుణను ఫ్లూవచ్చి చచ్చిపోయిం దని ప్రజావళిని నమ్మించారు.

కానీ అరుణ చావలేదు.

ప్రాణాన్ని కాపాడుకోవడానికై మానాన్ని అమ్ముకో వాల్సి వచ్చింది, అమ్ముకుంది.

అరుణ వేశ్యగా మారిపోయింది. వేశ్యగా మారిపోయిన తరువాత వేషభాషలు పూర్తిగా మారిపోయాయి.

కొన్నాళ్ళ తరువాత పర్మినెంటుగా ఒకే విటుడ్ని వుంచు కుంది. అయితే అన్నిటికన్నా ఆశ్చర్యకరమయిన విషయమేమి టంటే, ఆ విటుడు మరెవ్వరో కాదు, అరుణను తన్ని తరిమేసిన జగన్నాథం!...'' చెప్పటం ఆపాడు కాంతారావు.

అప్పటివరకూ జాగ్రత్తగా వింటున్న విలియం అడిగాడు.

''జగన్నాథం అరుణను గుర్తించలేదా? లేక గుర్తించే యిష్టపడ్డాడా?''

''లేదు. అరుణ అంతగా మారిపోయిందన్న మాట!''

''ఇంతకూ యిదంతా కల్పిత గాథా, లేక యదార్థంగా జరిగిందా?'' అడిగింది లూసీ.

''నూటికి నూరుపాళ్ళు యదార్థగాథ. మొన్న మద్రాస్ సైకలాజికల్ టూర్‌కు వెళ్ళినప్పుడు అడయార్‌లో గల ఓ చిన్న బంగళాలో వున్న అరుణను ఓ ఫ్రెండ్ ద్వారా కలుసుకొని ఇంటర్వ్యూ చేశాను. నే నక్కడ వుండగానే వచ్చిన జగ న్నాథాన్నికూడా పరిచయం చేసింది.''

''నిజంగా కాలం ఎంత విచిత్రమైన మార్పులను తీసుకు వస్తుంది?'' అన్నాడు విలియం.

చిన్నగా నవ్వాడు కాంతారావు. ''నో. కాలం ఏమీ మార్పులను తీసుకురాదు. తూర్పున ఉదయించే సూర్యుడు ఎప్పుడయినా పశ్చిమాన ఉదయించాడా? లేదు. కానీ కాలంకన్న గొప్పవైన యీ పరిసరాలు మాత్రం మనిషిలో

మార్పులను తీసుకువస్తాయి.''

ఈజీ ఛేర్‌లో పడుకొని కళ్లుమూసుకుని అంతా వింటున్న ప్రొఫెసర్ జయరాం కళ్లు తెరవకుండానే అడిగాడు.

''ఇంతకూ నువ్వేమంటావ్ మిస్టర్ కాంతారావ్?''

''చూడండి మాష్టారూ. యిప్పుడు యీ అరుణ వేశ్యగా మారడానికి యీ కలుషితమయిన సంఘం, పరిసరాలేకదా కారణం?'' అడిగాడు కాంతారావు.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

ప్రొఫెసర్ జయరాంది భారీ విగ్రహం. పచ్చటి శరీరం, విశాలమైన నుదురు. కళ్లు ఎప్పుడూ సూదుల్లా సూటిగా చూస్తుంటాయి. ఆయన చూపులతోనే ఎదుటి మనిషిమాట కట్టెయ్యగల సమర్థుడు. సైకాలజీ స్టూడెంట్లందరూ జయరాంను విశేషంగా అభిమానించడానికి కారణం ఆ కళ్ళే!

''చూడు మిష్టర్ కాంతారావ్, ముందు సంఘం, అంటే యీ సంఘంలోని మనుషులు అరుణ పతనానికి ఎలా కారకు లయ్యారో చెప్పు?'' అన్నాడు ప్రొఫెసర్.

ప్రొఫెసర్ వైపు సూటిగా చూశాడు కాంతారావు.

''మీకు తెలుసు సర్. కానీ నా చేత చెప్పించాలని అలా అడుగుతున్నారు. ఆల్ రైట్, చెబుతాను వినండి'' చెప్ప సాగాడు కాంతారావు.

''మొదటి కారణం, రాజారావు దంపతులు, మూర్తి తల్లి దండ్రులు. అరుణ పుట్టగానే మూర్తి పెళ్ళాం అనిచెప్పి, ఆ పసిహృదయాలలోనే ప్రేమను నింపారు. వారు తమ ప్రేమను పరిపక్వం చేసుకొనేటప్పటికి పరిస్థితులలో కొన్ని మార్పులు వచ్చాయి.

మూర్తి తండ్రి వ్యాపారంలో నష్టపడ్డాడు. అప్పుడే రాజారావులో స్వార్థం వెర్రితలలు వేసింది. ధనమదాంధు డయిన రాజారావు ధనానికే ప్రాధాన్యత యిచ్చి, కన్న

కూతురు సుఖాన్ని లెక్క చేయక, పిన్ననాటి మాటలను గాలికివదలి, మరొకరితో అరుణ మెడలో తాళి కట్టించాడు.

అంతేకాదు, అరుణ తనలోని కల్మషం దాచుకోలేక భర్తతో చెప్పి, అతనిచే వెడలగొట్టబడి పూర్వ ప్రియుని చేరగానే, అక్కడ అతగాడు చచ్చిపోయి వుంటాడు. ఆ ఘాతుకానికి కారణం రాజారావు.

తన కూతురును అంతకుముందు ధనికుడయినా, అప్పటికే పేదవాడయిన మూర్తి అనుభవించడం సహించలేక మూర్తిని హత్యచేశాడు రాజారావు.

చిన్నతనంలోనే వివాహానుబంధానికి కాధారమగు ప్రేమ బీజాలను ఆ పసిహృదయాలలో నాటారు తల్లిదండ్రులు. యుక్తవయస్సులో సాటిసహచరులు వారిలోవున్న కామాన్ని మేల్కొలిపితే, వారు ఉచ్ఛనీచాలను మరిచి హాయనైన తాత్కాలిక సుఖాలకోసం భవిష్యత్ ను పాడుచేసుకున్నారు.

ఇలా వారి బంగారు భవిష్యత్ లు పాడుకావడానికి యీ పరిసరాలు, సంఘం కారణంకావని చెప్పగలరా? అదే వారు యీ కలుషిత సంఘానికి సుదూరంగా వుంటే, ఎప్పటికీ చెడిపోయేవారుకాదు. నిర్మలమైన జీవితాన్ని గడిపేవారు."

చెప్పడం ముగించి ప్రొఫెసర్ వైపు చూసి నవ్వాడు కాంతారావు.

ప్రొఫెసర్ జయరాంకూడా చిన్నగా నవ్వి, అలాగే కళ్లు మూసుకొని నొసలుముడిచి దీర్ఘంగా ఆలోచిస్తూండిపోయాడు.

ఆ నిశ్శబ్దాన్ని ఛేదించడానికి విలియం, లూసీలకు ధైర్యం చాలలేదు.

కాంతారావుకూడా మాట్లాడకుండా వుండిపోయాడు.

మెల్లగా కళ్లు తెరిచాడు ప్రొఫెసర్ జయరాం.

"లుక్ హియర్ మిస్టర్ కాంతారావ్! నువ్వనేది యీ పరిసరాలకు దూరంగా వుంటే, ఆ సంఘటనలు అలా జరిగేవి

కాదని, ఆ వ్యక్తులలో అలాంటి పొరపాట్లు దొర్లవని అంటావు. అంతేనా?"

"ఎస్, ప్రొఫెసర్! నేటి యీ మనుషులలో గూడుకట్టుకొని పోయిన యీ ఆవేశకావేషాలు, స్వార్థచింతన, యీర్ష్యాసూయలు ప్రస్తుత యీ పరిసరాల ప్రభావం వలనే యిలా వెర్రితలలు వేస్తున్నాయి. ప్రస్తుత యీ సంఘస్వరూపం పూర్తిగా మారిపోతే, మానవుడు దానవుడుగా కాక మానవుడుగా జీవిస్తాడు," అన్నాడు కాంతారావు.

"ఎస్ సర్! మేముగూడా కాంతారావు వాదనతో ఏకీభవిస్తున్నాము," ముక్తకంఠంతో అన్నారు విలియం, లూసీలు.

రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

తన నిశితమైన దృష్టితో అందరినీ ఓసారి పరీక్షగా చూశాడు ప్రొఫెసర్.

"మైడియర్ లెర్నెడ్ స్టూడెంట్స్!" ఖంగుమంది ప్రొఫెసర్ జయరాం గొంతు.

అంతా ఆతృతగా జయరాంవైపు చూశారు.

"మీరు స్టూడెంట్స్ మాత్రమే! కానీ నేను ప్రొఫెసర్‌ను. మీరు యింకా జీవితాన్ని సరిగా స్టడీచేయలేదు. కానీ నేను జీవితాన్ని సంపూర్తిగా చదివి అర్థంచేసుకున్నాను.

ఈ వడబోతలో నాకు తెలిసిన సత్యమొక్కటే! ఈ యీర్ష్యాసూయలు, కామక్రోధాలు, రాగద్వేషాలు మనిషికి పుట్టుకతో వచ్చినవే! అవి మనిషి పెంపొందించుకున్నవి కావు. అవి మనిషి వదిలేయాలనుకుంటే సాధ్యపడేవికావు.

పుట్టుకతో వచ్చిన యీ కళలు పుడకలతో పోవాల్సిందే కానీ, మధ్యలో వాటిని వదలడం మానవతరంకాదు.

సరే, పైన నువ్వు ఉదాహరణగా పేర్కొన్న సంఘటనను పరిశీలిద్దాం. నువ్వు చెప్పింది కొంతవరకు సమంజసమే!

కాని అది యీ పరిసరాల ప్రభావం మాత్రంకాదు. చాలా సహజమైన విషయాలు.

మరో విషయం, నువ్వు రాజారావుమీద వేసిన ఆభాండాలలో చాలావరకు సమర్ధనీయంకాదు.

అందులో మొదటిది, రాజారావు తన కూతురు అరుణను మూర్తికిచ్చి ఎందుకు వివాహం చేయలేదు?

రాజారావు కేవలం ధనాన్ని దృష్టిలో పెట్టుకొని అరుణను మూర్తికివ్వడం మానేయలేదు. మూర్తి బీదవాడయినా ఒకప్పుడు ధనికుడుగా బ్రతికినవాడే! మరల ధనికుడు అవడానికికూడా అస్కారాలున్నాయి. అదీగాక రాజారావు దగ్గర డబ్బుకు కరువులేదు. అంతేకాదు, అరుణ రాజారావుకు ఒకే ఒక కూతురు. రాజారావు తదనంతరం అతని యావదాస్తీ కూతురుకే చెందుతుంది. అందుకే మూర్తి రాజారావు అల్లుడయితే చాలు, ధనవంతుడయినట్లు లెక్క.

అలాంటప్పుడు మూర్తికి పెద్దగా ఆస్తిలేకపోయినా, కూతురుకు వచ్చిన నష్టమేమీలేదు కాబట్టి, రాజారావుకు పెద్ద కష్టంలేదు.

కానీ రాజారావు చాలా దూరదృష్టి కలవాడు. తన కూతురును వలలో వేసుకొని మూర్తి లాడ్జింగ్‌లో కాపురం పెట్టాడని తెలుసుకోలేని మూర్ఖుడుకాదు రాజారావు.

దీనినిబట్టి తన కూతురు మనస్తత్వం ఎలాగున్నా, మూర్తి మనస్తత్వం మాత్రం కనిపెట్టాడు.

అతను, అంటే మూర్తి చాలా అర్భకుడు. ఏమాత్రం ఆత్మశక్తికానీ, నిగ్రహ శక్తిగానీ లేనివాడు. కేవలం కామోద్రేకాన్ని తట్టుకోలేక తనకూతురును వంచించినవాడు, రేపు తనకు లేని డబ్బుకోసం ఆశపడి తన కూతురును వంచించి ఏదో అఘాయిత్యం చేస్తాడేమోనని భయపడ్డాడు.

అలా ఆలోచించడం తండ్రిగా రాజారావు బాధ్యత.

అంతేకాదు, ఇంద్రియనిగ్రహశక్తిలేని మూర్తి రేపు అరుణకన్న అందగత్తె కనిపించి కొంచెం చనువిస్తే, అరుణకు ద్రోహం చేస్తాడేమోనని ఆలోచించాడు.

మిత్రుల సలహాలలో తప్పొప్పులనుకూడా నిర్ణయించుకోలేని మూర్తి బలహీనతను బాగా అంచనా వేసుకున్నాడు రాజారావు.

ఇన్ని ఆలోచించి, తన కూతురు బంగారు భవిష్యత్‌ను దృష్టిలో పెట్టుకొని, మరో లక్షాధికారి కొడుకుకు యిచ్చి పెళ్ళిచేశాడు.

వివాహం అయిన తరువాత రాజారావు ఆలోచనలు మరి కొంచం ముందుకు వెళ్ళివుంటాయి.

అరుణ దక్కలేదన్న కోపంతో మూర్తి ఏ పాపకార్యానికి ఒడిగడతాడోనని హడలిపోయాడు.

అంతేకాదు, తనకు అరుణకు సంబంధమున్నదని, అరుణ భర్త జగన్నాథానికి మూర్తిచెబితే, అరుణ భవిష్యత్ అంధకారమవుతుందని గ్రహించాడు. అందుకే చాలా దూ(దు) రాలోచన చేశాడు. అదే మూర్తిని చంపేయడం!

అలాగే అరుణకు, మూర్తికి సంబంధం లేకపోయినా, వారివారి మానసిక దౌర్జన్యాలనుబట్టి, అరుణకు మరోవ్యక్తితోనో, మూర్తికి మరో యువతితోనో పరిచయం జరిగివుండేదే!

కాబట్టి మైడియర్ స్టూడెంట్స్, పైన మీరు పేర్కొన్నారే, అవి దుర్గుణాలు అనుకోండి, మరేమైనా అనుకోండి. అవి మనిషిలోనే వుంటాయి. మనిషిని వెన్నంటి వుంటాయి. వాటికి సంఘంతో, పరిసరాలతో పనిలేదు. వాటికల్లా మనిషితోనే పని.

మనిషి మనుగడకు అవి ముఖ్యమనే కాబోలు, ఆ భగవంతుడు వాటిని మనిషిలోనే సృష్టించాడు. నిజానికి స్వార్థ

చింతన మనిషి మనుగడకు ఎంతో దోహదం చేస్తుంది. ఆ స్వార్థం లేకపోతే మనిషి తన మనుగడ సాగించలేదేమోనని పిస్తుంది,'' చెప్పడం ముగించి అందరివైపు చూశాడు ప్రొఫెసర్ జయరాం.

కాంతారావు, ప్రొఫెసర్ వైపు నిరసనగా చూశాడు.

"సారీ సర్! మీకున్న వాక్చాతుర్యాన్ని ఆధారంగా తీసుకొని నా వాదన కండెమ్ చేశారుకానీ, నా వాదన నూటికి నూరుపాళ్ళూ యదార్థం."

"అవునుసార్! కాంతారావు వాదనలో రియాలిటీ కన్పిస్తోంది. మీ వాదన కేవలం ఎదుటివ్యక్తి వాదాన్ని ఖండించడానికి చేసినట్లుగావుంది కానీ, నమ్మశక్యంగాలేదు'' అంది లూసీ.

విలియంకూడా కాంతారావునే బలపరిచాడు.

గంభీరంగా నవ్వాడు ప్రొఫెసర్ జయరాం.

"మైడియర్ స్టూడెంట్స్! మరి మీకు యింకెలా నచ్చచెప్పను?"

లూసీ మాట అందుకుంది.

"ఇంతకుముందు యిదేప్రశ్న వచ్చిందిసార్! అప్పుడే విలియం యీ విషయాన్ని ప్రాక్టికల్‌గా టెస్ట్ చేద్దామన్నాడు. దానికి కాంతారావు అంగీకరించాడుకూడా."

ఆశ్చర్యంగా చూశాడు జయరాం.

"వాట్? ప్రాక్టికల్ టెస్టా? ఈజిట్ ప్రాక్టికల్ జోక్గా?"

"నో సార్!'' విలియం చిరునవ్వు నవ్వాడు.

"మేము యీ విషయాన్ని నిరూపించుకోవడానికి ఒక బృహత్ప్రయత్నం తలపెట్టాము. దాని ప్రకారం మేము యీ కలుషిత సంఘంతో తెగతెంపులు చేసుకొని, యీ పరిసరాల ప్రభావానికి లోనుగానంత సుదూర ప్రాంతాలకు

వెళ్ళిపోయి నూతన ప్రపంచంలో ఏమాత్రం స్వార్థ చింతన, ఆవేశకావేషాలు, కామక్రోధాలు, యీర్ష్యాసూయలు, రాగ ద్వేషాలు లేకుండా నిర్మలమైన జీవితాన్ని సాగిద్దామని నిశ్చయించుకున్నాం.''

''వెరీగుడ్!'' చిన్నగా నవ్వాడు విలియం.

''మీరు తలపెట్టిన ప్రయత్నం నిజంగా మహత్తరమైనది. జయాపజయాలు దైవాధీనం. మీరు విజయంపొందితే, యీ ప్రపంచానికి నూతన వెలుగును ప్రసాదించినవారవుతారు.''

''ప్రొఫెసర్ జీ! మాతోబాటు మీరుగూడా రాకూడదూ? మీ వాదనను మీరుగూడా ప్రూవ్ చేసుకోవచ్చు కదా?'' అడిగింది లూసీ.

''మిస్ లూసీ!'' అన్నాడు కాంతారావు. ''నువ్వు మరీ ఆలోచనా రహితంగా మాట్లాడకు. మనం వెళ్ళేచోటు గమ్యంలేనిది. అక్కడ మన జీవనమెంతకాలమో నిలకడ లేనిది. మనతోబాటు ప్రొఫెసర్ గారెలా రాగలరు? వారికి సంసారం, కొన్ని బాధ్యతలు వుంటాయికదా! మనమయితే ఫ్రీబర్డ్సం!'' హెచ్చరించాడు.

చిరునవ్వు నవ్వాడు జయరాం.

''మైడియర్ స్టూడెంట్స్! నేను సైకాలజీ స్టడీ చేయడానికి నా జీవితాన్నే ధారబోశాను. నాకు సర్వం సైకాలజీయే! నాకు సంసారం బాధ్యతల ప్రసక్తిలేదు.

ఇప్పటి మీ దీక్ష, కర్తవ్య నిర్వహణ చూస్తుంటే నాకూ ఎనలేని ఉత్సాహం ఉరకలువేస్తూ వస్తోంది. నిజంగా మీ ప్రయత్నం ఎంతో అభినందనీయమైనది. మీకు అభ్యంతరం లేకుంటే, మీతోబాటు ఆ మహత్తర కార్యంలో పాలు పంచుకోవడానికి సంసిద్ధుడనే!''

అంతా అంగీకార సూచకంగా తలలూపారు.

''విత్ ప్లెజర్ సర్! నిజంగా మీలాంటి విజ్ఞానులు మా

చెంతవుంటే మాకెంతో ఉపయోగకరం,'' అన్నాడు కాంతారావు.

''నిజం సర్. మీరుగూడా వస్తే చాలా బావుంటుంది,'' అన్నారు విలియం, లూసీలు.

''ఆల్ రైట్! మన ప్రయాణం ఎలా ప్రారంభిద్దాం?'' అడిగాడు విలియం.

కాంతారావు ఓ రెండు నిముషాలు దీర్ఘంగా ఆలోచించాడు. ఆలోచనలలోనుండి తేరుకుని ఏదో చెప్పబోయి చటుక్కున ఆగిపోయి ప్రొఫెసర్ వైపు తిరిగాడు.

''ప్రొఫెసర్ సాబ్! మీరు చెప్పండి. పెద్దలు, అనుభవజ్ఞులు అయిన మీకే ఆ బాధ్యత వదిలిపెడుతున్నాను.

ప్రయాణం ఎలా సాగాలి? మనకు గమ్యం ఎక్కడ? ఈ ప్రపంచానికి సుదూర ప్రాంతాలకు ఎలా చేరుకోవాలి. అక్కడ ఎలా జీవనం సాగించాలి? ప్రయాణానికి స్కెచ్ తయారుచేయండి'' అన్నాడు కాంతారావు.

ప్రొఫెసర్ కళ్ళు మూసుకుని ఆలోచనలో మునిగిపోయాడు.

అయిదు నిమిషాలు గడిచాయి.

కళ్ళు తెరిచాడు ప్రొఫెసర్.

''డియర్ స్టూడెంట్స్! మన ధ్యేయం, యీ పరిసరాలకు సాధ్యమయినంతదూరం మనం వెళ్ళిపోవాలి. దానికి సులభమయిన మార్గం, 'నా దృష్టిలో సముద్రమార్గం'' ఒక్కక్షణం ఆగాడు.

''ఆల్ రైట్, చెప్పండి?'' ఉత్సాహంగా అడిగాడు విలియం.

''ముఖ్యంగా మనం ఎన్నిరోజులు గడపగలమో చెప్పలేము. అసలు తిరిగి వస్తామో, రామో గూడా ప్రూహించలేము. కాబట్టి యీ ఆధునిక ప్రపంచానికి దూరంగావున్న

మనజీవనం తృప్తికరంగా గడచిపోవడానికి తగిన చర్యలు తీసుకోవాలి. అందుకుగూడా మనకు సముద్రమార్గం, సముద్రతీరం చాలా సహాయకారిగా వుంటుంది."

"ఎలా?" అడిగింది లూసీ.

"వెరీ సింపుల్! సముద్ర ప్రయాణంలో అయితే మనం ఎక్కువగా ఆహారపదార్ధాలను తీసుకు వెళ్ళవలసిన అవసరం వుండదు. ఉప్పునీటిని మంచినీరుగా మనం తేలికగా తయారు చేసుకోవచ్చు. ఇక ఆహార సమస్య. మనం ఆ పరిసరాలకు అలవాటుపడిపోతాం కాబట్టి, సముద్రంలో సమృద్ధిగా లభించే మాంసాహారం మనకు చాలా వుపయోగపడుతుంది.

ముఖ్యమైన నీటిసమస్య, ఆహారసమస్య తీరిపోయాయి. ఇక దుస్తులుకూడా మనం కొంచం శ్రమపడితే, సముద్రంలో లభించే నాచుతో చక్కని ఉన్నిబట్టలు తయారుచేసుకో వచ్చు.

సో, ఎక్కువ సరంజామా లేకుండానే నిత్యావసరాలు చాలా తేలికగా గడచిపోతాయి. అలాగే సముద్రతీరంలో మనం నివాసమేర్పరచుకుంటే, పై సౌఖ్యాలన్నీ అనుభవించ వచ్చు.

ఇకపోతే మనం ప్రాణరక్షణకు అవసరమైన కొన్ని ఆయుధాలు, ఔషధాలు, మరికొన్ని ఉపయోగకరమైన వస్తువులతో ప్రయాణం చేయవచ్చు.

మన ప్రయాణం ఒక బోటుమీద సముద్రంలో జరుగు తుంది. మన గమ్యం ఆ విధికి వదిలేద్దా!

మనం ఒక మెషిన్ బోట్ తీసుకొని, అది సముద్రజంతు వుల తాకిడికి తట్టుకొనేలా కొన్ని హంగులు దానికి సమ కూర్చుకొని, దానిలో ఫుల్ గా ఇంధనాన్ని స్టాక్ చేద్దాం. అవసరమయిన చోటనే ఇంధనాన్ని ఖర్చుపెట్టుకుంటూ, ప్రయాణం సాగిద్దాం. ఈలోపు మన గమ్యం ఎక్కడో

అక్కడ స్థిరపడకపోదు."

అంతా గడగడ చెప్పేసి 'ఏమంటారు?' అన్నట్లు అందరి వైపు చూశాడు జయరాం.

జయరాం ఆలోచనా పటిమకు ఆశ్చర్యపోయారంతా.

"వెల్ సర్. మీ స్కెచ్ అమోఘం. మేము రూపకల్పన చేసిన ప్రయాణానికి మీరు ప్రాణంపోశారు."

అంటూ అంతా ఓ కే చేశారు.

—ఆరోజు ఏదో కాకతాళీయంగా ప్రారంభమయిన చర్చ అతితీవ్రదశలకు చేరుకొని, కనీవినీ ఎరుగని మలుపును సృష్టించి, ఓ వినూత్నమైన ప్రయాణానికి పునాది వేసింది.

దాని ఫలితమే కాంతారావు, విలియం, లూసీ, ప్రొఫెసర్ జయరాంగారల ఆ బోటు ప్రయాణం.

# 3

విలియం డేట్ వాచ్‌లో పదిహేను అంకెలు ముందుకు నడిచాయి.

ప్రొఫెసర్ జయరాం డైరీలో మరో పదిహేను పేజీలు నల్లబడ్డాయి.

తూర్పు దిక్కున ఉదయిస్తున్న బాలభానుడి లేత కిరణాలను పరికిస్తూ, సహజ ప్రకృతి వాతావరణంలోని మాధురాన్ని చవిచూస్తున్నారు, పరిశోధకులంతా.

లూసీ కిచెన్ బాక్స్‌లోకి నడిచింది.

నాలుగు గాజు గ్లాసులలోనూ శుభ్రపరిచిన మంచినీరును తీసుకుంది. ప్రక్కనే స్టాండ్ మీద అమర్చబడివున్న టిన్స్ అందుకొని, ఒక టిన్నులోంచి తెల్లటి రంగుగల మిల్క్ టేబ్లెట్స్ తీసి అన్ని గ్లాసుల్లోనూ వేసింది. ఆ తరువాత మరో టిన్‌లోనుంచి నల్లటి రంగుగల కాఫీ కేప్సూల్స్ తీసి

గ్లాసులలో వేసింది.

మరుక్షణంలోనే గుమగుమలాడే కోల్డ్ కాఫీ తయారయింది. గ్లాసులన్నీ ఒక ట్రేలో అమర్చుకొని డెక్ మీదకు నడిచింది లూసీ.

డెక్ మీద కుర్చీలలో కూర్చుని మాట్లాడుకొంటున్నారు, ప్రొఫెసర్ జయరాం, విలియం, కాంతారావులు.

లూసీ అందరికీ కాఫీలను అందించి తనూ ఓ గ్లాసు తీసుకుని కుర్చీలో కూర్చొంది.

"థాంక్యూ లూసీ, నా కడుపులో ఎలకలు ఎప్పుడు పరిగెడుతాయో, నీకు బాగా తెలుసు" నవ్వుతూ తన గ్లాసు అందుకున్నాడు కాంతారావు.

"లూసీ లేకపోతే మనం చేయి కాల్చుకోవలసి వచ్చేది" అంటూ నవ్వాడు విలియం.

అందరి అభినందనలు స్వీకరిస్తూ మౌనంగా నవ్వింది లూసీ.

"లూసీది అమృతహస్తం. కోల్డ్ కాఫీ త్రాగినా, నరనరాల్లో కొత్త ఉత్సాహం వెచ్చగా ప్రవహిస్తుంది," అన్నాడు నవ్వుతూ జయరాం.

అంతా పగలబడి నవ్వారు.

కొంతసేపు ఆ ప్రదేశం పకపకలతో ప్రతిధ్వనించింది.

"ప్రొఫెసర్ జీ! భవిష్యత్ గురించి భయంకరంగా ఆలోచించుకునే యీ తరుణంలో కూడా మీలో ఉత్సాహం వెచ్చగా ప్రవహిస్తోందంటే నిజంగా ఆశ్చర్యమే!" అన్నాడు విలియం.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ జయరాం.

"జీవితం మన చేతులలో లేదు మిస్టర్ విలియం! మన చేతులలో వున్నదల్లా, యీ క్షణాన్ని సుఖంగా గడపగలగటమే! మరుక్షణం మనది కాదు గదా! అయినప్పుడు భవిష్యత్ ను గురించి, సుందరంగాగానీ, భయంకరంగాగానీ

"అబ్బ! ప్రొఫెసర్జీ, మళ్ళీ మనం తర్కవితర్కాలలో పడిపోతున్నాం. ఇక మీ వాదన వివరించండి. మీరన్నట్లుగా మరుక్షణంనుండి మనది కాదనుకొని, యీ క్షణం నిర్మలంగా గడుపుదాం" బోటు ప్రయాణానికి చెదిరిపోతున్న నీటి పాయలను చూస్తూ అన్నాడు కాంతారావు.

"ఆల్ రైట్ మైబోయ్, నేను క్రిందకు వెళ్ళి గీత చదువుకుంటాను" అంటూ క్రిందకు నడిచాడు జయరాం.

"నాకూ కొంచెం పనివుంది. నిన్న సగంలో ఆపేసిన ఉషోదయం చిత్రాన్ని పూర్తిచేయాలి."

జయరాంను అనుసరించాడు విలియం.

దాదాపు అరగంట నిశ్శబ్దంగా గడిచిపోయింది.

సముద్రంవైపు చూస్తూ, ఎందుకో వెనక్కి తిరిగిచూసిన కాంతారావు ఒక్కక్షణం ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయాడు.

అప్పటివరకూ తదేకంగా కాంతారావు విగ్రహాన్ని చూస్తూ నిలబడివున్న లూసీ చటుక్కున తనచూపు మరల్చుకొంది.

చిన్నగా తనలోతాను నవ్వుకున్నాడు కాంతారావు.

"మిస్ లూసీ, మీరింకా క్రిందకు వెళ్ళలేదా?" అడిగాడు.

"లేదు" అందామె.

"అయితే దాదాపు అరగంటనుండి యిక్కడే నిలబడి ఏంచేస్తున్నారు?"

చిన్నగా నవ్వింది లూసీ.

"మీరుచేసే పనే నేనూ చేస్తున్నాను."

"ఈజిట్?"

"ఎస్!"

"అయితే నేను చూస్తున్నది ప్రకృతిని కదా?"

"నేను చూస్తున్నది ప్రకృతి పురుషుడిని. అంటే మిమ్మ లను. మీరూ ప్రకృతిలో ఓ భాగమేకదా!" అందంగా నవ్వింది.

"ఇది నిజమా?"

"అక్షరాలా!"

"లూసీ, మీరు చాలా అందంగా మాట్లాడుతారు" దగ్గరకు జరిగాడు శాంతారావు.

"మీ అంత అందంగానా?" కళ్లు పెడల్పుచేసి నవ్వింది.

"నేను అంత అందంగా వుంటానా?"

మౌనంగా నవ్వి వూరుకుంది లూసీ.

"లూసీ."

"ఊం."

"ఇలా దగ్గరకు రా."

"ఊహుం."

"నేనంటే నీకెందుకంత అభిమానం?"

"ఎందుకో చెప్పలేను శాంతారావ్. ఆరోజు తీవ్రంగా వాదోపవాదాలు జరుగుతున్నప్పుడు ఉద్రేకంగా ఉప్పొంగే నీ విశాలవక్షస్థలం చూడగానే నా వొళ్ళు గగుర్పొడిచింది. బహుశా ఆ క్షణమే శాబోలు నా మనసు నీవైపు తిరిగింది."

"డియర్ లూసీ."

"ఆఁ."

"నిజంగా ఇలాంటి క్షణం ఎదురవుతుందని కలలోగూడా వూహించలేదు."

"వూహించనిది జరిగినప్పుడే నిజమైన థ్రిల్ వుంటుంది," నవ్వింది లూసీ.

"నీ నవ్వు చూస్తుంటే నాకు మతిపోతోంది."

"నీకా భయం అక్కర్లేదు. నీ మతి నా దగ్గర భద్రంగానే వుంటుంది."

"జాగ్రత్త. అది మహా చెడ్డది. అప్పుడప్పుడు గొడవ చేస్తుంటుంది" అన్నాడు కాంతారావు.

"ఆ గొడవ తగ్గించే మార్గం నాకు తెలుసు."

"అయితే యిప్పుడు ఆ గొడవ కొంచం తగ్గించు."

"ఏయ్, ఇప్పుడా?"

"ఆఁ."

"హాయ్, యూ నాటీ బోయ్!"

"నేను నిజంగా చాలా అదృష్టవంతుడిని లూసీ!" ఆనందంగా ఆమెను తనకేసి అదుముకుంటూ అన్నాడు కాంతారావు.

"ఈ క్షణం శాశ్వతం చేసేయ్ కాంతీ" లూసీ గొంతు మృదువుగా పలికింది.

# 4

వెన్నెల మల్లెపువ్వులు కప్పుకొన్నట్టువుంది.

నూతన పరిశోధకుల ఆశలలా ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి.

చక్కని చంద్రుడు చిక్కగా వెదజల్లుతోన్న చల్లని వెన్నెల కిరణాలకు పరవశించిన సముద్రకన్య చిన్నగా రాగాలు తీస్తోంది.

విలియం బోట్‌ను డ్రైవ్ చేస్తున్నాడు.

కాంతారావు, ప్రొఫెసర్లు గాఢనిద్ర పోతున్నారు కాబోలు, సన్నగా గురకలు వినబడుతున్నాయి.

లూసీ తెల్లటి శ్లాబ్‌పై వొళ్ళుమరిచి నిద్రపోతోంది.

విలియం డ్రైవ్ చేస్తూనే అప్రయత్నంగా లూసీవైపు చూశాడు.

బిగుతుగావున్న స్కర్ట్‌లోంచి ముందుకు పొడుచుకు వస్తున్నాయి స్తనాలు. వెల్లకిలా పడుకోవడంవలన నిండుగావున్న

వక్షస్థలం కళ్ళకు మరింత మత్తుగా కన్పిస్తోంది. మోకాళ్ళ వరకు వుండే స్కర్ట్ తొడలపైవరకు తొలగిపోవడంతో తెల్లటి అండర్ వేర్ కన్పిస్తోంది.

చూస్తున్న విలియంకు మతిపోతోంది. చల్లటి వాతావరణం అతనిలోంచి వేడిసెగలను పుట్టిస్తోంది.

శరీరంలోని నరాలు జివ్వున లాగుతున్నాయి. పెదాలు ఉద్రేకంతో వణకసాగాయి.

లూసీ యవ్వనం అతన్ని పిచ్చెక్కించసాగింది. అతనిలో కోర్కెల గుర్రాలు కళ్ళాలు తెంచుకొని వీరవిహారం చేయసాగాయి.

స్టీరింగ్ స్ట్రెయిట్ కంట్రోల్ చేసి లేచాడు.

తడబడుతున్న అడుగులతో లూసీని చేరుకున్నాడు. ముఖంవైపు ముఖం త్రిప్పాడు. అరవిచ్చిన మందారంలా వున్న ఆమె అధరాలను చూడగానే అతనిలో కామం పేట్రేగిపోయింది.

వణుకుతున్న పెదాలను లూసీ అధరాలపై ఆనించాడు.

ముఖానికి వెచ్చగా తగులుతున్న వేడిశ్వాసకు ఉలిక్కిపడి లేచింది లూసీ.

తన ముఖంపైకి వాలుతున్న ముఖాన్ని చూసి కెవ్వున అరవబోయింది.

కానీ ఆలశ్యమయిపోయింది. ఆమె అధరాలను తన పెదాలతో కప్పేశాడు విలియం.

ఓ నిమిషం పెనుగులాడి తలవిదిలించి చటుక్కున లేచి నిల్చుంది లూసీ, స్కర్ట్‌ను క్రిందకు లాక్కుంటూ.

విలియంలో మైకం కొంచం క్రిందకు దిగింది.

సిగ్గుపడుతూ తలవంచుకొని లేచినిల్చున్నాడు.

విలియంవైపు అసహ్యంగా చూసింది లూసీ.

"వాట్? వాటీజ్ దిస్?"

కోపంలో కెంపులుగా మారిన ఆమె చెక్కిళ్ళను చూస్తూ మత్తుగా అన్నాడు విలియం.

"ఐ లవ్ యూ లూసీ, ఐ లవ్ యూ."

"మిష్టర్?"

"ఎస్ మిస్!"

"అసంభవం!"

"ఎందుకని?" అడిగాడు.

"మిష్టర్ విలియం, మనం పరిశోధకులం. మనం బయలు దేరింది ఒక మహత్తర ఆశయాన్ని సాధించడంకోసం. ఇది మన సిద్ధాంతాలకే విరుద్ధం. ఈ నూతన వాతావరణంలో వాటిని దరిచేరనీయగూడదు. ఇక్కడ ప్రేమకే చోటుకానీ, కామానికి లేదు," అంది.

"ఐ లవ్ యు వెరీమచ్ లూసీ!" రిపీట్ చేశాడు విలియం.

"నో. ప్రేమ ఎలావుంటుందో నాకు తెలుసు. ప్రేమకు మార్గం అదికాదు. నువ్వు నన్ను ప్రేమించడంలేదు. కామిం చావు. కేవలం నువ్వు కాముకుడవు మాత్రమే!

బీ కేర్, నిన్ను నువ్వు నిగ్రహ పరచుకో. లేకపోతే ప్రొఫెసర్ చెప్పిందే కరెక్టవుతుంది. మనం ఓటమిని అంగీ కరించవలసి వుంటుంది. అలా జరగకూడదు. ప్రపంచానికి మనం కొత్త వెలుగును చూపాలి. నూతన శకానికి మనం మార్గ దర్శకులం కావాలి" అంది లూసీ.

"మైగాడ్!" నిట్టూరుస్తూ వెళ్ళి డ్రైవింగ్ సీటులో కూలబడ్డాడు విలియం.

లూసీ అక్కడినుండి లేచివెళ్ళి ప్రొఫెసర్ సమీపంలో పడుకుంది.

అప్పటివరకు జరుగుతున్న సంభాషణను శ్రద్ధగావింటున్న

ప్రొఫెసర్, లూసీ అడుగుల శబ్దంవిని చిన్నగా నవ్వుకుంటూ కళ్లుమూసుకొని నిద్రను అభినయించసాగాడు.

## 5

ఉదయం ఎనిమిది గంటలవుతోంది.

బాలభాస్కరుని శీతకిరణాలు అద్దంపై వెలుగులా నీళ్ళపై బడి ప్రతిఫలిస్తున్నాయి.

ప్రొఫెసర్ జయరాం డైరీ వ్రాసుకుంటున్నాడు.

విలియం 'జలకన్య సోయగాలు' చిత్రానికి కలర్స్ వేస్తున్నాడు.

కాంతారావు సిగరెట్ త్రాగుతూ డ్రైవ్ చేస్తున్నాడు.

లూసీ ట్రేలో అమర్చిన బ్లాక్ కాఫీ అందరికీ సర్వ్ చేసి తనూ ఓ గ్లాసు తీసుకొని కాంతారావు ప్రక్కనే కూర్చుంది.

"కాంతారావ్?" పిలిచింది.

"ఊఁ. ఏమిటి?" అన్నాడు లూసీవైపు చూస్తూ.

"రాత్రి చిన్న హడావుడి ఒకటి జరిగింది" రహస్యం చెబుతున్నట్లు చెప్పింది అంతా పూసగుచ్చినట్లుగా.

అంతావిన్న కాంతారావు పళ్ళు పటపటలాడించాడు.

"వాట్? అంతఘోరం జరిగిందా? అప్పుడే నన్ను ఎందుకు నిద్రలేపలేదు. రాత్రే వాడిని షూట్ చేసి పారేసేవాడిని" సిగరెట్ పీక సముద్రంలోకి కోపంగా విసిరేస్తూ అన్నాడు కాంతారావు.

"ష్. గట్టిగా మాట్లాడకు. రాత్రి నేను అతనికి బాగా బుద్ధి చెప్పాను. ఇక మళ్ళీ నా జోలికి రాకపోవచ్చు," అంది లూసీ.

"నో. ఇలాంటి విషయాలలో అలక్ష్యం పనికిరాదు. విలియంను అసలు క్షమించకూడదు. పద. వెంటనే ప్రొఫెసర్ గారితో చెప్పి అతన్ని చీవాట్లు వేయిద్దాం," విసురుగా

లేచాడు.

వారించింది లూసీ.

"డియర్ కాంత్, ప్లీజ్ సిట్‌డౌన్. నువ్వుకూడా విలియంలా తెలివితక్కువగా మాట్లాడతావేమిటి?"

"ఓహ్! నేనేం మాట్లాడాను?" అన్నాడు విస్మయంగా.

"కాకపోతే మరేమిటి? మనం బయలుదేరిన ఉద్దేశ్యమేమిటి? ప్రొఫెసర్‌గారితో నీవు గట్టిగా వాదించిందేమిటి?"

ఆ కలుషిత వాతావర్ణానికి దూరంగా, అతీతంగావుంటే, మనలోని కామక్రోధాలు,యీర్ష్యాసూయలు ఉండవనేగదా! ఈ కొలదికాలంలోనే నువ్వు ప్రొఫెసర్ వద్దకువెళ్ళి, విలియంపై నేరారోపణలు చేయడం, ప్రొఫెసర్ వాదానికి బలం వచ్చినట్లవుతుంది. సో, భవిష్యత్ పై భారమేసి నిగ్రహంతో వ్యవహరించు," గట్టిగా మందలించింది లూసీ.

"లూసీ! నన్ను యిరకాటంలో పెట్టేస్తున్నావ్" గొణిగాడు కాంతారావు.

అప్పుడే ప్రొఫెసర్ వాళ్ళు కూర్చొని మాట్లాడుకొంటున్న చోటుకు వచ్చాడు.

వెనక అడుగుల శబ్దంవిని ఉలిక్కిపడి వెనక్కితిరిగారు.

"నేను మీ సంభాషణకు భంగం కలిగించడంలేదుకదా?" నవ్వుతూ అడిగాడు ప్రొఫెసర్.

"ఎంతమాట! మీరు మా చెంత వుండటమే మాకెంతో సంతోషం. ప్రయాణ విశేషాలు ముచ్చటించుకొంటున్నాం."

"మంచిది."

"బైదిబై ప్రొఫెసర్జీ! మీరు యీ ప్రయాణంలో ఆశ్చర్యమేమీ పొందడంలేదుకదా?" అడిగాడు కాంతారావు.

"లేదు మిస్టర్ కాంతారావ్, నాకు యీ వాతావర్ణం

చాలా ఆహ్లాదకరంగావుంది. ఎంతో బోర్ కొడుతుందను కున్న యీ ప్రయాణంలో రోజులు అవలీలగా గడచిపోతు న్నాయి. నాకు యీ ప్రయాణం ఎంతో సంతృప్తిగావుంది," అన్నాడు ప్రొఫెసర్.

"థాంక్స్ సర్! మాకూ అలాగేవుంది" అంది లూసీ.

"మిష్టర్ కాంతారావ్? ఇంకా మన గమ్యం ఎక్కడ?"

"పెట్రోల్ సూచిక ప్రకారం మనం ప్రయాణించినంత దూరం పైచిలుకు పెట్రోల్ వస్తుంది. ఆపైన దైవాధీనం!"

"లూసీ!" పిలిచాడు ప్రొఫెసర్.

"ఎస్ ప్రొఫెసర్ జీ!"

"నీవు సుఖంగా వుంటోందికదా? నిజంగా నీ ధైర్యం మెచ్చుకోతగింది. నారీరత్న మనిపించావు. నీధైర్యం నన్నే ఆశ్చర్యపరుస్తోంది."

"మీలాంటి మంచివారి సన్నిధిలోవుంటే నాకు వేరే భయమెందుకుసార్?" అంది లూసీ.

"చూడు లూసీ, నిన్నటినుండి విలియం నీతో మును పటిలా వుండటం లేదేమిటి? కొంచెం ఎడంగానే తిరుగు తున్నాడు. కారణమేమిటో తెలుసా?"అడిగాడు ప్రొఫెసర్.

గతుక్కుమంది లూసీ.

"లేదు సార్. మీరు పొరబాటుగా చూసివుంటారు. మేము మామూలుగానే ఉంటున్నాం. కదు కాంతారావ్" అడిగింది కాంతారావ్‌ను తడబడుతూ లూసీ.

"ఎస్ ప్రొఫెసర్ జీ. అలాంటిదేమీలేదు" సర్ది చెప్పాడు కాంతారావు.

"ఆల్ రైట్! మనం వెళ్ళబోయే నూతన ప్రదేశంలో మనం ముగ్గురమే ప్రజలం, సహజీవులం. అందుకే మనమధ్య ఐక్యత ముఖ్యం. ఇది ముఖ్యంగా గుర్తుపెట్టుకోండి"అన్నాడు ప్రొఫెసర్.

"అలాగే సార్!" అన్నారిద్దరూ ఏదో తప్పు చేసినట్లుగా. వాళ్ళ ముగ్గురిమధ్య నిశ్శబ్దం రాజ్యమేలసాగింది.

# 6

"కాంతారావ్ అదిగో అటు చూడు," అరిచాడు విలియం.

విలియం చూపిలేచినవైపు చూశాడు కాంతారావు.

సమీపంలో సముద్రం మధ్యలో ఒక దీవి కనబడుతోంది. ఫలవృక్ష సముదాయంతో కనుల కింపుగావున్న ఆ దీవి అంతా పర్వత ప్రదేశంగా వుంది.

ఎత్తైన కొండలు గర్వంగా తొంగిచూస్తూ కనబడుతున్నాయి. లూసీ, ప్రొఫెసర్ జయరాంకూడా ఆ దీవిని చూశారు.

"ఆ దీవి చాలా బాగుంది కాంతారావ్. మనం అక్కడ నివాసం ఏర్పరచుకొంటే, ఆనందంగా కాలం గడపవచ్చు," చెప్పాడు విలియం.

'ఓ చిన్న సజెషన్..." ప్రొఫెసర్ అన్నారు.

"వాట్?" ప్రశ్నార్థకంగా చూశాడు విలియం.

"అసలా దీవి ఎలాంటిదో మనకు తెలియదు. ఆ దీవిలో ఏమైనా క్రూరజంతువులు వుంటే, మనకు ప్రమాదకరం. అందుకని మనమంతా తొందరపడి ఆ దీవిలో సరంజామా అంతాదింపి నివాస ప్రయత్నములు చేయడం అంత మంచిది కాదు."

"మరి ఏంచేద్దాం?" అడిగాడు కాంతారావు.

"బోట్‌ను తీరంలోనే వుంచి, తగిన జాగ్రత్తలతో ఓ యిద్దరు ఆ దీవిలోకి వెళ్ళి పరిస్థితులను పరిశీలించి వస్తే మంచిది."

ఓ. కె. అన్నారంతా.

బోట్ మెల్లగా ఆ దీవి తీరంవైపు చేరసాగింది.

# 7

"లూసీ! ప్రొఫెసర్ జీ, కాంతారావులు దీవిలోకెళ్ళి గంట దాటుతుంది కదూ?" నీళ్ళలో కాళ్ళూపుతూ అడిగాడు విలియం.

"అవును విలియం. ఇంకా రాలేదు. కారణమేమిటో తెలియదు. అక్కడ ఏమన్నా ప్రమాదం జరిగిందో, ఏమిటో?" నిట్టూర్చింది లూసీ.

విలియం, లూసీవైపు పరీక్షగా చూశాడు.

ఆమె కళ్ళు దిగాలుగా తీరంవైపు చూస్తున్నాయి.

"లూసీ, నిజంగా వాళ్ళకు ఏమైనా ప్రమాదం జరిగితే?"

ఉలిక్కిపడింది లూసీ.

"స్టాపిట్ ప్లీజ్! మిస్టర్ విలియం, అసలు నీకు మనసుందా? నువ్వు మనిషివేనా? అలా ఎలా మాట్లాడగలుగుతున్నావ్? నాకు వూహించడానికే భయమేస్తోంది.

చిన్నగా నవ్వాడు విలియం.

"డియర్ లూసీ, ఆ కాంతారావుమీద నీకు ఎందుకింత ప్రేమ?" అడిగాడు.

ఓ క్షణం ఏం మాట్లాడలేదు లూసీ. ఆ తరువాత అంది.

"మిస్టర్ విలియం, ఒక్కొక్కళ్ళకు ఒక్కొక్కరిమీద ప్రేమ కలుగుతుంది. ఎందుకు కలుగుతుందంటే దానికి సమాధానంలేదు. అది నిర్వచింపలేనిది."

"చూడు లూసీ. నువ్వు మరీ వేదాంతంలోకి దిగకు. ఒక్క విషయం ఆలోచించు. మనిద్దరం అమెరికన్లమే! సైకాలజీ స్టడీ చెయ్యడానికి ఇండియాకు వచ్చాం. మనలో ప్రవహించేది ఒకేజాతి రక్తం. ఆలోచించు. నన్ను సుఖపెట్టు. నువ్వు సుఖపడు," చెప్పాడు విలియం.

విచిత్రంగా నవ్వింది లూసీ.

"విలియం, నిన్ను చూస్తుంటే మనం మారమేమో అనిపిస్తోంది. ఆ ప్రపంచంలో తెగతెంపులు చేసుకొని, కొన్ని యోజనాల దూరం ప్రయాణించి, మరో ప్రపంచంలో బ్రతకాలని మనం సంసిద్ధులవుతుంటే, డామిట్, మళ్ళీ యిక్కడకూడా జాతి భేదాలా?

విలియం, ఫూలిష్‌గా ఆలోచించకు. నీకు ఒకసారి నేను గట్టిగా బుద్ధిచెప్పాను. అయినా జ్ఞానం రాలేదు. ఇకనైనా యిలాంటి వెర్రి ఆలోచనలు మాని ప్రశాంతంగా గడపడానికి ప్రయత్నించు," విసురుగా చెప్పింది లూసీ.

విలియం మాట్లాడకుండా లేచి నిల్చున్నాడు.

అతని మనస్సు కాంతారావు గురించి, లూసీ గురించి ఆలోచిస్తోంది.

కాంతారావ్!

బ్లడీ ఫెలో! తనకు దక్కవలసిన అందాన్ని తను దక్కించుకున్నాడు. అసలు యీ యాత్రకు తను రాకపోయినా బాగుండేది.

వయసులోవున్న తను స్త్రీ తోడులేకుండా జీవితం వెళ్ళబుచ్చగలడా?

ఏమో, సందేహమే!

"విలియం, అదిగో, వాళ్లు వచ్చేస్తున్నారు" సంతోషంలో అరిచింది లూసీ.

అటువైపు చూశాడు విలియం.

ప్రొఫెసర్, కాంతారావులు నవ్వుతూ వచ్చారు.

"థాంక్ గాడ్! ప్రొఫెసర్జీ, మీరు యింకా రాకపోతే హడలి ఛస్తున్నాం, అక్కడ ఏం ప్రమాదం జరిగిందోనని. ఇక లూసీ సంగతి చెప్పనవసరంలేదు. సుడిగాలికి చిగురాకులా వణికిపోతోంది," ప్రొఫెసర్‌కు ఎదురువెడుతూ అన్నాడు విలియం.

లూసీ కళ్లు సంతోషంతో మెరవసాగాయి.

"మనం చాలా అదృష్టవంతులం విలియం. ఈ దీవి ఎంతో సుందరంగా వుంది. ఈ ఫలవృక్షాల మధ్య, యీ సముద్ర తీరంలో మనకు ఆహార పానీయాలకు కొదువలేదు. ఇక మనకు ప్రకృతి నిర్మించి యిచ్చిన గృహాలు ఎన్నో వున్నాయి" చెప్పాడు కాంతారావు.

"లూసీ, హాట్ కాఫీ కావాలి. క్విక్" అరిచాడు ప్రొఫెసర్.

"గృహాలా?" ఆశ్చర్యంగా అడిగాడు విలియం.

"అవును మిష్టర్ విలియం. ఈ దీవి అంతా పర్వతాల మయం. ఆ పర్వతాలలో ఎన్నో సువిశాలమైన గుహాలు నిర్మితమై వున్నాయి. మరి అవన్నీ మనకోసం ప్రకృతి నిర్మించిన గృహాలు కావా?" చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

వేడి వేడి పొగలు గ్రక్కుతున్న కాఫీ తీసుకువచ్చి ముగ్గురికి అందించింది లూసీ.

"అంటే, మనం మళ్ళీ ఆదిమానవులలా జీవనం సాగించ బోతున్నామన్నమాట!" అంది లూసీ.

"అంతేకదా మరి. ఈ దీవి మన విలాసం. ఆ గుహాలే మన నివాసం. ఇందలి ఫలాలు మన గ్రాసం. ఇక మనం కొన సాగించాలి సుఖజీవితం," అన్నాడు కాంతారావు పారవశ్యంగా.

అతని కవితా ధోరణికి నవ్వుకున్నారంతా.

"ఇంతకూ ఆ గుహాలలో మన నివాస స్థలాన్ని ఎన్నుకున్నారా?" అడిగాడు విలియం.

"ఓ యస్. అక్కడ శుభ్రంకూడా చేసివచ్చాం. అందుకే కొంచం ఆలశ్యమయింది. పదండి. ఇక బయలుదేరదాం," లేచాడు ప్రొఫెసర్.

అంతా బోటుదిగి, బోటును తీరంపైన గల ఓ వృక్షానికి

పెద్ద గొలుసుతో కట్టివేశారు.

ఆ తరువాత ఎవరికివారు తాము మోయగలిగినన్ని వస్తువులు తీసుకొని, ప్రొఫెసర్ ముందు దారితీస్తుండగా, తమ నూతన నివాసంవైపు నడకసాగించారు.

ఆ దీవిలో అలుముకొనివున్న వాతావరణంబట్టి, యింతవరకు ఏ సముద్ర ప్రయాణీకుడూ ఆ దీవిని సందర్శించలేదని తెలుస్తోంది.

రకరకాల ఫలాలు వృక్షాలకు భారంగా వ్రేలాడుతూ కన్పిస్తున్నాయి.

ఇసుక నేలమీద అంతకుముందు నడిచివెళ్ళిన ప్రొఫెసర్, కాంతారావుల పాదముద్రలు సుస్పష్టంగా కన్పిస్తున్నాయి.

అపురూపమైన ఆ ప్రకృతికి పరవశించిపోసాగింది లూసీ.

అంతా కలిసి ఓ విశాలమైన గుహప్రాంగణంలోకి చేరారు.

"అమ్మయ్య" అంటూ కూలబడ్డారంతా విశ్రాంతిగా.

ఆ తరువాత బోటులోని సామాన్లన్నీ ఒక్కొక్కటిగా అక్కడికి చేర్చారు.

అందరూ కలిసి వస్తువులను చక్కగా అమర్చుకున్నారు.

# 8

ఒక నెలరోజులు గడిచిపోయాయి.

ఆ నూతన ప్రపంచంలో ఏ చీకూ, చింతా లేకుండా హాయిగా కాలం గడుపుతున్నారు అంతా.

ఈ మధ్యకాలంలో వాళ్లు తుపాకీకి గూడా పని కల్పిస్తున్నారు.

ప్రతిరోజూ సాయంత్రం ఆ తీరానికి, సముద్రంలో చేపలను పట్టుకోవడానికి కొన్ని అడవికోంగలు రావడం గమనించారు.

ఒకరోజు తుపాకీ గురిపెట్టి ఓ కొంగను కాల్చారు. దాని మాంసం మంచి రుచికరంగావుంది. అప్పటినుండి వాళ్లు రుచికరమైన కొంగమాంసానికి అలవాటు పడిపోయారు. రోజు విడచి రోజు కొంగలను వేటాడడానికి సముద్రతీరానికి వెళ్ళడం ప్రారంభించారు.

ప్రొఫెసర్ మాత్రం ప్రతిరోజూ తన అనుభవాలను చక్కగా వర్ణిస్తూ ఓ పెద్దడైరీ రాయసాగాడు.

ఓ రోజు విలియం అడిగిన ప్రశ్నకు నవ్వుతూ "మిస్టర్ విలియం, ఇది నా ఒక్కడిదేకాదు, మనందరి జీవిత చరిత్రలు! మనం వున్నా, కొన్నాళ్ళకు గతించినా, మన విషయాలు బయటివారికి యిప్పట్లో తెలిసే అవకాశంలేదు. ఈ చరిత్ర మూలంగా ముందుముందు తరాలలో యిక్కడకు వస్తే, వారికి మన సాహసగాథ తెలుస్తుంది," అన్నాడు ప్రొఫెసర్.

ఈ నెలరోజులూ శారీరకంగా అంతా బాగానేవున్నా మానసికంగామాత్రం, ఎవరికివారు తీవ్రంగా ఏదో విషయంపై బాధపడుతున్నట్లు గ్రహించాడు ప్రొఫెసర్.

ఒకటికి రెండుసార్లు విలియం, కాంతారావులను తరచి తరచి అడిగాడు.

అయినా ప్రయోజనం కన్పించలేదు.

కానీ వారి ఆలోచనలను సూక్ష్మంగా గ్రహించాడు ప్రొఫెసర్.

లూసీ విషయంలో ఎవరికివారు ఎంత సరిపుచ్చుకుందామనుకున్నా, ఆ యిద్దరిలో మానసిక సంఘర్షణ తప్పడం లేదని గ్రహించాడు ప్రొఫెసర్.

"ప్రొఫెసర్ జీ! మీరూ వస్తారా తీరానికి?" తుపాకీ భుజాన తగిలించుకొంటూ అడిగాడు విలియం.

"ఆఁ. వెడదాం పదండి. అన్నట్లు లూసీగూడా వస్తా

నంది. పిలవకపోయారా?" అన్నాడు ప్రొఫెసర్.

"నేను ఎప్పుడో రెడీ అయ్యాను ప్రొఫెసర్ జీ" వాటర్ బాగ్, టార్చ్‌లైట్‌తో సిద్ధంగా గుమ్మందగ్గర నిలబడివున్న లూసీ అంది.

"ఆల్ రైట్! పదండి" లేచాడు ప్రొఫెసర్.

అంతా కలిసి సముద్రతీరానికి చేరుకున్నారు.

సాయంత్రంపూట కొంగలు ఎక్కువగా వస్తుంటాయి. అందుకే సాయంత్రం వేటకు బయలుదేరతారు. మళ్ళీ తిరుగు ప్రయాణమయ్యేటప్పటికి చీకటి పడుతుంది.

ఆ పూట విలియం రెండు, కాంతారావు రెండు కొంగలను వేటాడారు.

ప్రొఫెసర్ని వేటాడమంటే, అసలు తనకు తుపాకీ చేత బట్టడమే చేతకాదన్నాడు.

లూసీ రెండుసార్లు ప్రయత్నించింది. కానీ గురి కుదర లేదు.

మరోసారి ప్రయత్నిద్దామనుకున్నా, వారికంటికి కొంగలు మళ్ళీ కనబడలేదు.

జరిగిన గందరగోళానికి అవి చెదరి పారిపోయాయి.

రెండింటికి ఒక్కో తాడు చొప్పున కట్టి యిద్దరూ చెరో జతను భుజాన వేసుకున్నారు.

మాటల సందడిలో టైం చూసుకోలేదు. బాగా చీకటి పడిపోయింది.

ప్రొఫెసర్ టార్చి వెలిగించి ముందు నడవసాగాడు.

మిగిలిన ముగ్గురూ ప్రొఫెసర్ని అనుసరించారు.

అంతా కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు.

ఓ పదినిమిషాలలో వాతావరణమంతా విచిత్రంగా మారి పోయింది.

ఆకాశమంతా నల్లటి మబ్బులు కమ్ముకున్నాయి. తళతళ

మెరుపులమధ్య ఉండుండి వెన్ను జలదరించేలా ఫెళఫెళ ఉరుములు వినబడసాగాయి.

చూస్తూండగానే గాలి తీవ్రత మరింత అధికమైపోయింది.

సముద్రంలో ఉవ్వెత్తునలేచి పడుతున్న కెరటాల ధ్వని హోరుమంటూ వినిపిస్తోంది.

అంతా ఆ వాతావర్ణానికి భయకంపితులవసాగారు.

వెనక్కు తిరిగి చూచిన ప్రొఫెసర్ జయరాం ఆశ్చర్యపోయాడు.

దూరంగా ఉవ్వెత్తున లేచిన ఇసుక, సుడిగాలుల మధ్య వేగంగా ముందుకు దూసుకురాసాగింది.

అది చూడగానే ప్రొఫెసర్ జరగబోయే దేమిటో వూహించాడు.

"క్విక్. త్వరగా పరిగెత్తండి. బ్రహ్మాండమైన ఇసుకతుఫాను రాబోతోంది" అరుస్తూ పరిగెత్తసాగాడు ప్రొఫెసర్.

ఆ మాటలువిని అంతా అదిరిపోయారు. భయంతో రోమాలు నిక్కబొడిచాయి.

అంతా వేగంగా ప్రొఫెసర్‌ను అనుసరించారు.

అప్పటికే సుడిగాలులు వాళ్ళను సమీపించాయి.

వెనకనుండి ఇసుక ఛట్ ఛట్ మని వీపుమీద కొట్టసాగింది. కళ్ళు సరిగా కన్పించడం లేదు.

ఎవరో దబ్బున క్రిందపడ్డ శబ్దమయింది.

అంతా అటు చూశారు.

లూసీ క్రింద పడిపోయి మూలగసాగింది.

ప్రొఫెసర్ చటుక్కున ఆమెను ఎత్తుకున్నాడు.

"కమాన్. ఇక్కడో గుహవుంది. రండి. తాత్కాలికంగా దీనిలో తలదాచుకుందాం" భారంగా గుహలోకి పరిగెత్తాడు ప్రొఫెసర్.

క్రిందా మీద పడుతూ మిగిలిన ఇద్దరూ లోపలకువచ్చి

పడ్డారు.

అందరి గుండెలు దడదడ కొట్టుకోసాగాయి. భయంతో ప్రతి ఒక్కరికీ నీరసం ఆవహించింది.

ప్రొఫెసర్ లూసీని మెల్లగా క్రింద పడుకో బెట్టాడు.

భయంతో వణికిపోతోంది లూసీ.

అతినీరసం వలన అంతా ఆ కటిక నేలపై చప్పగా సోలి పోయారు.

# 9

తమను ఎవరో తట్టుతూ లేపేసరికి ఉలిక్కిపడుతూ లేచారు కాంతారావ్, లూసీ, విలియంలు.

అంతా కటిక చీకటి. నేలపై తమకు సూటిగా వుంచిన టార్చిలయిట్ నుండి కాంతికిరణాలు ప్రసరిస్తున్నాయి. ఎదురుగా ప్రొఫెసర్ జయరాం గంభీరంగా కూర్చునివున్నారు.

చటుక్కున లేచి కూర్చున్నారు ముగ్గురూ.

"ప్రొఫెసర్‌జీ, తుఫాన్ తగ్గిపోయిందా?" అడిగాడు కాంతారావు.

ప్రొఫెసర్ ఏమీ మాట్లాడలేదు.

తన ఆటోమాటిక్ డేట్ వాచీవైపు చూసుకున్న విలియం ఉలిక్కిపడ్డాడు.

ప్రొఫెసర్ వైపు విచిత్రంగా చూశాడు.

"సార్, మాకు స్పృహతప్పి ఎంతసేపయింది? మీకు స్పృహతప్పలేదా?" అడిగాడు ఆయోమయంగా.

మెల్లగా నోరువిప్పాడు ప్రొఫెసర్.

"డియర్ స్టూడెంట్స్! నేను చెప్పేది సావధానంగా

వినండి. మనం ఇసుక తుఫాన్ బారినుండి తప్పించుకోవడానికి యీ గుహలోకి వచ్చాము. నాకూ మీతోబాటే మగతనిద్ర పట్టేసింది. ఇప్పుడే మెలుకువ వచ్చింది. వాచీ చూసుకోనేసరికి నా తల తిరిగిపోయింది. మనం యీ గుహలో యిలా పడుండి రెండురోజులయింది," చెప్పాడు ప్రొఫెసర్.

అంతా ఒక్కసారిగా "మైగాడ్!" అంటూ అరిచారు.

"ప్రొఫెసర్ జీ, రెండురోజులు ఎలా వుండగలిగాము? ఈజిట్ ఫాక్ట్? నేను నమ్మలేకపోతున్నాను," ఆశ్చర్యంగా అంది లూసీ.

"సార్, ఇది పగలా? రాత్రా?" అడిగాడు విలియం.

"అదే నా కర్థం కావడంలేదు మిష్టర్ విలియం! నేను లేచేటప్పటికి మనం వెలిగించి వుంచిన బ్యాటరీలైట్ ఇంకా అలాగే వెలుగుతూవుంది," చెప్పాడు ప్రొఫెసర్.

"బహుశా, రాత్రి అయివుంటుంది. లేకపోతే బయట నుండి గుహద్వారం ద్వారా వెలుగు లోపల పడుతూందేది కదా! పదండి ప్రొఫెసర్జీ, మన స్థావరానికి వెడదాం," లేచాడు కాంతారావు.

ప్రొఫెసర్ అందరివైపు జాలిగా చూశాడు.

"సారీ, మీకు యీ షాకింగ్ న్యూస్ చెప్పక తప్పడం లేదు," చిన్నగా అన్నాడు ప్రొఫెసర్.

"వాట్ ప్రొఫెసర్?" కంగారుగా అడిగారంతా.

"ఆ తుఫాన్ మనల్ని నట్టేట్లో ముంచింది. అతి తీవ్రమైన ఆ తుఫాన్కు పెద్దపెద్ద కొండరాళ్లు అడ్డంపడి మన గుహ ద్వారం మూసుకుపోయినట్లుంది. అసలు గుహకు ద్వారం ఎక్కడోకూడా ఆనమాలు చిక్కడంలేదు. మీకన్న ముందు లేచిన నేను, ఆ బ్యాటరీలైటు పుచ్చుకొని అరగంటసేపు యీ గుహ యావత్తూ గాలించాను. అయినా ప్రయోజనం

కనబడలేదు,'' చెప్పాడు ప్రొఫెసర్.

అంతా అదిరిపోయారు. అయిదునిమిషాలవరకు ఎవరూ ఆ షాక్ నుండి తేరుకోలేకపోయారు.

''ప్రొఫెసర్ జీ, మీరు చెప్పింది నిజమేనా?'' తడబడుతూ అడిగింది లూసీ. ఆమె శరీరం భయంతో చిన్నగా వణక సాగింది.

''అయితే మన గతేమిటి ప్రొఫెసర్?'' చిన్నగా గొణిగాడు విలియం.

''పదండి. మళ్ళీ ఓసారి గుహంతా గాలిద్దాం. మన అదృష్టం బాగుంటే, ఆ ద్వారం బయట పడవచ్చు. మన మంతా కలిసి ఆ రాళ్ళను తొలగించడానికి ప్రయత్నిద్దాం,'' మొండిధైర్యంతో లేచాడు కాంతారావు.

లూసీ బెదురుగా కాంతారావు చేతినిపట్టుకుంది. ధైర్యంగా వుండమన్నట్లు ఆమె చేతిని గట్టిగా నొక్కాడు కాంతారావు.

''కాంతారావ్, నాకు చాలా ఆకలిగావుంది. ఆహారం తీసుకొని రెండు రోజులయింది. మీరు యువకులు కాబట్టి మీకు ఆహారం సంగతి గుర్తుకు రాకపోవచ్చు. నాకుమాత్రం కడుపులో ఏమన్నా పడకపోతే యిక లేచేదిలేదు'' చిన్నగా చెప్పాడు ప్రొఫెసర్.

''సర్! ఇదిమనం చిక్కుబడిపోయిన గుహ. ఇక్కడ మనకేం దొరుకుతుంది?'' విసుగుగా అన్నాడు విలియం.

''ముందు మనం బయటకు వెళ్ళేమార్గం చూసుకోవాలి ప్రొఫెసర్! మీరు కదలలేకపోతే, ఇక్కడే కూర్చోండి. మేం వెళ్ళి వెతుకుతాం,'' విసుగుగా అన్నాడు కాంతారావు.

''కాంతారావ్, నాకూ ఆకలేస్తోంది,'' చిన్నగా గొణిగింది లూసీ.

కోపంగా చూశాడు కాంతారావు.

విలియం ప్రక్కనే పడివున్న కొంగలను చూడగానే ప్రొఫెసర్ కళ్లు మెరిశాయి.

గబగబ ఓ కొంగ నందుకొని ఫట్ మంటూ ఓ కాలు విరిచేసి కరకర నమలసాగాడు.

అతని ఆకలిని ఆశ్చర్యంగా చూడసాగారు కాంతారావ్, విలియంలు.

ఓ నిమిషం వేచి చూసి, ఇక లాభం లేదనుకొని తనూ ఓ కొంగ నందుకొంది లూసీ.

ఇంకా కొంచం సేపాగితే, మిగిలినవిగూడా దక్కవనుకొని గబగబ చెరో కొంగను అందుకొని తినసాగారు విలియం, కాంతారావులు.

సుష్టుగాతిని వాటర్ బాటిల్ ఖాళీచేసి, తృప్తిగా త్రేన్చారంతా.

"ఈ కొంగల పుణ్యమా అంటూ ప్రస్తుతం ఆకలిబాధ చల్లారింది. ఇక పదండి, అన్వేషిద్దాం" లేచాడు ప్రొఫెసర్.

ఆ చీకటి గుహాలో బ్యాటరీలైటు వెలుగు ప్రసరించినంత మేరమాత్రం వెలుగు కనబడుతోంది.

ప్రొఫెసర్ లయిటు పుచ్చుకొని ముందు దారి చూపించగా, మిగిలినవారు వెనుకనే నడుస్తూ గుహాను అన్వేషించసాగారు.

అరగంట గడిచినా ప్రయోజనమేమీ కన్పించలేదు.

లూసీ కాంతారావు చేయివదలకుండా నడుస్తోంది.

హాఠాత్తుగా ఆగాడు ప్రొఫెసర్. అతని చేతిలోని టార్చిలయిట్ కాంతి కేంద్రీకరించబడినచోట అంతా చూశారు.

అక్కడో పెద్ద శిలాఫలకం కనబడింది. దానిమీద ఏవో అక్షరాలు అస్పష్టంగా కన్పిస్తున్నాయి.

దగ్గరకు వెళ్ళి ఆ అక్షరాలను చదువుదామని ప్రయత్నించారు విలియం, కాంతారావులు.

కానీ వారికి ఆ అక్షరాలు అర్థంకాలేదు. అసలు అవి ఏ భాషలో వ్రాసివున్నాయో కూడా తెలియలేదు.

అదే చెప్పారు ప్రొఫెసర్‌తో.

ప్రొఫెసర్ టార్చి కాంతారావు చేతికిచ్చి, ఆ ఫలకంపై ఫోకస్ పడేటట్లుగా పట్టుకొమ్మని చెప్పి, ఫలకం ఎదురుగా కూర్చొని కళ్ళజోడు పెట్టుకొని జాగ్రత్తగా పరిశీలించసాగాడు.

దాదాపు పదినిమిషాలు గడిచాయి.

ప్రొఫెసర్ పెదాలపై చిరునవ్వు వెలిసింది.

"డియర్ స్టూడెంట్స్! మనం చాలా అదృష్టవంతులం" అరిచాడు ప్రొఫెసర్.

"వాట్ సార్? ఆ ఫలకంపై ఏం రాసివుంది?" ఆతృతగా అడిగారంతా.

ముగ్గురివైపు ఓసారి చూసి చెప్పసాగాడు ప్రొఫెసర్.

"డియర్ స్టూడెంట్స్! ఈ ఫలకం కొన్ని కోట్ల సంవత్సరాల క్రితం వ్రాయబడింది. అప్పట్లో ఎంతో తపః సంపన్నులయిన మహారులు యీ గుహాలలో నివశించినట్లు తెలుస్తున్నది. ఈ లిపిగూడా ప్రాచీన దేవనాగరిక లిపి. ఇందులో వ్రాసివున్న ప్రకారం జరిగివుంటే, యీ సరికి కలియుగం అంతమయిపోయి వుంటుంది."

"వాట్?" అదిరిపడ్డారు ముగ్గురూ.

"ఎస్. ఇటీజ్ రియల్. సరిగ్గా ఆ మహర్షులు పేర్కొన్న ప్రకారం మొన్నటి రోజుతో కలియుగం ఓ పెద్ద ప్రళయంతో అంతమవ్వాలి. వారు పేర్కొన్నది నిజమేనని నాకు తోస్తున్నది. ఎందుకనంటే, మొన్న సంభవించిన ఇసుక తుఫాన్ సామాన్యమైనదికాదు. కలియుగాంతమయిన ప్రళ

యానికి చెందినదే యీ యిసుక తుఫాన్."

"సారీ సర్. మీరు చదివింది తప్పు. బహుశా మీకు ఆ విషయం సరిగా అర్థమయివుండదు. కలియుగం అంతమవడం ఏమిటి? కలియుగం అంతమయితే, యింకా మనం ఎలా బ్రతికివున్నాం?" హేళనగా నవ్వాడు కాంతారావు.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ జయరాం.

"మిస్టర్ కాంతారావ్, మహర్షుల అంచనాలు తప్పడానికి వీలులేదు. ఈసరికి బయట ప్రళయంలో కలియుగం సమాప్తమయిపోయి వుంటుంది. మనం, యీ గుహ బయట వుంటే, ఆ ప్రళయానికి మనమూ ఆహుతి అయిపోయేవాళ్లం. కానీ మహర్షులు తమ అపూర్వమైన తపశ్శక్తితో ఈ గుహకు ప్రాణంపోసి, ఓ వరం ప్రసాదించారు.

దానిప్రకారం ప్రళయం సంభవించే సమయంలో యీ గుహలో ఉన్నవారి ప్రాణాలు సురక్షితంగా ఉంటాయి. వారే తదుపరి సృష్టికి మూలకారకులు అవుతారు.

కానీ యిప్పుడు ఆ ప్రళయానికి మించిన ప్రమాదం మన కెదురుగావుంది" చెప్పాడు ప్రొఫెసర్.

ప్రొఫెసర్ చెప్పింది విని అంతా ఆశ్చర్యపోయారు.

అప్రయత్నంగానే యీ గుహలో ప్రవేశించి యుగ ప్రళయంనుండి తప్పించుకొని, ప్రాణాలు కాపాడుకొన్నందుకు ఓ క్షణం ఆనందించినా, ప్రొఫెసర్ చివరి మాటలకు ఉలిక్కిపడ్డారు.

"వాట్ ప్రొఫెసర్! ఇంక మనకేమిటి ప్రమాదం? ఈ గుహలో ఉన్నంతవరకు మరణం మనలను సమీపించదు కదా!" అన్నాడు విలియం సంతోషంగా.

"నో, మైడియర్ బోయ్! ప్రళయం ముగిసిన వెంటనే, మరోయుగం ప్రవేశించడంతోబాటు, యీ గుహ తనశక్తి కోల్పోతుంది. గుహాద్వారం మూసుకుపోకుండా ఉన్న

ట్లయితే, మనం అదృష్టవంతులమయ్యేవాళ్ళం. కానీ ఇప్పుడు మనల అదృష్టం వరించినా, దురదృష్టవంతులమయ్యాము.

ఆ గుహద్వారం మనకు కనబడకపోతే, కొలది గంటల లోనో, రోజులలోనో మనకు చావు తప్పదు. ఆకలిబాధకు తట్టుకొన్నా యీ గుహలోవున్న ఆక్సిజన్ అయిపోగానే చావు తప్పదు," బాధగా చెప్పాడు ప్రొఫెసర్.

"అయితే ప్రొఫెసర్జీ, ఈ గుహద్వారం తెరుచుకొనే యోగంలేదా? మనం బయటపడి బట్టగట్టే అదృష్టంలేదా?" భయంగా అడిగింది లూసీ.

లూసీ భయంతో కాంతారావును అదిమిపట్టుకొనివుంది.

"చెప్పలేం లూసీ! మన అదృష్టం బాగుండి త్వరలోమళ్ళీ ఏదైనా తుఫాన్ వస్తే, దాని తాకిడికి అడ్డంపడిన కొండ రాళ్ళన్నీ తొలగిపోతే కానీ, మనం వెలుగు చూడలేం" అన్నాడు ప్రొఫెసర్.

"మరి అప్పటివరకు బ్రతికేమార్గం?" బెదురుగా అడిగాడు విలియం.

"అదే వెతుకుదాం. పదండి" లేచాడు ప్రొఫెసర్.

అంతా నీరసంగా లేచారు.

బ్యాటరీ లయిటుకాంతి డిమ్‌గా పడుతోంది. రెండు రోజాలనుండి వెలుగుతున్నందువలన బ్యాటరీ క్షీణించి వెలుతురు తక్కువగా పడుతోంది.

"ప్రొఫెసర్‌జీ, బ్యాటరీలు మరో నాలుగు గంటలు మాత్రమే పనిచేస్తాయనుకుంటా! ఆ తరువాత అంతా అంధకారమే అయిపోతుంది. ఆకలి దప్పులకు మాడి మలమల మాడి చస్తాం, తప్పదు" దిగులుగా చూస్తూ అన్నాడు కాంతారావు.

ప్రొఫెసర్ ఏమీ మాట్లాడలేదు. అతని కళ్లు లయిటు కాంతిలో గుహను నిశితంగా పరిశోధిస్తున్నాయి.

"ప్రొఫెసర్‌జీ, అక్కడేదో పెట్టెలావుంది" అరిచింది లూసీ.

"పెట్టెలేదు, ఏంలేదు. ఏదో రాయి అయివుంటుంది. పదండి ముందుకు" కసిరాడు విలియం.

కాంతారావు చటుక్కున ఆ వస్తువును అందుకున్నాడు. అది ఓ చిన్న రాతిపేటిక. దానిపైన ఏవో అక్షరాలు అస్పష్టంగా ఉన్నాయి.

పైన పేరుకుపోయిన దుమ్మును దులిపి, ఆ అక్షరాలను చదవడానికి ప్రయత్నించాడు. కానీ అర్థమవలేదు.

ఆ పేటికను ప్రొఫెసర్‌కు అందించాడు కాంతారావు.

ప్రొఫెసర్ కళ్ళజోడు సవరించుకొని ఆ అక్షరాలను కూడబలుక్కోవడంలో మునిగిపోయాడు.

దాదాపు పది నిమిషాలు గడిచాయి.

విజయగర్వంతో ప్రొఫెసర్ తలఎత్తి అందరివైపు గర్వంగా చూశాడు.

ఆ పేటికను అతికష్టంమీద తెరిచాడు. అందులో రెండు గుళికలు ఉన్నాయి. వాటిని చూడగానే ప్రొఫెసర్ కళ్ళు మెరిశాయి.

# 10

"వాట్ ప్రొఫెసర్‌జీ?" అంతా ఆశగా ముక్తకంఠంతో అడిగారు.

గంభీరంగా నవ్వాడు ప్రొఫెసర్.

"కూర్చోండి. అంతా నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. ప్రళయాన్ని ముందే వూహించి, శిలాఫలకంపై వ్రాసి ముందుతరాల వారికి తెలియచేసిన ఆ మహాత్ముల అపూర్వ సృష్టియే యీ పేటిక. ఇదిగో, యీ పేటికలోని రెండు గుళికలను చూడండి. ఇవి సామాన్యమైన గుళికలు

కావు. అమృత గుళికలు. ఇవి స్వీకరించిన ప్రాణికి నూరు సంవత్సరాల వయస్సు పెరుగుతుంది. ఆ పెరిగిన కాలంలో ఆ ప్రాణికి ఆహారపానీయములు అక్కరలేదు'' చెప్పాడు ప్రొఫెసర్.

అంతా ఆశ్చర్యంగా చూడసాగారు.

"వాట్ ప్రొఫెసర్? నాకేమీ అర్థంకావడంలేదు'' అయోమయంగా అడిగాడు కాంతారావు.

"ఎస్, మిస్టర్ కాంతారావ్! ఇవి రెండూ అమృత గుళికలు. అంటే వీటిని యిద్దరు స్వీకరించి, తమ జీవితాలను మరో నూరు సంవత్సరాలు ఆహారపానీయాలకు అతీతంగా పెంచుకోవచ్చును. నాగరిక ప్రపంచంలో బ్రతికిన మనకు యీ మాటలు హేళనగా ఉండవచ్చు. కానీ ఇప్పుడు నేను చెప్పింది పచ్చియదార్థం'' సీరియస్‌గా చెప్పాడు ప్రొఫెసర్.

ఎవరూ ఏం మాట్లాడలేదు. అంతా నిశ్శబ్ద వాతావరణం అలుముకపోయింది. బ్యాటరీలయిటులోనుండి కాంతిమాత్రం సన్నగా ప్రసరిస్తోంది.

"డియర్ స్టూడెంట్స్!'' మెల్లగా పిలిచాడు ప్రొఫెసర్.

అంతా ప్రొఫెసర్ వైపు ఆత్రుతగా చూశారు.

"మనం చాలా దురదృష్టవంతులం. అందరం ఆ ప్రళయానికి బలయిపోయినా బాగుండేది. కానీ బ్రతికి పెద్దచిక్కులో పడ్డాం. ఈ పేటికలో నాలుగు గుళికలు వున్నా బాగుండేది. కానీ రెండే ఉన్నాయి. అంటే మనలో ఎవరో ఇద్దరుమాత్రం, తమ జీవితాలను వో వంద సంవత్సరాలు పెంచుకోవచ్చు. ఈ మధ్యలో గుహద్వారాలు తెరుచుకోబడితే, వారు హాయిగా స్వేచ్ఛావాయువులను పీల్చవచ్చు.

సో, ఇప్పుడు యీ రెండు గుళికలు మనకో పెద్ద సవాల్. మనలో ఎవరయినా ఓ యిద్దరు ప్రాణత్యాగం చేయాలి,

ఇప్పుడు మన నలుగురిలో ఏ యిద్దరు ప్రాణత్యాగం చేస్తారో నిర్ణయించుకోవాలి. ప్లీజ్ ప్రొసీడ్," చెప్పి అలసటగా కళ్ళు మూసుకున్నాడు ప్రొఫెసర్.

ప్రొఫెసర్ గంభీరమైన మాటలు వింటూ అంతా నిశ్శబ్దంగా వుండిపోయారు.

ముగ్గురూ, ఎవరికివారే తీవ్రంగా ఆలోచించసాగారు.

బ్యాటరీలయిటు కాంతి బాగా క్షీణించిపోతోంది.

"ప్రొఫెసర్ జీ! మీరూ, నేనూ చెరో గుళికను స్వీకరిద్దాం" మెల్లగా అన్నాడు విలియం.

"నో. అది అన్యాయం," అరిచారు కాంతారావు, లూసీలు.

ప్రొఫెసర్ మెల్లగా కళ్ళు తెరిచాడు.

విలియం ఆశగా ప్రొఫెసర్ వైపు, అతని చేతిలోని పేటిక వైపు చూస్తున్నాడు.

కాంతారావు నిరసనగా విలియంవైపు చూస్తున్నాడు.

బేలగా చూస్తున్న లూసీ కళ్ళనుండి కన్నీళ్లు కారుతున్నాయి.

"డియర్ విలియం!" వణుకుతున్న కంఠంతో అన్నాడు ప్రొఫెసర్.

"మీరు యువకులు. నేను వృద్ధాప్యంలోకి ప్రవేశించాను. నాకు జీవితంమీద పెద్దగా యిచ్ఛలేదు. కాబట్టి నాకు ఆ గుళికవద్దు. నేను నా ప్రాణాన్ని ఆనందంతో త్యజిస్తాను. ఇకపోతే మీ ముగ్గురిలో ఒకరు నాతో పైకి రావలసివస్తుంది. అది మీరే నిర్ణయించుకోండి."

ఓ క్షణం ఆగి మళ్ళీ చెప్పసాగాడు.

"మీ అందరిలో పెద్దవాడిగా నేను మీకు ఓ సలహా ఇవ్వదలచుకున్నాను. అదేమిటంటే, ఆ గుళికలు స్వీకరించే ఇద్దరూ స్త్రీ-పురుషులయితే బావుంటుంది. ఇద్దరూ పురు

షులే తీసుకున్నందువలన ప్రయోజనంలేదు. జీవితాంతం నిస్సారంగా బ్రతకాలి, నిస్పృహాతో గడపాలి. అలా బ్రతికి ప్రయోజనంలేదు. అదే ఇరువురూ స్త్రీ - పురుషు అయితే, నూతన సృష్టికి మీరే కారకులవుతారు. ముందు చరిత్రలో 'ఆడమ్ యీవ్'లా ప్రశిద్ధి చెందుతారు. కాబట్టి మీ ఇద్దరు పురుషులలో ఒకరు ప్రాణత్యాగం చేయండి. లూసీకి తప్పనిసరిగా నూతన జీవితాన్ని ప్రసాదించండి," చెప్పాడు ప్రొఫెసర్.

ప్రొఫెసర్ మాటలు వినగానే, కాంతారావులో నూతన ఉత్సాహం పరవళ్ళు త్రొక్కింది.

"మీరు చెప్పింది అక్షరాల నిజం సార్. స్త్రీ-పురుషులు బ్రతికివుంటే సృష్టికి తోడ్పడవచ్చును. నేనూ, లూసీ ప్రేమించుకున్నాం సార్. మీకు ఎప్పటినుండో చెప్పాలను కొంటూనే చెప్పలేకపోయాం. కాబట్టి ఆ రెండు గుళికలు నాకూ, లూసీకి ఇవ్వండిసార్," అర్థించాడు కాంతారావు.

ప్రొఫెసర్, విలియంవైపు చూశాడు.

విలియం కళ్ళు కోపంతో ఎర్రగా మండుతున్నాయి.

"ప్రొఫెసర్, ఇది అన్యాయం. లూసీ, నేనూ ఒకజాతి వాళ్ళం. మా ఇరువురి సాంగత్యం వలన మహోన్నత జాతి ఉద్భవిస్తుంది. అదీగాక, నేను లూసీని యూనివర్సిటీలో ఉండగానే ప్రేమించాను. కాంతారావు మధ్యలో అడ్డు తగలకపోతే, మేమెప్పుడో వివాహం చేసుకొనేవాళ్ళం. కాబట్టి లూసీకి, నాకూ ఆ గుళికలు ఇవ్వండి. మాకు పుట్ట బోయే సంతానానికి మీ పేరు పెట్టుకుంటాం," అన్నాడు విలియం.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

"లూసీ, నీ అభిప్రాయ మేమిటి?"

పేలవంగా నవ్వింది లూసీ.

"సర్! నాకు కాంతారావుమీద మనసుంది. అంతకన్న ఏమీ చెప్పలేను. ఎందుకనంటే, ఇప్పుడున్న ఈ ఇరువురు పురుషులలో ఎవరో ఒకరు నా భర్త కావలసిందే! ప్రాణ త్యాగం చేసిన వ్యక్తిని నేను పూజ్యుడిగా భావిస్తాను."

"అలాకాదు లూసీ! నువ్వు విలియంను ప్రేమించగలవా?" అడిగాడు ప్రొఫెసర్.

"సార్, మీరు చాలా అన్యాయంగా మాట్లాడుతున్నారు. లూసీ నన్ను ప్రేమిస్తోంది," మధ్యలోనే అరిచాడు కాంతారావ్.

"ప్లీజ్, నువ్వాగు కాంతారావ్. అఁ చెప్పు లూసీ?"

ఓ నిమిషం ఇద్దరినీ పరిశీలనగా చూసింది లూసీ.

"నా కెవరయినా ఫర్వాలేదు ప్రొఫెసర్‌జీ! కానీ కాంతారావు నా భర్తయితే సంతోషిస్తాను" అంది.

"నో. ఇటీజ్ ఇంపాజిబుల్. నువ్వు నా దానివి కావలసిందే," కోపంగా అరిచాడు విలియం.

అతని ముక్కుపుటాలు కోపంతో అదురుతున్నాయి.

"మిస్టర్ విలియం! అది అసంభవం. లూసీ నాది. నువ్వు మర్యాదగా ప్రాణత్యాగంచేయి. ప్రొఫెసర్, ఆ గుళికలు ఇటివ్వు," ప్రొఫెసర్ మీదకు దూకాడు కాంతారావు.

క్షణకాలంలో ప్రొఫెసర్ చేతిలోని పేటిక అందుకున్నాడు కాంతారావు.

"మిస్టర్ కాంతారావ్, హాండ్సప్! ఆ గుళికమీదకు నీ చేయి వెళ్ళిందంటే కాల్చేస్తాను," తుపాకీ గురిపెట్టాడు విలియం.

మాత తెరవబోతున్న కాంతారావ్ తెల్లబోయాడు.

లూసీ, ప్రొఫెసర్‌లు ఆ హఠాత్సంఘటనకు అదిరిపోయారు.

అలా జరుగుతుందని వూహించని ప్రొఫెసర్ అదిరిపో

సాగాడు.

"మిస్టర్ కాంతారావ్! మర్యాదగా ఆ పేటిక ఇలా ఇవ్వు. లేదా, మరికొంచెం సేపటిలో చావబోయే నీవు ఇప్పుడే వికృతంగా ఛస్తావ్. క్విక్," అరిచాడు విలియం.

కాంతారావు మనసు పరిపరివిధాల పోసాగింది.

ముందు తన ప్రాణాలు కాపాడుకోవాలి. ఎలా?

విలియం తన ప్రాణాలు పోవడానికి ఒప్పుకోవడంలేదు. తనూ, విలియం ఇద్దరూ బ్రతకాలంటే లూసీ చావాలి.

అవును. లూసీ చావాలి!

తను బ్రతికుంటే చాలు. ఆడదానిపొందు లేకపోయినా బాధలేదు. ప్రాణాలు ముఖ్యంకానీ, పొందు ముఖ్యంకాదు.

"మిస్టర్ విలియం, నేనొక రాజీమార్గం చెబుతాను. వింటావా?" అడిగాడు.

"చెప్పు?" తుపాకీ గురి మార్చకుండానే అన్నాడు.

"మనిద్దరం జీవిద్దాం!"

"అంటే?"

"లూసీ ప్రాణత్యాగం చేస్తుంది. ఈ రెండు గుళికలు మనిద్దరం తీసుకుందాం. ప్రాణాలుంటే చాలు. పొందులేక పోతేనేం?" చెప్పాడు కాంతారావు.

ఓ నిమిషం ఆలోచించాడు విలియం.

"ఆల్ రైట్. అలాగే!" తుపాకీ దించాడు.

లూసీ మొఖం పాలిపోయింది. కళ్ళలో భీతి కొట్టవచ్చి నట్లు కనబడుతోంది. బెదురుగా ప్రొఫెసర్ వైపు చూసింది.

"ఆగండి" ప్రొఫెసర్ అరిచాడు.

"మీకసలు జ్ఞానంవుందా? ప్రాణంమీద తీపితో భవిష్యత్ ను ఆలోచించడంలేదు. ఈ విశాల విశ్వంలో ఇద్దరు పురుషులుండి ఏంచేస్తారు? సృష్టికార్యానికి మీరు ఏం సహాయం చేయగలరు? అలా జరగడానికి వీలులేదు. లూసీ

జీవించాలి. మీ ఇద్దరిలో ఎవరు జీవిస్తారో తేల్చుకోండి. లేదా, లాటరీ వేద్దాం," అన్నాడు ప్రొఫెసర్.

ఇద్దరూ కాసేపు ఆలోచించారు.

"ఆల్ రైట్! మీరే లాటరీ వేయండి" అన్నాడు కాంతారావు గుళికల పేటికను, తుపాకిని ప్రొఫెసర్‌కు అందిస్తూ.

ప్రొఫెసర్ జేబులోనుండి రూపాయిబిళ్ళ తీశాడు.

"బొమ్మ నాది" అన్నాడు కాంతారావు.

"ఆల్ రైట్, నాది బొరుసు" అన్నాడు విలియం.

ప్రొఫెసర్ కాయిన్ ఎగరవేశాడు.

పైకెగిరిన నాణెం గింగిరాలు తిరుగుతూ క్రిందపడింది.

అంతా ఆత్రుతగా అటు చూశారు.

బొమ్మ పడింది.

గర్వంగా చూశాడు కాంతారావు విలియంవైపు. విలియం ముఖం నల్లబడింది.

బ్యాటరీలైటు కాంతి బాగా క్షీణించిపోతోంది. ఆకారాలుమాత్రం లీలగా కనబడుతున్నాయి.

"సారీ ప్రొఫెసర్‌జీ! నేను కాంతారావును చేసుకోను," అంది లూసీ దృఢంగా.

అదిరిపడ్డాడు కాంతారావు. ఒక్క వెలుగు వెలిగాడు విలియం.

"ఎందుకని లూసీ? నువ్వే అతన్ని కోరుకున్నావుగా!" అడిగాడు ప్రొఫెసర్.

చిన్నగా నవ్వింది లూసీ.

"అతను కిరాతకుడు ప్రొఫెసర్. తనప్రాణం కాపాడుకోవడానికి నా చావును కోరాడు. అలాంటి వ్యక్తితో నేను జీవించలేను. కాబట్టి నేనొక నిశ్చయానికి వచ్చాను."

"ఏమిటది?" అంతా ఆత్రుతగా అటుచూశారు.

"మరొకరి ప్రాణంకోసం, మీ ప్రాణాన్ని త్యజించ

దానికి సిద్ధపడ్డ మీ వ్యక్తిత్వం నన్నాకర్షించింది. మీకు పెద్ద వయస్సేమీ మించిపోలేదు. అందులోనూ బ్రహ్మచారులు. అందుకే మిమ్ములను వివాహమాడదామనుకొంటున్నాను.

మీ విజ్ఞానం, నా అందం కలిస్తే అపురూపమైన సృష్టి ఆరంభమవుతుంది," అంది లూసీ.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

"థాంక్యూ మిస్ లూసీ! నువ్వేమంటావ్ కాంతారావ్? నీ కంగీకారమేనా?" అడిగాడు ప్రొఫెసర్.

కాంతారావు హృదయం భగ్గుమంది.

చటుక్కున క్రిందవున్న తుపాకీ అందుకొని ప్రొఫెసర్‌కు గురిపెట్టాడు.

"ప్రొఫెసర్! ఎంత నాటకమాడావు? చివరకు మా ఇద్దరికీ గాకుండా లూసీని పొందుదామనుకొంటున్నావా? అది అసంభవం! నేను బ్రతకాలి. లూసీ నాదికావాలి. నవ ప్రపంచానికి మేమే జీవదాతలం కావాలి. ఇప్పుడే అడ్డు వున్న మీ ఇద్దరినీ కాల్చేస్తాను."

"మిస్టర్ కాంతారావ్! నేను చెప్పేది విను," ఓ అడుగు ముందుకు వేశాడు ప్రొఫెసర్.

"ప్రొఫెసర్, కదలక! నీ ఇష్టదైవాన్ని ప్రార్థించుకో" ట్రిగ్గర్ పై వేలు బిగించసాగాడు కాంతారావు.

అప్పటివరకు మౌనంగా చూస్తున్న విలియం, మెరుపులా కాంతారావు మీదకు దూకాడు.

తుపాకీ దూరంగా వెళ్ళి క్రిందపడిపోయింది.

కాంతారావ్ కాలితో బలంగా విలియం డొక్కలో తన్నాడు. విలియం ధభీమని క్రిందపడ్డాడు. తేరుకొని మీద పులిలా పడబోతున్న కాంతారావు గుండెలపై బలంగా తన్నాడు. కాంతారావు వెల్లకిలా పడ్డాడు. క్రిందపడ్డ కాంతారావు మళ్ళీ లేవకుండా ఎగిరి అతని గుండెలపై

కూర్చొని గొంతుపట్టుకొని పిసకసాగాడు విలియం.

చటుక్కున ఆ గుహలో మెరుపు మెరిసినట్లు వెలుగు ప్రసరించింది.

చేతిలో కొత్త టార్చిలయిట్ పట్టుకొని ప్రొఫెసర్ జయరాం పకపక నవ్వసాగాడు.

"మిస్టర్ విలియం! అతన్ని చంపకు. లేవండి. ఇదంతా నాటకం," పెళ పెళా నవ్వాడు ప్రొఫెసర్.

అదిరిపడి లేచి నిల్చున్నా రిద్దరూ. లూసీ ఆశ్చర్యంగా ప్రొఫెసర్ వైపు చూడసాగింది.

"వాట్ ప్రొఫెసర్ జీ? ఏమిటిది?" అడిగారంతా ముక్త కంఠంతో.

"అవును మైడియర్ స్టూడెంట్స్! ఇదంతా నే నాడిన నాటకం. ప్రళయం రాలేదు. కలియుగం అంతంకాలేదు. మీకు స్పృహతప్పి అయిదుగంటలుకూడా కాలేదు. ఆ గడియారంలోని డేట్ నేనే మార్చాను," నవ్వుతూ అన్నాడు ప్రొఫెసర్.

అంతా ఆశ్చర్యపోయారు.

"ఏమిటీ మాయ? ఎందుకలా చేశారు? మరి మనం వచ్చిన గుహద్వారం కనబడదే?" అడిగాడు విలియం.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

"ఇటీజ్ వెరీ సింపుల్. మిమ్ములను తప్పుదారిలో యిటు తీసుకవచ్చాను. ఇటు ఎంతదూరం వెదికినా, గుహ అంత ర్భాగం కనిపిస్తుందేకానీ, ముఖద్వారం కన్పించదు. అదుగో అటు వెళితే ముఖద్వారం వస్తుంది. రాత్రిపూట అవడంవలన వెలుగు లోపలకు రావడంలేదు" చెప్పాడు ప్రొఫెసర్.

"ఎందుకింత నాటకం ఆడారు ప్రొఫెసర్? ఏమాత్రం క్షుతిమించినా, నేను మిమ్ములను చంపేవాడిని, లేదా

విలియం నన్ను చంపేవాడు. మీరెందుకిలా చేశారో నాం కర్థంకావడంలేదు,'' కోపంగా అడిగాడు కాంతారావు.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ జయరాం.

"డియర్ స్టూడెంట్స్! ఆరోజు జరిగిన వాగ్వివాదాలను ఒక్కసారి గుర్తుతెచ్చుకోండి.

మనలో పేరుకొనిపోయిన స్వార్థచింతన, ఆవేశకావేషాలు, రాగద్వేషాలు, ఈర్ష్యాసూయలు, కామక్రోధాలకు ఆ కటిలసంఘమే కారణమని, ఆ కుళ్ళిపోయిన సంఘానికి సుదూరంగావుంటే మనం ఆ దుర్గుణాలకు అతీతంగా జీవనం సాగించవచ్చునని మీరు సవాల్ చేశారు.

అలా జీవించలేము. అవి మానవుడిని సర్వకాల సర్వావస్థలయందు అంటిపెట్టుకొనే ఉంటాయని, అవి మనిషిని అంత తొందరగా వదలవని నేను సవాల్ చేశాను.

మీకు నిజం తెలియడంకోసం, నేను నా వాదనను నిరూపించుకోవడంకోసం ఈ ప్రాక్టికల్ ప్లే ఆడాను.

సో, ఈ సరికి మీ కందరికీ అర్థమైపోయిందనుకుంటాను. ప్రయాణం ప్రారంభమయినప్పటినుండీ గమనిస్తున్నాను. మీ మనస్సు మీకే నిలకడగా ఉండటంలేదు. అనుక్షణం మీలో చెలరేగే ఆత్మసంఘర్షణలను గమనిస్తూనే వున్నాను.

ఏదైనా సమయం వస్తేనేకానీ వారిలోని సుగుణాలు కానీ, దుర్గుణాలు కానీ బయటపడేవి. ఇప్పుడు చూడండి. ఈ అరగంటలో ప్రాణాలకోసం ఒక్కొక్కరు ఎంత పరితపించిపోయారో? మీలోని స్వార్థం ఎన్ని వెర్రితలలువేసిందో మీలోని ఈర్ష్యాసూయలు ఎలా విశృంఖల విహారంచేసినాయో చూశారా?'' గంభీరంగా అన్నాడు ప్రొఫెసర్.

అంతా సిగ్గుతో తలలువంచుకున్నారు.

"క్షమించండి సర్! నగ్నసత్యాలు తెలుసుకోలేక మొండిగా వాదించాం. మీరు చేసిన వాదనే కరెక్ట్! స్వార్థ చింతన, ఆవేశకావేషాలు, రాగద్వేషాలు, కామక్రోధాలు యివి మనల్ని అంటిపెట్టుకొని వుంటాయి. మనం ఎంత సుదూర ప్రాంతాలకు వెళ్ళినా-అవి మనలను వదలవు. మన జీవితంలో అవికూడా భాగాలే!" అంగీకరించారు అంతా.

ప్రొఫెసర్ తృప్తిగా నిట్టూర్చాడు.

— : ఐ పో యిం ది : —




టకటకమంటూ బూట్ల చప్పుడయింది.

ఎవరో సెల్యూట్ చేసినట్లు, బూటు నేలకేసి 'టప్'మని కొట్టిన శబ్దమైంది.

''ఖైదీ ఏంచేస్తున్నాడు'' అడిగారెవరో.

''ఇంకా స్పృహ వచ్చినట్లు లేదు సార్!'' చెప్పింది కానిస్టేబుల్ లాగుంది.

నాకంతకుముందే స్పృహ వచ్చింది. నేలమీద బోరగిలా పడివున్నాను. సిమెంటుతో చేసిన గచ్చు నా మొఖానికీ, అరచేతులకు చల్లగా తగులుతూంది.

కళ్ళు తెరిచేందుకు ప్రయత్నించాను. కానీ లాభంలేక పోయింది. తెరవబోతే రెప్పలు విడివడలేదు. కణతలు పగులుతున్నాయి. తల దిమ్ముగావుంది. కాళ్ళు నిస్సత్తువగా వున్నాయి.

గది తలుపులకున్న గొళ్ళెంలాగిన శబ్దమైంది.

ఎవరో తలుపు తెరుస్తున్నారనుకున్నాను. మరు నిము

షంలో కిర్రుమంటూ శబ్దమైంది. అంటే తలుపు తెరిచారనుకున్నాను.

“ఖైదీ! ఖైదీ!!” పిలుస్తూ, నా కాళ్ళను బూటుకాలితో తంతున్నారెవరో. పలకాలనుకున్నాను. నోరుపెగలి మాట రాలేదు.

అతను మళ్ళీ పిలిచాడు.

మళ్ళీ బదులు చెపుదామని ప్రయత్నించాను. లాభంలేక పోయింది.

“సార్! ఇంకా స్పృహరాలేదు సార్,” అన్నాడు జవాను.

“ఇరవైనాలుగు గంటలనుండి అతనలాగే పడున్నాడు. ప్రాణం వుందో, లేదో చూడండి! ఈ నాలుగు గోడలమధ్య ఛస్తే మనప్రాణాని కొస్తుంది!” హెచ్చరించాడు హుందాగా.

మళ్ళీ ఎవరో నా దగ్గరకు వస్తున్న కాలి బూట్లశబ్దమైంది. అతనువచ్చి నా ముక్కుదగ్గర అరచెయ్యి పెట్టాడు.

“గాలి పీలుస్తున్నాడు సార్!!’ అరచాడు ఆనందంగా.

“కాసిని చల్లనీళ్ళు తెచ్చి మొహంమీద చల్లు,” దూరం నుండి వినిపించిందెవరిదో హుకుం. అతను ఇన్‌స్పెక్టరయి వుంటాడనుకున్నాను. అందరి మాటలు నాకు వినబడుతున్నాయి. కానీ కళ్ళు తెరవలేకపోతున్నాను. కాళ్ళు కదలించలేకపోతున్నాను. ఎక్కడి కీళ్ళు అక్కడ విరిగి పోయినట్లున్నాయి.

మొఖంమీద చల్లగా తగిలింది. అతనెవరో విసురుగా గ్లాసుడు నీళ్లు నాపైన చల్లాడు. దాంతో చర్మంలోనుండి ఆవిరి పైకి తన్నుకొచ్చింది. కనుగుడ్లు మండాయి. మరు నిము

మంలో రెప్పలు కదిలాయి. కళ్లు తెరిపిడి పడ్డాయి.

“లేవోయ్! లే!” వీపుమీద ఎవరో కొట్టారు.

కాళ్లు, చేతులు అతికష్టంమీద కదలించాను. గుండె నిండా గాలి పీల్చుకుని వదిలాను. దెబ్బతో కొత్తశక్తి వచ్చినట్లయింది. మోకాళ్లు నేలకానించి, అరచేతుల్తో భూమిని అదిమిపెట్టి పైకిలేచాను. విచిత్రం? నేను లేవగలిగాను.

“సార్! లేచాడు సార్! ఖైదీ పైకిలేచాడు!!” నా కెదురుగా వున్న జవాను ఆనందంతో అరుపులు పెట్టాడు.

నా పేరు వాళ్ళకు తెలిసినట్లులేదు. అందుకే ‘ఖైదీ’ అంటున్నారనుకున్నాను.

బూట్లు చప్పుడు చేసుకుంటూ మరెవరో రావటం గమనించాను.

నన్ను సాయంపెట్టి పైకిలేపి భుజాలమీద వేసుకుని, లాకప్ రూంలోంచి ముందున్న ఆఫీస్ గదిలోకి లాక్కొచ్చారు. ఒక కుర్చీలో మెల్లగా కూర్చోపెట్టారు.

వేడి కాఫీకప్పు నా ముందుంచారు. ఒక్క గుక్క త్రాగాను. అమృతం త్రాగినట్లుంది. వడివడిగా కప్పుకాఫీ ఖాళీచేశాను.

నాలో క్రొత్త చైతన్యం పుంజుకుంది. నీరసం తగ్గింది.

“నీ పేరేమిటి?” అడిగాడు ఎక్సైజ్ ఇన్‌స్పెక్టర్.

“రాజా” చెప్పాను.

“మీ గాంగులో మొత్తం ఎంతమందున్నారు?”

“తెలీదు!”

“మీ నాయకుడెవరో తెలుసా?”

“తెలీదు!”

“మీ స్థావరం ఎక్కడ?”

తెలీదన్నట్లు తలూపాను.

"అడిగిందానికి తెలీదంటూ చెపితే ప్రయోజనంలేదు. నీకన్నీ తెలుసు. మాకు నువ్వు ఖైదీగా చిక్కావ్! నీచేత నిజం కక్కించేందుకు నానాహింసలు పెడతాం. ఇప్పుడు గాకున్నా అప్పుడయినా చెప్పాలి! ఆ బాధలను భరిస్తూ చెప్పేకన్నా ముందే చెప్పడం మంచిది!" హితబోధ చేశాడు హిప్పీలా పెంచిన జుట్టు ఎడంచేత్తో సర్దుకుంటూ ఇన్‌స్పెక్టర్.

"నన్ను చంపినా ఆ వివరాలు దొరకవు. కారణం, నాకూ తెలీవు."

ఆమాట వినగానే ఎదురుగావున్న ఇన్‌స్పెక్టర్‌కు నాపై కోపం ముంచుకొచ్చింది లాగుంది. టేబుల్ పైనున్న లాఠీతీసి తలపైన బాదాడు.

"అమ్మో!" అని అరిచాను.

చట్టం నాకూ తెలుసు. యం. ఏ. దాకా చదువుకున్నాను. ఉద్యోగం చిక్కక, కడుపునిండక, అల్లాడుతున్న రోజుల్లో, నాకా గ్యాంగ్ తటస్థపడింది. వాళ్ళల్లో ఒకడిగా వుండి చెప్పిన పనిచేస్తే బాగా ముట్టజెపుతామన్నారు. సరే నన్నాను.

వాళ్ళదో పెద్దరాకెట్. స్వంతంగా రెండు మోటారు బోట్లున్నాయి. కావలసినన్ని ఆయుధాలు, వాటికి సరిపడ్డ అమ్యూనిషన్, రెండు రహస్య భూగృహాలు, నలభైమందికి పైగా మెంబర్లూ వున్నారు.

వారం వారం సరుకు వస్తుంది. ఈలోగా సేకరించిన గంజాయి, నల్లమందు, వగైరాలు మోటారు బోట్లలో పట్టుకెళ్ళి సముద్రతీరంలో లంగరువేసిన స్టీమర్‌కు అందిస్తారు. అక్కడ్నుంచి బంగారు, వాచీలు, టేప్‌రికార్డర్లు మొదలైన

రకరకాల సరుకులు తీసుకొస్తారు. వాటిని మా అందరికీ పంచుతారు. దేశంనిండా ఖాతాలున్నాయి.

వారంలోగా సరకంతా అమ్మి వేయ్యాలి. ఆ డబ్బుతో గంజాయిలాంటివి కొనుక్కురావాలి.

ఈ ముఠాలో నేను చేరి రెండేళ్ళయింది. దర్జాగా బ్రతుకు తున్నాను. బొంబాయినుండి కాశ్మీరుకు విమానంలో వంద సార్లు వెళ్ళాను. పారడైజ్ హోటల్లో రోజుకు వంద రూపాయలద్దెయిచ్చి ఎన్నో రోజులున్నాను. ఫారిన్ సిగరెట్లు త్రాగుతున్నాను. ఫారెన్ సూట్లు వేస్తున్నాను.

నా శరీరం, అందులో ప్రవహించే రక్తం మాత్రమే ఇండియావి. దాన్ని కాపాడేవి, అలంకరించేవి మొత్తం ఫారిన్ వే.

అంతకుముందు రోజు శాంతక్రజ్ లో విమానంలోనుండి వచ్చి దిగాను.

పాసెంజర్ లాంజ్ లో అడుగుపెడుతూండగానే ఎక్సైజు వాళ్లు నా లగేజి సోదాచెయ్యాలన్నారు. ఇలా ఎప్పుడూ జరుగలేదు. జరుగనిస్తే నన్ను జైల్లో వేస్తారు. రివాల్వరు గుండ్లతో కాల్చుకుంటూనైనా నేను వెలుపలికి వెళ్ళాలి. తప్పించుకోవాలి.

హిప్ పాకెట్ లో వుంది ఆయుధం. చెయ్యి వెనక్కి పెట్టాను.

వాళ్లు అసాధ్యులుగానున్నారు. నా ప్రయత్నం కనిపెట్టారు.

"చేతులెత్తు!" అరచాడు ఇన్ స్పెక్టర్. అతని చేతిలోని రైఫిల్ మెరిసింది. నా ప్రయత్నం మానుకున్నాను.

మరొక జవానొచ్చి చేతులకు బేడీలు తగిలించాడు. ఫైట్ కోసం ఎదురుచూస్తున్న జనం మా చుట్టూ గుమి

గూడారు. అందులో అందమైన ఆడవాళ్లుకూడా వున్నారు.

వాళ్ళందరి ముందు బేడీలు తగిలించిన చేతుల్ని చూసు కుంటే అవమానం, కోపం, అసహ్యం కలిగాయి నాకు నామైనే.

ఎక్సైజ్ ఇన్స్పెక్టర్ ముందు నడిచాడు. నేను అతని వెంటబడ్డాను. నా వెనుక నలుగురు జవాన్లు వున్నారు. టెర్మి నల్ బిల్డింగ్ దాటేలోగా వాళ్ళను తప్పించుకోవాలని తీర్మా నించుకున్నాను.

"బాత్ రూం ప్లీజ్!" అన్నాను.

"అర్జెంటా!" అడిగాడు ఇన్స్పెక్టర్.

అవునన్నట్లు తలూపాను.

బాత్ రూం చూపించారు.

నేను వెళ్ళాను లోనికి. మిగిలిన వాళ్ళంతా తలుపతే వున్నారు. నా చేతులకు బేడీలు వుండటంతో బటన్స్ విప్పు కోవటం చేతకాలేదు.

తలుపు దగ్గరకొచ్చి ఒకతన్ని లోనికి పంపమన్నాను.

ఇన్స్పెక్టర్కు నా సమస్య అర్థమయింది. ఒక జవానుని వెళ్ళమని సంజ్ఞ జేశాడు. అతను లోనికొచ్చాడు.

కాలితో తలుపునుమూసి తన్ని పెట్టాను. పాంటు బటన్లు విప్పేందుకు నా ముందు వంగాడు జవాను. అంతకుముందు అతని రైఫిల్ క్రిందపెట్టాడు.

వంగిన అతని తలమీద బేడీలతోవున్న రెండు చేతుల్ని పైకెత్తి శరీరంలోవున్న శక్తినంతా చేతుల్లోకి తెచ్చుకుని, బలంగా నెత్తిమీద మోదాను. "అమ్మో" అంటూ తూలి పడ్డాడు నా కాళ్ళపైన.

వెంటనే కాళ్ళతో చావదన్నాను. అతికష్టంమీద బాత్ రూం లోపల గడియపెట్టాను. వంగి కూర్చుని రైఫిల్ అందుకున్నాను.

చుట్టూ గమనించాను. వెలుపలికి వెళ్ళేందుకు వేరేదారి లేదు.

లోనికొచ్చిన డోర్ గుండానే బయటకుపోవాలి. బయట నాకోసం సిద్ధంగా వున్నారు ఎక్సైజ్ స్టాఫ్ ఆయుధాల్తో.

తొందర పడ్డాననిపించింది.

ఖైదీగా వాళ్ళకు చిక్కకూడదన్న ఆరాటంలో అలా చేశానే తప్ప, ఆ తర్వాత తప్పించుకునే మార్గమేమీ లేనందుకు, కోపంతోపాటు భయంగూడా పుట్టుకొచ్చింది.

లెట్రిన్ తలుపు తీశాను. వెనకవేపు వెంటిలేటర్ వుంది. దానికి అద్దంలేదు. కమ్ములుగూడా లేవు. దూకి వెలుపలకు వెళ్ళొచ్చు. కానీ చేతులకు బేడీలున్నాయి. ఎంతో ప్రయత్నించాను. పట్టుదొరకలేదు.

వెలుపల తలుపు తడుతున్నారు. అరుస్తున్నారు. పిలుస్తున్నారు. వాళ్ళ జవాన్ని పేరుపెట్టి పెద్దగా పిలుస్తున్నారు.

నా ప్రయత్నం ఎక్కువైంది. చేతులుపైకి లేవడంలేదు. వెంటిలేటరు అంచును అందుకోగలిగితే సునాయాసంగా నేను వెలుపలకు దూకిపోగలను. అదే సాధ్యం గావడంలేదు.

తలుపులు బాదుతున్నారు.

రెండు నిముషాల్లో లోపలికి వచ్చేశారు తలుపులు విరగగొట్టుకుని. క్రింద అచేతనంగా పడున్న జవాన్ని చూడగానే వాళ్ళలో కోపం కట్టలు తెంచుకున్నట్లుంది.

ఒక్క ఉదుటున లెట్రిన్ వైపొచ్చిన నన్ను లాగారు. నలుగురు లాఠీలతో చితకబాదారు. అరచే ఓపికకూడా

పోయింది. తలమీద బలమైన దెబ్బతగిలింది. కళ్లు బైర్లు కమ్మాయి. చిక్కటి చీకటి పేరుకుంది.

అంతే! ఆ తర్వాత ఏమయిందీ నాకు తెలీదు.

"నీ దగ్గరున్న బ్రాండ్ కేస్‌లో గంజాయివుంది. దాని ఖరీదు ఐదులక్షల రూపాయలుంటుంది. ఎక్కడ్నుంచి తెచ్చావ్?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"నాకు తెలీదు!"

"అడిగిన ప్రతిప్రశ్నకు జవాబు తెలీదంటూ బుకాయించి ప్రయోజనంలేదు. నీకు తిండిలేకుండా మాడుస్తాను. నిజం చెప్పిందాకా లాకప్‌లో వుంచుతాను."

"అది చట్టవిరుద్ధం! నామీద కేసు రిజిస్టరుచేసి, కోర్టులో నన్ను హాజరుపరచండి" అన్నాను నేను కనీసం వీళ్ళదగ్గర తన్నులు తినడం తప్పుతుందన్న ఆశతో.

"చట్టం నాకూ తెలుసు. నీమీద కేసు రిజిస్టరు చెయ్యను. నీ గ్యాంగ్ వివరాలు వాళ్ళెక్కడున్నదీ అంతా చెప్పాక, ఆ తర్వాత నిన్ను అత్తగారింటికి పంపే ఏర్పాటుచేస్తాను," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

నాకు నోటమాటరాలేదు. నన్ను మళ్ళీ లాకప్ రూంలో నెట్టి తాళాలేశారు.

బాగా ఆకలవుతూంది. సిగరెట్ త్రాగాలనిపిస్తోంది. మామూలు పోలీసులకన్నా ఎక్సైజ్ వాళ్లు అన్యాయం. నన్ను అన్నంపెట్టకుండా మాడ్చి చంపుదామనుకుంటున్నారు లాగుంది.

హోటల్ ప్యారడైజ్ కళ్ళముందు మెదిలింది. నేను మామూలుగా దిగే రూం గుర్తుకొచ్చింది.

ఆ రూంకోసం వాళ్ళతో అల్లరిపెట్టుకునే వాణ్ణి. అక్కడ్నుంచి డాల్ లేక, దాని వెనుకనున్న సుందరమైన ఉద్యాన వనాలు కన్పిస్తాయి. సాయంత్రం వేళల్లో వరండాల్లో బాస్కెట్ ఛెయిర్ వేసుకుని, విస్కీ సీసాముందు పెట్టుకుని, త్రాగుతూ, ఆ సీనరీచూస్తూ ఆనందించే వాణ్ణి.

ఆ హోటల్‌లో ఎంతమందో అందమైన అమ్మాయిలున్నారు. రేటు ఎక్కువ. అయినా ఆనందం అందిస్తారు. ఆపిల్ పళ్ళలాగుంటారు. వాళ్ళ రంగు, యవ్వనంపొంగు, నాకెంతో ఇష్టం.

జీవితాంతం అలా గడిచిపోతే బాగుండు ననిపించేది. ఇంత త్వరగా నేను వీళ్ళచేతుల్లో పడిపోతాననుకోలేదు.

మూడువేపులా కిటికీలులేని రాతిగోడలు, నాలుగోవైపు లావుపాటి ఇనుప కమ్ములతో తయారుచేసిన తలుపు, దానికి తగిలించిన రెండు కిలోల బరువున్న లాక్, దానివెనుక అస్తమానమూ పహరా తిరుగుతున్న జవాన్లు. మధ్య నేను ఖైదీగా ఆకలితో చచ్చిపోతానేమోనని భయంవేసింది.

నేను చావగూడదు.

జీవించాలి! ఆనందం జుర్రుకోవాలి. మళ్ళీ ప్యారడైజ్ హోటల్, విస్కీ బాటిల్, లక్కీస్ట్రైక్ సిగరెట్, కాశ్మీర్ అమ్మాయిల యవ్వనం, అన్నీ గుర్తొచ్చాయి. నాకవన్నీ కావాలనిపించింది.

ఆలోచించసాగాను అక్కడ్నుంచి తప్పుకునే మార్గంకోసం. మెదడు వేడెక్కింది.

గ్యాంగ్‌వాళ్లు గుర్తొచ్చారు. నిన్న తనకోసం ఎదురుచూస్తుంటారు. అందరూ హెడ్‌క్వార్టర్సులో తిరిగివస్తారు.

తెచ్చిన సరకంతా పాక్ చేసుకుని, ఈ రాత్రికి 'జూహూ' బీచికి రెండుమైళ్ల క్రింద చేరతారు. అక్కడ చెట్లల్లో దాచి వుంచిన మోటారు బోట్లను సముద్రంలోకి తోసుకొనిపోయి మూడుమైళ్ళ దూరంలో ఆగివున్న స్టీమరు దగ్గరకు వెళ్తారు. క్రొత్త సరుకు అందుకుంటారు. మళ్ళా రేపు ఎవరి ఊళ్ళకు వాళ్లు వెళ్ళిపోతారు.

నా కోసం వాళ్లు వెతుకుతారా? ఏమో?

నేను గ్యాంగ్ లో కలిశాక, నాలా ఎవ్వరూ పట్టుబడ లేదు.

పట్టుబడ్డ వాళ్ళెవరూ గ్యాంగ్ రహస్యాలు చెప్పకూడ దనీ, చావుకూడా సిద్ధపడాలనీ నియమముంది.

ఖైదులోంచి తప్పించేందుకు గ్యాంగ్ ప్రయత్నంచేస్తుందని విన్నాడు. నన్నుగూడా వాళ్ళొచ్చి రక్షిస్తే బాగుండు నని పించింది.

అలా ఆలోచించుకుంటూనే నిద్రపోయాను.

మళ్ళీ కళ్లు తెరిచేసరికి ఎక్సైజ్ ఇన్ స్పెక్టర్ ఎవరితో తంతున్నాడు.

ఎవరాని లేచిచూశాను. ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం. దుబ్బు మీసాలు. గిరిజాల జుట్టు.

అతన్నెక్కడో చూచిన గుర్తొచ్చింది. తలుపు దగ్గరగా వెళ్ళి నిలబడ్డాను. అతనికేసి నిశితంగా చూశాను.

"జేమ్స్!" పెద్దగా అరవబోయి తమాయించుకున్నాను. వీడెందుకిక్కడికి వచ్చాడన్న అనుమానమేసింది.

వీడ్ని నాకు బాగా తెలుసు. మా సరుకంతా దాచివుంచిన భూగృహానికి కాపలా కాస్తుంటాడు. నేనంటే చాలా ఇష్టం

వీడికి. నా దగ్గర డబ్బులు, సిగరెట్లు, విస్కీ సీసాలు తీసుకొంటూ వుంటాడు.

జేమ్స్‌ను కాళ్ళతో, చేతుల్తో, లాఠీలతో తన్నారు అందరూ.

వాడు క్రిందపడ్డాడు. పైకి లేవనెత్తి కొట్టారు. నోరువిప్పి ఒక్కమాట చెప్పలేదు.

లాకప్ రూం తలుపులు తెరిచారు. జేమ్స్‌ని లోనికి నెట్టి తలుపు బిగించారు. వాడు వచ్చి నాకు దూరంగా గోడ వారగా కూలబడ్డాడు.

పలకరిద్దామని అటు కేసి తిరిగాను.

నన్ను తెలీనట్లు తల త్రిప్పుకున్నాడు.

వాడలా ఎందుకు జేశాడో నాకు అర్థంగాలేదు. వాడు కూడా బోరగింతలా పడుకున్నాడు. నాకేం చెయ్యాలో తోచలేదు.

నేనుగూడా కళ్లుమూసుకున్నాను.

ఏదో కారొచ్చి ఆగిన శబ్దమైంది.

కదలకుండా పడుకునేవున్నాను.

“ఖైదీ ఏమయినా సమాచారం చెప్పాడా?” వచ్చినతను అడిగాడు.

“లేదుసార్! లాఠీలు విరిగాయి. చేతులు నొప్పిపుట్టాయి. వాడుమాత్రం నోరువిప్పి మాట్లాడలేదు,” ఆమాటలు అన్నది ఇన్‌స్పెక్టర్ అని సులభంగానే తెలిసింది.

“ఈ గ్యాంగ్స్‌లో మంచి ట్రయినింగ్ ఇస్తారు. వాళ్ళు చావుకు సిద్ధపడతారుగానీ, నిజం చెప్పరు. ఖైదీ ఇప్పుడేం చేస్తున్నాడు?”

“నిద్రపోతున్నాడు సార్!”

ఇన్‌స్పెక్టర్ మాట అబద్ధం కావటం నాకు ఇష్టంలేదు. వెంటనే కళ్ళుమూసుకున్నాను.

"మనం పైఎత్తు వెయ్యాలి. ఖైదీ తప్పించుకునిపోయే అవకాశం కల్పించాలి. అతను తప్పుకోగానే మనం అతన్ని నీడలా వెంటాడాలి. అతనెటూ వాళ్ళ ముఠాను వెతుక్కుంటూ తన స్థావరానికి వెళ్తాడుగా! మనం వెంట వెళ్ళొచ్చు. అందర్నీ పట్టుకోవచ్చు. వాట్ డూ యూ సే!" అడిగాడు వచ్చిన ఆగంతకుడు.

నా ఉత్సాహం కలిగింది. ఈ నాలుగు గోడలనుండి వెలుపలకు బోయే అవకాశం వాళ్ళే కల్పించబోతున్నందుకు నా అదృష్టం తలచుకుని ఆనందించాను. ఆ ఇన్‌స్పెక్టరు ఏమంటాడో విందామని చెవులు రిక్కించాను.

"మంచి ప్లానే! కానీ వాళ్ళు అసాధ్యులు సార్! మన నుండి తప్పుకున్నాక, మనం వెంటాడగలిగే విధంగా వాడు వెళ్తాడని నా అనుమానం."

"డోంట్ బీ ఎ పెసిమిస్ట్. వీణ్ణి పట్టుకొన్నందువల్ల మనకు ఒరిగేది ఏమీలేదు. పెద్దచేపలు కావాలి."

"అలాగే సార్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"గుడ్! ముందు నీ ఏర్పాట్లు పూర్తిచేసుకుని ఆ తర్వాత అతనికి అవకాశం కల్పించు. మనం కావాలనే అతనికి తప్పించుకునే అవకాశం ఇచ్చినట్లు అతనికి అనుమానం కలగకూడదు," అన్నాడతను.

"అలాగే బాస్!" అన్న ఇన్‌స్పెక్టర్ మాటలు, ఆ తర్వాత రెండు నిముషాలకు కారుకదలి వెళ్ళిపోయిన శబ్దం వినవచ్చింది.

ఇన్‌స్పెక్టర్ ఫోన్లు చెయ్యడం ప్రారంభించాడు. ఎవ

రవరితోనో ఏమేమో మాట్లాడసాగాడు. అవన్నీ బహుశా నేను తప్పించుకున్నాక పట్టుకునేందుకు చేస్తున్న ఏర్పాట్లయి ఉండాలనుకున్నాను.

చీకటి పడింది.

ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోయాడు. జవాన్లుకూడా స్టేషన్ బయటున్నట్లున్నారు. గదిలో నేనూ, జేమ్స్ వున్నాం. వాణ్ని మా బాస్ పంపివుండాలనిపించింది. నన్ను రక్షించేందుకు వాళ్ళేం పథకం వేశారో తెలుసుకుందామనుకున్నాను.

మెల్లగా దొర్లుకుంటూ జేమ్స్ దగ్గరగా వెళ్ళాను.

"జేమ్స్!" అన్నాను.

వాడు కదిలాడు. నావైపు తిరిగి కళ్ళు తెరచాడు.

"చిక్కావా?"

"నీకోసం చిక్కుబడ్డాను."

"ఎందుకు?"

"ఇక్కడ్నుంచి తప్పించేందుకు."

"బాస్ పంపాడా?"

"ఆఁ!"

"ఎలా తప్పిస్తావ్?" ఆత్రతగా అడిగాను.

వాడు నాదగ్గరకంటూ వచ్చాడు.

"నాదగ్గర రెండుమాత్రిలున్నాయి. అవి వేసుకుంటే చచ్చినట్లు, చలనంలేకుండా ఉండిపోతాం. మనమీద కేసులు రిజిస్టరు చెయ్యలేదు. లాకప్‌లో ఉండగా ఖైదీలు చనిపోతే బాధ్యత వీళ్ళదవుతుంది. ఉద్యోగాలు పోతాయి. మనం చచ్చామనుకుని శ్మశానంలో పారేస్తారు. అక్కడ్నుంచి మనవాళ్ళు తప్పిస్తారు!" అన్నాడు జేమ్స్.

బాస్ తెలివికి ఆశ్చర్యపోయాను.

కానీ నాకు అనుమానం వచ్చింది. వీళ్లు మమ్మల్ని ఏ శ్మశానానికి తీసుకుపోతారో వాళ్ళకెలా తెలుస్తుంది. పూడ్చివేశాక, గాలి ఆడక చచ్చే అవకాశముంది. నా అనుమానం వ్యక్తంచేశాను. జేమ్స్ నవ్వాడు.

"ఇది సముద్రం ఒడ్డునేవుంది. వెనుకే పూడ్చిపెడతారు. ఎక్కువదూరం తీసుకుపోరు. ఎవరన్నా చూస్తే మాటొస్తుంది. మనవాళ్ళు బోటులో సిద్ధంగా వుంటామన్నారు" చెప్పాడు జేమ్స్.

"ఇందాక వచ్చినాయన చెప్పింది విన్నావా?"

"ఆఁ!"

"వాళ్ళే అవకాశం ఇస్తుంటే మళ్ళీ ఈ మాత్ర లెందుకు."

"ఇది బాస్ ఆర్డరు."

"బాస్‌కు ఇక్కడి విషయాలు బహుశా తెలిసుండవు. అందుకనే అలా చెప్పి పంపాడు."

"నీచేత ఈ మాత్ర మింగించమన్నాడు బాస్. నన్ను కూడా మింగమని చెప్పాడు. ఆయన చెప్పినట్లు చెయ్యకుంటే మన ప్రాణాలు పోతాయి," అన్నాడు జేమ్స్.

నేనేం మాట్లాడలేదు. ఎంత సర్దిచెప్పుకున్నా బాస్ వేసిన పథకంలో నాకు చాలా లొట్లు కనుపించాయి. నాకై నేను తప్పించుకుని వెళ్ళడం వేరు. శవంలా మారిపోయి వాళ్లు బైటపారేస్తే బాస్ వచ్చి రక్షించడం వేరు.

జేమ్స్ ఉత్త మొద్దువెధవ. చెప్పింది చెయ్యడం తప్ప మంచిచెడ్డ లాలోచించే బ్రెయిన్ లేదు వాడికి.

నాకు మరో అనుమానంకూడా వచ్చింది.

వాళ్ళ రహస్యాలు చెప్పివుంటానన్న భయంతో జేమ్స్ ద్వారా తప్పించే సాకుతో విషంపెట్టి చంపేందుకు బాస్

నిర్ణయించాడేమోననీ.

ఈ గ్యాంగ్స్‌లో ప్రాణాలకు పెద్ద విలువలేదు. నేను పోతే నాలాంటివాడింకొకడు దొరుకుతాడు వాళ్ళకు.

ఏమయినా జేమ్స్ తెచ్చిన మాత్రలు వేసుకోకూడదని నిర్ణయించుకున్నాను.

"మాత్ర ఇచ్చేదా?" అడిగాడు జేమ్స్.

"ఇవ్వు!" అన్నాను.

తోలుబెల్టుకున్న చిన్న పర్సులాంటిది తెరిచి అందులో నుండి తెల్లటి మాత్రతీసి అందించి, "వేసుకో!" అన్నాడు.

మాత్ర అందుకున్నాను.

"నీదేది?" అడిగాను.

మరొక బిళ్ళ చూపించాడు.

"వేసుకో!" అన్నాను.

"నువ్వు?"

"నీళ్ళులేంది మింగలేను. ఎవడైనా జవాన్వస్తే నీళ్ళు తెప్పించుకుని మింగుతాను. నువ్వు మింగెయ్యి!" అన్నాను.

నాకున్న అనుమానాలు జేమ్స్‌కి లేనట్లుంది. నోరు తెరచి మాత్రవేసుకొని మింగాడు. గుండెపైన చేత్తో రాసుకున్నాడు.

నిముషంలోనే ఉంగచుట్టుకుని గిలగిల కొట్టుకుని పడి పోయాడు. నోటిగుండా నురుగొచ్చింది.

నా పర్సు చేత్తో వాడినోరు తుడిచి వాసన చూసుకున్నాను. భయంకరమైన వాసన వేసింది.

అది విషమే! అందుకు సందేహంలేదు.

మాత్రతీసి జేబులో వేసుకున్నాను. జేమ్స్‌ని దొర్లించి,

వాడిముఖం కనపడకుండా గోడవైపుకి తిప్పాను. దూరంగావచ్చి పడుకున్నాను.

బాస్ తలపెట్టిన దుర్మార్గం నా కర్థమయింది.

అలాంటి నీచుడి దగ్గరకు తప్పించుకున్నాక వెళ్ళి లాభం లేదు. తన రహస్యాలు చెప్పేశాననన్న భయంతో నన్ను రివాల్వరుతో కాల్చయినా చంపుతాడు.

ఇక్కడ్నుంచి తప్పించుకునే అవకాశం చిక్కితే నా దోవ నేను చూసుకోవాలనుకున్నాను. జేమ్సుకు ఆత్మశాంతి ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థించాను.

కళ్ళుమూసుకుని పడుకున్నాను. కానీ నిద్రమాత్రం రావడంలేదు. బాగా చీకటిపడిపోయినట్లు, గదిలో వెలుగుతున్న లైటుకాంతి ఎక్కువయింది.

ముందురూంలోవున్న గోడగడియారం గంటలు కొట్టడం మొదలెట్టింది. లెఖ్కపెట్టాను. తొమ్మిదికొట్టి ఆగింది.

ఇన్‌స్పెక్టర్ వచ్చాడు. తిన్నగా లాకప్‌రూం తలుపు ముందుకొచ్చి నిలబడ్డాడు.

"ఏయ్! ఖైదీ!" అన్నాడు.

నేను లేచి కూర్చున్నాను.

"ఆకలవుతుందా?" అడిగాడు.

అవుతుందన్నట్లు తలూపాను.

"నీకు అన్నం తెప్పిస్తాను. వెళ్ళి కాలకృత్యాలు ముగించుకురా!" అన్నాడు.

నేను చిన్నగా లేచి నిలబడ్డాను.

ఒక జవానొచ్చి తలుపులకున్న తాళం దీశాడు. నన్ను వెంటబెట్టుకునిపోయాడు. స్టేషనుకు వెనుక వేపునుంది లెట్రిన్, కాంపౌండ్ గోడనానుకుని. దాని వెనుక సముద్రం. చెవులు

చిల్లులు పడుతున్నాయి అది చేస్తున్న హోరుకు.

“అదే లెట్రిన్! వెళ్ళిరా! తప్పించుకునేందుకు ప్రయత్నించావా? మక్కెలిరగదంతాను. నేను ఇక్కడ కూర్చుని బీడిదమ్ము లాగుతుంటాను. సరేనా?” అన్నాడు.

“అలాగే!” అంటూ లెట్రిన్‌లోకి వెళ్ళాను.

నేను వెలుపలికి వచ్చేప్పుడు గమనించాను. స్టేషన్ నిండా జనం వున్నారు. రెండు జీపులు, ఒక వ్యాన్, నాలుగు మోటారుసైకిళ్ళు వున్నాయి. కొంతమంది మఫ్టీలో వున్నారు. బహుశా అందరిదగ్గరా ఆయుధా లుండివుండాలనుకున్నాను.

వాళ్ళు నాకు తప్పించుకొనే అవకాశం కల్పించినా, ఏ పరిస్థితులలోను వాళ్ళ చెయ్యి దాటిపోయేందుకు వీలులేకుండా తగిన కట్టుదిట్టం చేసిపెట్టుకున్నారు.

లెట్రిన్‌లో కూర్చున్నాను. బుర్ర పనిచెయ్యడంలేదు. ఆ జవానును ఒకబీడి అడిగి పుచ్చుకోవలసిందనిపించింది.

రాత్రి రెండింటికి బాస్, అతని ముఠా జూహు బీచ్ దగ్గరున్న స్థావరానికి వస్తుంది. వాళ్ళు వచ్చేలోగా నేను వెళ్ళాలి. అక్కడికి చేరేలోగా ఎక్సయిజ్ వాళ్ళను బురిడీ కొట్టించాలి. మోటార్ బోట్ పట్టుకుని సముద్రంమీద పడితే ఆ తర్వాత నన్ను దేముడుకూడా పట్టుకోలేడు. ధైర్యం కలిగింది.

పాంటువేసుకుని, బటన్లు పెట్టుకున్నాను. గోడ ఎత్తు తక్కువగా వుండటంవల్ల, దూరంగా చెట్టుక్రింద రాయిమీద కూర్చుని బీడీదమ్ము కొడుతున్న జవాను కనుపించాడు.

తప్పించుకోనేందు కేమీ తొందరలేదు. పరుగెత్తవలసిన పనిలేదు. వాళ్ళు నా వెంటబడివచ్చేవాళ్లు తప్ప, నన్ను పట్టుకొనేవాళ్ళు కాదు.

నాకు నవ్వొచ్చింది.

అన్నం లేక ఆకలికి మాడిచస్తానని భయపడ్డాను పొద్దున్న. జేమ్స్ తెచ్చిన మాత్ర మింగి దిక్కులేని చావు చస్తానను కొన్నాను, ఇంతకుముందు.

రెండూ తప్పిపోయాయి. ఖైదులోంచి తప్పుకునిపోయే అవకాశాన్ని ఖైదీకి వాళ్ళే ప్రసాదిస్తున్నారు, వాళ్ళస్వార్థం కోసం.

దాన్ని నాస్వార్థంకోసం వినియోగించ దలచుకొన్నాను. వెనుకవేపు గోడపైకి ఎక్కి దూకాను. సముద్రం ఒడ్డుకు పరుగెత్తాను.

దూరంగా తాజ్-షెరతాన్ హోటల్ కనిపిస్తుంది. అడుగులో అడుగు వేసుకుంటూ మెల్లగా గేట్ వే ఆఫ్ ఇండియాదాకా వచ్చాను. మెట్లెక్కి పైకొచ్చి, సీ వ్యూ కేఫ్ మీదుగా సిటీలో కడుగుబెట్టాను.

నాముందూ, వెనుకా, చుట్టూ ఎక్సైజ్ వాళ్ళున్నారు, మఫ్టీలోవున్నా వాళ్ళ మొహాన గవర్నమెంటు అధికార్లకున్న ముద్రలున్నాయి. వాటిని నాలాంటివాళ్లు సులభంగా ఆనవాలు పట్టగలరు.

జేబులో తడుముకున్నాను. పదిరూపాయలనోటు కనుపించింది.

ఒక దుకాణం దగ్గర ఆగి నోటుమార్చి గోల్డ్ ఫ్లాక్ ఫిల్టర్ సిగరెట్లు కొన్నాను. ఒకటితీసి ముట్టించాను.

దమ్ములాగి వదులుతుంటే హాయిగావుంది. ఊపిరితిత్తులు యథాప్రకారం పనిచేస్తున్నాయి. వెనక్కి చూశాను. నా మొగుళ్ళు వెంటాడుతూనే వున్నారు. ఫ్లోరా ఫౌంటెన్ దాకా

నడిచాను. అక్కడ 'వెస్ట్' బస్సెక్కి దాదర్ రైల్వేస్టేషన్‌కు టిక్కెట్టు పుచ్చుకున్నాను.

మఫ్టీలోవున్న ఎక్సైజుమనిషికూడా నాతో బస్సెక్కాడు. వెనుక వేపు గ్లాసుగుండా రోడ్ కేసి చూశాను. జీప్ వస్తూంది. రెండు మోటార్ సైకిల్స్ బస్ ప్రక్కనే వెళ్తున్నాయి.

సిగరెట్ ముట్టించాను.

కండక్టరొచ్చి బస్‌లో త్రాగొద్దన్నాడు.

గట్టిగా దమ్ములాగి కిటికీగుండా పారేసి "సారీ!" అన్నాను.

కండక్టరు వెళ్ళిపోయాడు.

దాదార్ రైల్వేస్టేషన్ ముందాగింది బస్. దిగాను. ఎడం వేపు దిగి ట్రాఫిక్ సర్కిల్ లో కొచ్చాను. అరమైలు నడిచాను. గంట పదకొండయింది. ఎక్సైజు అధికారులు నన్ను వెంబడిస్తూనే ఉన్నారు.

లూసియానా రెస్టారెంటులో దూరాను. ఇక్కడ్నుంచే వాళ్ళను నేను తప్పుకోవాలి.

నాకీ రెస్టారెంటు బాగా తెలును. దీని ఓనరుతో నాకు ఖాతావుంది. రెండు బిజీరోడ్లను కలుపుతూ వుంటుంది విశాలమైన ఈ రెస్టారెంటు.

క్యాష్‌దగ్గరున్న జిలానీ నన్ను చూడగానే లేచి రాబోయాడు.

అతన్ని వద్దన్నట్లు కళ్ళతోనే వారించాను. అర్థంచేసుకుని ఆగిపోయాడు. వెళ్ళి కూర్చున్నాను టేబుల్ ముందు.

సర్వర్ వచ్చాడు. ఏం కావలసిందీ చెప్పాను. అతను వెళ్ళాడు. సిగరెట్ తీసి వెలిగించాను.

మనసులోనే నా ప్లాను సిద్ధం చేసుకున్నాను.

టాయిలెట్ రూంలోంచి వెలుపలికి ద్వారముంది. దాన్ని మామూలుగా స్కావెంజర్స్ వాడుతారు. లోపలవైపు బోల్టుంది. దాన్ని తెరచుకుని వెలుపలకుపోతే జిలానీ అంబాసిడర్ కారు పార్క్ చేసివుంటుంది. తాళాలెప్పుడూ దానికే వుంటాయి. ఆదివారంనాడు సరుకు తెచ్చి దాంట్లో పెట్టి, అక్కడుంచిన డబ్బుతీసుకొని వెళ్ళిపోవడం తన కలవాటు. తను గుమ్మందాటగానే జిలానీ కారెక్కి వెళ్తాడు.

ఈదినంగూడా అతను తన్ను చూశాక వెళ్ళి కారుతలుపు తెరచి డబ్బుపెట్టి ఉంటాడు. తాళాలు అలాగే వదిలేసి తిరిగొచ్చి క్యాబ్‌లో కూర్చుంటాడు.

తను ఆ కారులో వెళ్ళిపోవాలి!

ఎక్సైజ్ అధికారులు ఐదుమందికిపైగానే వచ్చి అక్కడక్కడా సర్దుకొని కూర్చున్నారు నన్నుచూస్తూ. కౌంటర్‌కు రెండువైపులా ఉంటారు వాళ్ళు.

కార్లో వెళ్ళినా వాళ్ళను తప్పించుకోవడం కష్టమే! కానీ తప్పదు. ఎలాగో ఒకలా వాళ్ళను బురిడీ కొట్టించాలి.

సర్వర్ ఆర్డర్ ప్రకారం అన్నీ తెచ్చిపెట్టాడు. కడుపు నిండా తిన్నాను. రెండుకప్పుల టీ త్రాగాను. బిల్లుతెచ్చేందుకు వెళ్ళాడు సర్వరు.

నేను లేచి టాయిలెట్ రూంలోకి వెళ్ళాను. తలుపులు బిగించాను.

అవతలివేపు బోల్టు తెరచాను. ఎదురుగా అంబాసిడర్ కనుపించింది.

తలుపులు తీసువున్నాయి. వెళ్ళికూర్చున్నాను. ఇగ్నిషన్ కీ వుంది. ముందుసీటుపైన చిన్న బాండ్ కేస్ వుంది. లాకర్ నొక్కాను తెరుచుకుంది. నిండా వందరూపాయల కాగితా

లున్నాయి. అవన్నీ దొంగ నోట్లే!

బ్రాండ్ కేస్ ప్రక్కనే ముస్లిం స్త్రీలు ధరించే నల్లటి పరదావుంది. సంతోషంతో నవ్వొచ్చింది. గబగబ తొడుక్కున్నాను. డోర్ మూసి ఇంజన్ స్టార్ట్ చేశాను. నన్నెవరూ గుర్తించలేరు. చూసినవాళ్ళు ఎవరో ముస్లింబీబీ వెళ్తుందనుకుంటారు.

కార్ను గేటులోగుండా వెలుపలికి దూకించాను.

వాచ్ మెన్ కు అది 'జిలానీ' కారని తెలుసు. లోనున్నది జిలానీ బేగం అనుకుని సెల్యూట్ చేశాడు. నేను గమనించనట్లే ఆక్సిలేటర్ పూర్తిగా నొక్కాను.

రాత్రివేళ కావడంతో రోడ్లు దాదాపు నిర్మానుష్యంగానే వున్నాయి.

హెడ్ లైట్లు ఆఫ్ చేసి వుంచాను.

నల్లటి తారు రోడ్ ను మింగుకుంటూ పోతూంది అంబాసిడర్. సైడ్ మిర్రర్ లోంచి వెనుక వేపు కారేదైనా వస్తుందేమోనని చూశాను. అలాంటి జాడేమీ కనుపించలేదు.

రెస్టారెంటులో నా చుట్టూ కాపలాగా కూర్చున్న ఎక్సైజ్ వాళ్ళు గుర్తొచ్చారు. వాళ్ళ ప్లాను పటాపంచలయినందుకు సిగ్గుతో ఛస్తారు. దానికితోడు వాళ్ళు వదిలించుకోవలసిన జేమ్స్ శవంకూడా వుంది లాకప్ రూంలో.

రెస్టారెంటు వాచ్ మెన్ ని బహుశా ఎక్సైజ్ వాళ్ళు అడుగుతారు. అతను తన ప్రొప్రయిటర్ కారులో బేగం వెళ్ళిపోయిందని చెపుతాడు. దాంతో జిలానీని పట్టుకుంటారు.

అతను నిజం చెప్పడు. చెప్తే అతన్ని నేను ఇరికిస్తానన్న భయం ఎటూ వుంటుంది.

కారు జూహూవైపు ఉరుకుల్తో వెళ్ళసాగింది. నా దోవ

కెవ్వరూ అడ్డంలేదు. ఆనందంగావుంది.

జూహు బీచ్‌రోడ్‌లోవున్న "ఆల్‌నైట్ గ్రాసరీస్టోర్' ముందు కారాపాను.

కార్ను చూచి లోనుండి భాయ్ పరుగెత్తుకొచ్చాడు. పది వందరూపాయల కాగితాలిచ్చి, గొంతుమార్చి కావలసిన వస్తువులు చెప్పాను.

పదినిముషాల్లో తిరిగొచ్చాడు పాకెట్లతో. అన్నీ వెనక సీటులో సర్దమన్నాను. మిగిలిన చిల్లర ముప్ఫయి రూపాయల దాకావుంది. ఇవ్వబోయాడు. వద్దన్నాను. సెల్యూట్ చేశాడు వాడు.

కారు స్టార్టుచేశాను.

బోటు ప్రయాణం గాబట్టి, అందుకు అవసరమైన సామానంతా కొన్నాను. సబ్బులు, విస్కీ సీసాలు, కేన్డ్ ఫుడ్, బ్రెడ్, సిగరెట్లు, అగ్గిపెట్టెలు. టార్చిలైటు, సెల్సు, అన్నీ వున్నాయి. ఇంక కావలసిందల్లా మంచినీళ్ళు మాత్రమే.

మా గ్యాంగ్‌వాడే మోటారు బోట్లలో డ్రమ్ములనిండా నీళ్ళు ఎప్పుడూ స్టాక్‌చేసి పెడతారు. ఈ దినం వాళ్ళకు ప్రయాణం వుంది గాబట్టి ఖచ్చితంగా నీళ్ళు వుంటాయను కొన్నాను.

వాళ్ళ పథకం మార్చుకుని ముందేవచ్చి వుంటే నా ఆట కట్టినట్లే. ఎటు పోయేందుకు వీలుగాదు. పైగా వాళ్ళచేతుల్లో బడితే కాల్చి చంపడం ఖాయం.

అడుగడుగునా ఆపదలే ఎదురయ్యే అర్థంలేని జీవన మార్గాన్ని ఎన్నుకొన్నందుకు నాపై నాకే కోపం వచ్చింది.

ఏది ఏమయినా నేను మళ్ళీ ఖైదీగా చిక్కదలుచుకో లేదు. ఆ నాలుగు గోడలమధ్య, తిండీ తిప్పలు లేకుండా, వాళ్ళచేత తన్నులు తింటూ, వాళ్ళనే అడ్డమైన మాటలు

వింటూ బ్రతకటంకన్నా జేమ్స్ తనకిచ్చిన విషపు మాత్ర మ్రింగి చావడం మంచిదనుకున్నాను.

కారును అతికష్టంమీద ఇసుకలోకి డ్రైవ్ చేశాను. ఒక చోట ఆపాను.

కారుదిగి చుట్టూ చూశాను. ఎవ్వరూ వున్న అలికిడి వినిపించలేదు. అప్పుడప్పుడూ ప్రేమజంటలు తచ్చాడుతుంటారీ ప్రాంతంలో. బ్యాక్ డోర్ తెరచి కొన్న సామానంతా క్రిందపడిందాను తలుపుమూసి. సామాను సర్ది భుజానికెత్తుకొని నడవడం మొదలెట్టాను.

గంట ఒకటయి వుంటుంది.

మరో గంటలో మా ముఠా అక్కడికొచ్చేస్తుంది. వాళ్లు రాకముందే నాపని పూర్తి చేసుకోవాలి.

ఈ పాటికి ఎక్సైజ్ వాళ్లుగూడా నా ఆచూకీ తెలుసుకుని వుండొచ్చు. వాళ్లుగూడా ఏ క్షణంలోనైనా ఇక్కడికి వచ్చే ప్రమాదముంది. ఆల్ నైట్ గ్రాసరీ స్టోరుదాకా వచ్చారంటే వాళ్లు నాజాడ కనుక్కోవడం సులభం.

నడక వేగం పెంచ్చించాను.

దాదాపు మైలుదూరం నడిచాను. త్రోవలో ఎవ్వరూ తటస్థపడలేదు. మా మోటారు బోట్లుండే రహస్య స్థావరం అక్కడికో రెండు ఫర్లాంగులుంటుంది.

టార్చిలైటు వెలిగి ఆరిపోయింది. స్పష్టంగా చూశాను.

నా గుండెల్లో పెద్ద బండపడింది.

నాకన్నా ముందే ఎవరో వచ్చారన్నమాట. వాళ్లు ఖచ్చితంగా మా గ్యాంగ్ మనుషులే అయివుండాలి. నాకెటూ

తోచలేదు.

వెనక్కి బోతే ఎక్సైజ్ వాళ్లు పట్టుకుంటారు. ముందుకు వెళ్ళి మూతాంవాళ్ళకు చిక్కి, నిర్దాక్షిణ్యంగా వాళ్ళ చేత చంపబడటం నా కిష్టంలేదు.

అక్కడే నిలబడి సముద్రంకేసి చూశాను.

చిక్కటి చీకటి సముద్రంలో ప్రతిబింబిస్తూంది. అంతా పెద్ద నల్లటి తెరలాగుంది తప్ప నాకేం కనపడడంలేదు.

ఏది ఏమైనా ముందుకే వెళ్ళాలని తీర్మానించుకున్నాను.

ఒకరిద్దరు మనుష్యులైతే నేను సులభంగా వాళ్ళను తన్న గలను. నాకు అన్నిరకాల కుస్తీపట్లు తెలుసు. గ్యాంగ్‌లో చేరాక 'జూడో' కూడా నేర్పించారు. వాళ్ళదగ్గర ఆయుధా లుంటే మాత్రం నేను చెయ్యగలిగిందేమీ లేదు.

ముందుకు నడక సాగించాను.

మా స్థావరం దగ్గరవుతున్నకొద్దీ నా కళ్ళలో సత్తువ మాయమై నీరసం చోటు చేసుకుంటోంది. ధైర్యం సడలి పోయి అధైర్యం పెరుగుతూన్నట్లు తోచింది.

ఎవరో ఇద్దరు మనుషులు ఇసుకలోవున్న బోటును సముద్రం లోకి తోసేందుకు ప్రయత్నిస్తున్నారు. వాళ్లు మావాళ్లు కాదు.

నేను దగ్గరకు వెళ్ళాను.

"ఎవరు నువ్వు?" అడిగాడు ఒకతను.

"ఎందుకొచ్చావ్?" గర్జించాడు రెండోవాడు.

ఇద్దరూ బాగా బలంగా ఉన్నారు. వాళ్ళ చేతుల్లో రివా ల్వర్లున్నాయి.

"మీరెవరు?" అడిగాను నేను.

"నీ కనవసరం?"

"ఇంక ఐదునిమిషాల్లో మా గ్యాంగ్ మొత్తం వస్తుంది. మొత్తం నలభైమందిదాకా వున్నారు. వాళ్ళదగ్గర నాటు బాంబులున్నాయి. ఆటోమేటిక్ మెషిన్ గన్స్ వున్నాయి. తమ స్థావరంలో కడుగుబెట్టిన వాళ్ళను నిర్దాక్షిణ్యంగా చంపి పారేస్తారు! తెలుసా?" వాళ్ళను భయపెడితే నా ద్రోవకు అడ్డులేకుండా వెళ్ళిపోతారన్న ఆశతో చెప్పాను.

"రానీ! అందర్నీ పక్షుల్ని కాల్చినట్లు కాలుస్తాము" అన్నాడు నిర్భయంగా.

"సాహసించకండి! ప్రాణాలుపోతాయి" చెప్పాను.

"పోనీ! మేమొచ్చింది వజ్రాలకోసం. ఈ దినం పర్షియన్ సింధుశాఖనుండి పాసెంజరులైనరు వస్తుందట. దాంట్లో కోట్లు ఖరీదుచేసే వజ్రాలున్నాయి. వాటిని మీ గ్యాంగ్ అందుకోనేందుకు వస్తుందని మాకు సమాచారం వచ్చింది. మధ్యలోనే వాటిని కాజేసేందుకు వచ్చాం!" అన్నారిద్దరూ.

"మీరెవరో చెప్పండి.వీలైతే నేనుగూడా మీకు సాయం చేస్తాను" అన్నాను.

"నిజంగానా?" అడిగారు వాళ్ళు.

"నిజంగానే! నన్ను ఎక్సైజ్ వాళ్లు పట్టుకున్నారు" అంటూ అప్పటిదాకా జరిగిందంతా క్లుప్తంగా చెప్పాను.

అంతా విన్నాక వాళ్ళకు నాపైన నమ్మకం కలిగింది.

"నువ్వు తెచ్చిన సామాన్లు బోట్ లో పెట్టు!" ఆజ్ఞాపించారు.

అలాగే చేశాను.

"ఇదిగో రైఫిల్ తీసుకో!" స్పేర్ గావున్న రైఫిల్ అందించారు.

"వీలైనంతవరకు మీ గ్యాంగ్ తో మేము తలపడం! వాళ్లు అనవసరంగా మా ప్రోవకు అడ్డంవస్తే కాల్చేస్తాం! నువ్వు కూడా వున్నావు గాబట్టి ఇంక భయంలేదు. మనం ముగ్గురం వాళ్ళను హతమారుద్దాం! ఆ వజ్రాల్లో నీకు నాలుగో వంతు ఇస్తాం!" అన్నారు.

"అలాగే!" అన్నాను.

బోట్ ను సముద్రంలోకి నెట్టేందుకు ప్రారంభించాం. మామూలుగా పదిమందిమి కలసి పోరాడితేతప్ప అదికదలదు. మేము ముగ్గురం ఊగబెట్టి, దమ్ము తెచ్చుకుని శక్తినంతా కేంద్రీకరించి తోశాం. కదిలింది బోటు. మెల్లగా ఇసుక లోంచి నీళ్ళలోకి చేర్చాలి. సముద్రం అల్లకల్లోలంగావుంది. అలలు పెద్దగాలేచి పడుతున్నాయి.

ముగ్గురం బోటెక్కాం.

ఒకతను డ్రైవింగ్ వీల్ దగ్గర చేరాడు. కంపాస్ తీసి చూశాడు. ఎనభై ఆరు డిగ్రీలకు సర్ది పెట్టాడు.

"మనం మూడుమైళ్ళు వెళ్ళాలి!" అన్నాడతను.

"అంతేనా?" రెండో అతను నన్నడిగాడు.

"దాదాపుగా అంతే దూరం వుంటుంది" అన్నాను.

సముద్రపు ఒడ్డున కలకలం బయలుదేరింది. చీకట్లో అటూ ఇటూ తచ్చాడుతూ ఆకారాలు కనుపించాయి.

"మన బోట్ దొంగిలించా రెవరో?" అరిచారు ఒకరు.

సముద్రం పైకి టార్చ్ వేశారు. మా బోటు దాదాపు ఫర్లాంగు దూరంలో వుంది. అయినా టార్చి వెలుగు మాదాకా వచ్చింది.

"వాళ్ళొచ్చేశారు?" చెప్పాను.

"రానీ! ఫరవాలేదు. బోట్ స్లో చెయ్యి. సముద్రంమీదనే వాళ్ళ అంతు తేల్చుకుందాం. మనం షిప్ దగ్గరకు బోయే లోగా వీళ్ళను మట్టుబెట్టాలి!" చెప్పాడు ఇంజన్ దగ్గరున్న వ్యక్తి.

"దట్స్ గుడ్!" రెండో వ్యక్తి మొదటి వ్యక్తిని సమర్థించాడు.

"వాళ్ళదగ్గర మెషిన్‌గన్స్ వున్నాయి. బోట్‌లో దాదాపు పదిహేనుమందిదాకా వస్తారు. మనం బ్రతికి బయట పడగలమా?" అన్నాను అనుమానంగా.

"అలా బెంబేలుపడకు! ధైర్యంగా వుండు. మేమిద్దరం షూటింగ్‌లో ఎక్స్‌పర్ట్లం. మా తడాఖా చూపిస్తాం!" అన్నారిద్దరూ ఒకేసారి.

వాళ్ళతోడు దొరికినందుకూ, మా గ్యాంగ్‌కన్నా నేను సముద్రంలో ముందున్నందుకూ, ఆనందంగా వుంది.

ఖైదీగా చావడంకన్నా, స్వేచ్ఛాజీవిగా అనంతమైన సముద్రంమీద ప్రాణాలకోసం పోరాడుతూ చావడం మెరుగనిపించింది. రైఫిల్ తీసి అమ్యునిషన్ నింపుకొన్నాను.

మా గ్యాంగ్ బోటు సర్రుమంటూ నీళ్ళను చీల్చుకుంటూ, అలలను తప్పుకుంటూ మావైపు రావడం గమనించాను.

చెవులు చిల్లులుపడేలా 'ఢా'మ్మని మ్రోగింది మెషిన్‌గన్

దూరంగా. బుల్లెట్ మా బోట్ ముందుదాకా దూసుకొచ్చి నీళ్ళలో పడింది.

"మిస్టర్ జాన్!" అన్నా డొకతను.

"యస్!" అన్నాను.

"నువ్వు వీల్ దగ్గరుండు. యుద్ధం మేంచేస్తాం. మనం బహుశా వాళ్ళ షూటింగ్ రేంజ్‌లో వున్నట్టున్నాం. ఇంకా స్త స్పీడుపెంచు!" ఆదేశించాడు.

నేను వీల్ వద్దకు వెళ్ళిపోయాను.

అతను బోటు పైకెక్కాడు.

(ఇంకా వుంది)

## చివరి పేజీ వినోదం

## 25

"ఏరా రామూ! నీ వాక కొట్లో అర్ధణా వస్తువుకొని, కొట్టు వాడికి అణా యిచ్చావనుకో! అప్పుడు కొట్టువాడు నీకు ఏమిస్తాడు" అడిగాడు టీచరు.

"ఒక చెంప దెబ్బండి." జవాబిచ్చాడు రాము.

"ఏం...? ఎందుకని?" ఆశ్చర్యంగా అన్నాడు టీచరు.

"మరి యిప్పుడు అణాలు చెల్లవు కదండీ," అన్నాడు రాము.

అంతే, టీచర్ వెర్రి మొగం వేశాడు.

* * *

"నీ పరీక్ష పోయినందుకు చాల ఆశ్చర్యంగా వుందోయ్?"

"అందులో ఆశ్చర్య పడాల్సిందేముంది?...నా ముందతన్ది కూడా పోయింది!"

* * *

విలేఖరి:—మీరు ప్రొద్దుట బహిరంగ సభలో ప్రజలకుచేసిన వాగ్దానాలను దయచేసి మళ్లీ చెబుతారా? మా ఈవెనింగ్ ఎడిషన్‌లో వచ్చే ఏర్పాటుచేస్తాను.

మంత్రి:—సారీ! గుర్తులేవు...మా సెక్రటరీ నడగండి!

—కోనె హరిబాబు, ఏలూరు.

## 26

ఒక ఇంగ్లీషు యువతి ఒక ఇండియన్ డాక్టరు వద్దకెళ్ళింది.

"డాక్టర్, నాకో అబ్బాయి పుట్టే అవకాశం ఉందేమో చూడండి," అడిగింది.

"ఓ యస్. అయితే ముందు మీబట్టలన్నీ విప్పేసి ఆ మంచం మీద పడుకోండి," అన్నాడు డాక్టరు.

"నో, నో...నాకు కావలసింది ఇంగ్లీషు అబ్బాయి. ఇండియన్ అబ్బాయి కాదు," అంటూ విసవిస నడిచివెళ్ళి పోయిందా యువతి.

* * *

ప్రేమికుడు:—(ప్రేమకురాలి తమ్ముడితో) రూపాయ ఇస్తాను. మీ అక్కయ్యకు ఈ లెటరిచ్చి, నన్ను గురించి ఏమందో వచ్చి చెబుతావా?

ప్రేమకురాలి తమ్ముడు:—రెండు రూపాయలిస్తే మానాన్న గారు మిమ్మల్ని ఏం చేయాలనుకుంటున్నారో కూడా చెబుతాను.

* * *

ముగ్గురు నవాబులు రైల్లో ప్రయాణం చేస్తున్నారు. ఆస్తి అంతా హరించుకుపోయినా వారిలో దర్పం మాత్రం ఇంకా తగ్గలేదు.

దిగవలసిన స్టేషన్లో ముగ్గురూ దిగారు.

మొదటివాడు ఠీవిగా కూలిని కేకేసి "ఇదిగో, నా బెత్తాన్ని స్టేషను బయటదాక మోసుకురా," అంటూ చేతి కర్రను అందించాడు.

రెండవవాడు మరీదర్పంగా "ఏయ్, కూలీ! ఇదిగో నా టిక్కెట్టును మోసుకు పద," అంటూ కూలీ చేతికి టిక్కెట్టును అందించాడు.

మూడవవాడు గంభీరంగా కూలీని కేకేసి, "ఏయ్! నన్ను

స్టేషన్‌మాస్టర్ దగ్గరకు మోసుకెళ్లి నేను టిక్కెట్టు కొనలేదు,'' అన్నాడు.

* * *

ఒకాయన ''స్వర్గానికి ప్రవేశం కల్గించే''వంటూ మూఢప్రజలకు ఏవో టిక్కెట్లు అంటగట్టి బాగా డబ్బు పోగుచేశాడు. ఓ అర్ధరాత్రి పూట ఆయన ఇంట్లో ఓదొంగ ప్రవేశించి ఆయనకు దొరికిపోయాడు.

ఆ దొంగను పట్టుకుని, ''అబ్బీ! దొంగతనం చెయ్యబోయావు కనుక నువ్వు, తప్పకుండా నరకానికి పోతావు.'' అని బెదిరించాడు.

''నాకా భయమేంలేదు సామీ, సొరగానికి తీసుకుపోయే టిక్కెట్లు రెండు మీకాడనే కొన్నాను,'' అన్నాడా దొంగ జంకు గొంకులేకుండా.

—కోడూరి నీలకంఠారెడ్డి, కర్నూలు.

# 27

రాధ:—మోహన్! నీకెంత వస్తుంది ఆస్థి?

మోహన్:—డార్లింగ్! ఆస్థిగోల మనకేల? మాకు లేకపోయినా మీనాన్నకు ఉందిగా ఆస్థి.

* * *

''నరుడా! ఏమి నీ కోరిక?'' అంటూ ప్రత్యక్షమైంది దీపంలోని భూతం.

''నాకు వెంటనే ఒక బస్తా బియ్యం, 50 కిలోలు గోధుమలు, 4 పాల డబ్బాలు, యింకా...''

''సారీ, రాంగ్ ల్యాంప్'' అంటూ మాయమైంది దీపంలోని భూతం.

* * *

"రాత్రి పారిపోయిన ఖైదీ తిరిగి వచ్చేశాడు సార్."

ఇనస్పెక్టర్‌తో చెప్పాడు పోలీస్ 404.

"బయటకెళ్ళి అన్ని వస్తువుల ధరలూ కనుక్కొని ఉంటాడు. అందుకే మళ్ళీ వచ్చేశాడు." తాపీగా అన్నాడు ఇనస్పెక్టరు.

—కె. పార్వతి, విజయనగర్ కాలనీ.

## 28

ఇద్దరు బాలురు స్కూలునుండి తిరిగివస్తూ మాట్లాడు కుంటున్నారు.

మొదటివాడు:—నువ్వెప్పుడన్నా ఏడుపు వచ్చేవరకు నవ్వావురా?

రెండవవాడు:—ఈరోజు వుదయమే నవ్వుతూ ఏడ్చానురా!

మొ. వా:—ఎలాగరా, చెప్పు?

రె. వా:—మానాన్న మెట్లెక్కుతూ జారి కిందపడ్డాడు. అది చూచి నవ్వాను. తలకాయ బొప్పి కట్టినట్టు మొట్టారు, వెంటనే ఏడుపు లంకించుకున్నాను.

* * *

కస్టమరు:—మిష్టర్! ఎవరన్నా మీవద్ద డబ్బు తిరిగి తీసుకోవటం మరిచి పోయారనుకోండి. అప్పుడు మీరేం చేస్తారు?

క్యాషియరు:—వెంటనే ఆ డబ్బుకు బిల్లువ్రాసి, చెత్త బుట్టలో పారేస్తాను.

* * *

దర్శకుడు:—మా డ్రామా చాలా సంతోషంగా ముగిసింది కదాండి?

ప్రేక్షకుడు:—నిజమే! త్వరగా ముగిసినందుకు అందరు చాలా సంతోషించారు.

—అడపా రామక్రిష్ణ, విశాఖపట్టణం.

# 29

ఇన్‌స్పెక్టర్:—నిన్నరాత్రి మీఇంట్లో దొంగలు పడ్డారు కదా? ఏయే వస్తువులు పోయాయి.

"బీరువాలో పెట్టిన 50 వేల రూపాయలు, ఇరవై తులాల బంగారం, హాలులో పెట్టిన అయిదు లీటర్ల పెట్రోలుతో వున్న డబ్బా." చెప్పాడా యజమాని ఘోరుమని విలపిస్తూ.

* * *

ఒకసారి ఒక మతిమరుపు ప్రొఫెసర్ సాయంకాలం తన ఫ్రెండ్ ఇంటికి వెళ్ళాడు.

గంట, రెండుగంటలు, మూడుగంటలు దాటింది.

అయినా ప్రొఫెసరు కదలలేదు.

ఇంక ఉండబట్టలేక ఆఖరికి అన్నాడు ఫ్రెండ్:

"రాత్రయింది, ఇంకనైనా ఇంటికి వెళ్ళుతారా?"

"ఏమిటి, ఇది నీ ఇల్లా? నాఇల్లు అనుకుని నువింకా కదల వేమిటా అని చూస్తున్నాను." అన్నాడు ఆ మతిమరుపు ప్రొఫెసర్.

* * *

అర్ధరాత్రి పూట పడుకున్న రమణమూర్తి హఠాత్తుగా లేచి కూర్చుని, "దొరికింది" అని దాదాపుగా అరిచినంతపని చేసాడు.

"ఏమిటి? ఏమిటి?" అయోమయంగా ప్రశ్నించాడు మిత్రుడు మూర్తి.

"చివరిపేజి వినోదానికి జోక్!!"

—పానుగంటి బదరీ నారాయణ, విజయవాడ.



